శ్రీరస్తు

# శ్రీభాష్యసారము

శ్రీబాదరాయణమహర్షి ప్రణీతములైన బ్రహ్మసూత్రములకు

భగవద్రామానుజుల శ్రీభాష్యము ననుసరించి

వ్రాయబడిన ఆంధ్రవ్యాఖ్యానము

ప్రథమభాగము (1, 2 అధ్యాయములు)




రచయిత :

**K. S.** రామానుజాచార్యులు **M.A.,**

ప్రిన్సిపాల్

శ్రీ వేదసంస్కృత కళాశాల, నెల్లూరు .. 524 003


1990

శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః



భగవద్రామానుజులవారు

శ్లో॥ యోనిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మ ।
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధోః,
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥



ఉ. వే. శ్రీమాన్ కిడాంబి వేంకటనరసింహాచార్యస్వామి

సహధర్మచారిణి శ్రీ అ॥ సౌ॥ జానకమ్మ గారు



ఉ. వే. శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామి

Recipient of President Award,
"तर्कवाचस्पतिः" "शास्त्ररत्नाकरः"
उभयवेदान्तविद्वान्, "दर्शनसार्वभौमः"
**डा. एन्. एस्. रामानुजताताचार्यः**
Vice-Chancellor,
Rashtriya Sanskrit Vidyapeetha,
TIRUPATI.

श्रीमते रामानुजाय नमः

# प्रस्तावना

"अस्मान्मायी सृजते विश्वमेतत् तस्मिंश्चान्यो मायया संनिरुद्धः", "मायां तु प्रकृतिं विद्यान्मायिनं तु महेश्वरम्", "क्षरं प्रधानममृताक्षरं हरः क्षरात्मानावीशते देव एकः", "स कारणं करणाधिपाधिपो न चास्य कश्चिज्जनिता न चाधिपः", "ज्ञाज्ञौ द्वावजावीशनीशौ", "भोक्ता भोग्यं प्रेरितारं च मत्वा", "तयोरन्यः पिप्पलं स्वाद्वत्ति अनश्नंश्चान्यो अभिचाकशीति", "पृथगात्मानं प्रेरितारं च मत्वा" इत्यादीनि उपनिषद्वचांसि जीवः, प्रकृतिप्राकृतरूपः जडप्रपञ्चः, परमात्मेति त्रयाणां परस्परं भेदं, परमात्मनः प्रपञ्चजीवोभयनियन्तृत्वं च प्रतिपादयन्ति।

"सर्वं खल्विदं ब्रह्म", "अयमात्मा ब्रह्म", "तत्त्वमसि", "सदेव सोम्येदमग्र आसीदेकमेवाद्वितीयम्" इत्यादीनि श्रुतिवाक्यानि जीवप्रपञ्चयोः परमात्मतादात्म्यं व्यपदिशन्ति। तत्र भेदाभेदयोर्विरोधात् अभेदस्य पारमार्थिकत्वं भेदस्य मिथ्यात्वं चाद्वैतिनः निरूपयन्ति स्म। तत्रापि परमात्मनः चेतनस्य जडप्रपञ्चतादात्म्यायोगात् जडब्रह्मणोस्तादात्म्यव्यपदेशः 'चोरः, स्थाणुः' इत्यादाविव बाधार्थः। जीवब्रह्मणोस्तु स पारमार्थिक इत्यातिष्ठन्ते

इति संकल्पसूर्योदये। भेदश्रुतिः परस्परभेदं प्रतिपादयति; घटकश्रुतिः प्रपञ्चब्रह्मणोः शरीरात्मभावं प्रतिपादयति। अभेदश्रुतिः प्रपञ्चशरीरकतया प्रपञ्चविशिष्टस्य ब्रह्मणः ऐक्यं बोधयति—इत्यातिष्ठन्ते।

विशिष्टाद्वैतिप्रदर्शितरीत्या श्रुतीनां निर्वाह एव ब्रह्मसूत्रकारस्य बादरायणस्य संमतः। तथाहि—"भेदव्यपदेशाच्चान्यः", "गुहां प्रविष्टावात्मानो हि तद्दर्शनात्", "न च स्मार्तमतद्धर्माभिलापाच्छारीरश्च", "भेदव्यपदेशात्", "भूमा संप्रसादादध्युपदेशात्", "सुषुप्त्युत्क्रान्त्योर्भेदेन", "अधिकं तु भेदनिर्देशात्", "अधिकोपदेशात्तु बादरायणस्यैवं तद्दर्शनात्" इत्यादिसूत्रैः परमात्मनः चेतनाचेतनाभ्यां भेदं सिद्धान्तयति। "तदधीनत्वादर्थवत्", "अन्तर्याम्यधिदैवाधिलोकेषु", "ज्योतिरुपक्रम्य तु तथा ह्यधीयत एके" इत्यादिसूत्रैः चेतनाचेतनयोः परमात्मशरीरत्वं, तदधीनस्वरूपस्थितिप्रवृत्तिकत्वं च स्पष्टीकरोति। "नाभाव उपलब्धेः" इति सूत्रे उपलभ्यमानस्य प्रपञ्चस्य मिथ्यात्वं निराकरोति। जीववाचिना शब्देन परमात्मनः अभिधाने जीवशरीरकतया जीवेऽन्तर्यामितया स्थितिरेव हेतुरिति "अवस्थितेरिति काशकृत्स्नः" इति सूत्रेण आविष्करोति। "अंशो नानाव्यपदेशात् अन्यथा चापि दाशकितवादित्वमधीयत एके" इति सूत्रं विशिष्टाद्वैतसिद्धान्तस्य मूलम्। अत्र हि भेदाभेदश्रुत्योरविरोधनिर्वाहाय जीवः परमात्मांशः इति स्वीकरणीयमिति वदति। अंशत्वं चेदं परमात्मविशेषणत्वमेव, अन्यस्य दुर्वचत्वात्। एवं जडप्रपञ्चस्य परमात्मना सह भेदाभेदश्रुत्योरविरोधनिर्वाहाय परमात्मविशेषणत्वं सिद्धान्तयति "उभयव्यपदेशात्तु अहिकुण्डलवत्" इत्यारभ्य। 'पूर्ववद्वा' इति सूत्रे पूर्ववत् इत्यस्य "अंशो नानाव्यपदेशात्" इत्यत्रोक्तरीत्येत्यर्थः। एवं च चिदचितोः परमात्मापृथक्सिद्धविशेषणतया परमात्मांशत्वात् अपृथक्सिद्धविशेषणवाचिनां

स्म। द्वैतवेदान्तिनस्तु प्रपञ्चजीवयोः ताभ्यां परमात्मनश्च भेदं पारमार्थिकमातिष्ठमानाः अभेदवचांसि "राजा राष्ट्रम्" इत्यादौ राजाधीनत्वात् राष्ट्रे राजव्यपदेश इव परमात्माधीनत्वात् सर्वस्य चिदचिदात्मकप्रपञ्चस्य परमात्मव्यपदेशरूपाणीति न्यरूपयन्। एतन्मते राजपदस्य राजाधीने लक्षणावत् परमात्मवाचकपदस्य परमात्माधीने लक्षणया लाक्षणिकस्तादात्म्यव्यपदेशः।

विशिष्टाद्वैतवेदान्तिनस्तु— 'यः पृथिव्यां तिष्ठन् पृथिव्या अन्तरो यं पृथिवी न वेद यस्य पृथिवी शरीरं यः पृथिवीमन्तरो यमयति", "य आत्मनि तिष्ठन्नात्मनोऽन्तरो यमात्मा न वेद यस्यात्मा शरीरं य आत्मानमन्तरो यमयति स त आत्मान्तर्याम्यमृतः" इत्यादीनि अन्तर्यामिब्राह्मणगतानि वाक्यानि भोक्तृभोग्यरूपेणावस्थितयोश्चिदचितोः परमात्मशरीरत्वं, परमात्मनियाम्यत्वं, परमात्मनस्तदुभयनियन्तृतया तदात्मत्वं च अभिदधति। लोके च शरीरवाचित्वेन प्रसिद्धाः शब्दाः तदन्तर्याम्यात्मपर्यन्तवाचकतया प्रसिद्धाः, देवदत्तो जानाति, बालो युवा जातः इत्यादौ। तथा सर्वस्यापि चेतनाचेतनात्मकप्रपञ्चस्य परमात्मानं प्रति शरीरत्वात् शरीरभूतचेतनाचेतनवाचकः शब्दः तदात्मभूतपरमात्मपर्यन्ताभिधायी। तथा च "सर्वं खल्विदं ब्रह्म", "तत्त्वमसि" इत्यादिसमानाधिकरणवाक्यानि जडजीवप्रपञ्चशरीरकं ब्रह्मेति प्रतिपादयन्ति, न स्वरूपैक्यम्। अतः सर्वा अपि श्रुतयः समञ्जसार्था भवन्ति। तदुक्तं वेदान्तदेशिकैः—

मिथो भेदं तत्त्वेष्वभिलपति भेदश्रुतिरहो
विशिष्टैक्यादैक्यश्रुतिरपि च सार्था भगवती।
इमावर्थौ गोप्तुं श्रुतिभिरपराभिः प्रणिदधे
निरीशो लक्ष्मीशः सकलजगदन्तर्यमयिता॥

शब्दानां तद्विशिष्टवस्तुवाचितायाः घटः नीलः, इयं गौः इत्यादौ दर्शनात् 'इदं सर्वं ब्रह्म' इत्यादौ सर्वशब्दः प्रमाणावगम्यचेतनाचेतनात्मकविशेषण-विशिष्टपरः सन् तदैक्यं ब्रह्मणः प्रतिपादयति। शरीरशब्दस्यापि अपृथक्-सिद्धविशेषणद्रव्यमित्येवार्थः। तथा चाभेदश्रुतेः विशिष्टैक्यपरत्वम्। भेदश्रुतेः स्वरूपभेदपरत्वम्, घटकश्रुतेर्विशेषणविशेष्यभावप्रतिपादकत्वम इति यः सिद्धान्तः व्यासेन सूत्रेषु प्रदर्शितः स एव भगवद्रामानुजाचार्यपादैः परिजगृहे। तदुक्तम् अधिकरणसारावल्याम—"तत्स्थत्वात सूत्रकारो यदिह निरवहत् व्याससिद्धान्त एष" इति

व्यासकृतानां ब्रह्मसूत्राणां "दीपः, सारः, श्रीभाष्यम्" इति त्रीणि व्याख्या-नानि भगवद्रामानुजाचार्यपादैः अन्वग्राहिषत। संस्कृतभाषायां न्यायमीमां-सादिशास्त्रेषु च येषां पाण्डित्यमस्ति त एव तानि व्याख्यानि अवगन्तुं पारयन्ति। परं तु बहवः संस्कृतशास्त्रव्युत्पत्तिरहिता अप्यास्तिकाः ब्रह्मसूत्र-तात्पर्यं ज्ञातुमिच्छन्ति, वेदान्तव्युत्पत्तिं च कामयन्ते। तेषामुपकाराय नातिसंक्षेपविस्तरं तेलुगुभाषायां ब्रह्मसूत्रतात्पर्यबोधकः श्रीभाष्यसारनामा प्रबन्धः नेल्लूरु संस्कृतमहाविद्यालये प्राचार्यपदमधिष्ठितवद्भिः न्यायव्याकरण-वेदान्तादिबहुशास्त्रपण्डितैः आन्ध्र-आङ्गलादिनानाभाषाविद्भिः आचार्यपुरुषैः श्री· उ· वे. श्रीनिवासरामानुजाचार्यैः विरचितः प्रकाशमुपयातीति महानयमा-स्तिकानामानन्दस्य विषयः। व्याख्यानत्रयमपि मनसिकृत्य सावधानं सरलया रीत्या विरचितोऽयं ग्रन्थः न केवलं सामान्यजनानाम अपि तु पण्डितानामपि प्रमोदमादधाति। ईदृशात्युपयुक्तग्रन्थप्रकाशादिना लोकोपकारं कुर्वाणा एते महाविद्वांसः एवमेवोपर्युपरि प्रयतन्तामिति भगवन्तं वेंकटाचलाधीशं श्रीश प्रार्थये।

**डा. एन्. एस्. रामानुजताताचार्यः**
राष्ट्रियसंस्कृतविद्यापीठम्
तिरुपति

तिरुपति,
12-3-90

# అభినందనమ్

***

**Prof. S.B. Raghunathacharya**
Professor & Head
Department of Sanskrit
S. V. University, TIRUPATI - 517 502 (A.P.)

భవ్యమైన భారతీయసంస్కృతికి నిదానభూతములు వేదములు. సకలవేదసారభూతార్థములను మానవజాతి కందించుటకు భగవాన్ వేదవ్యాసుడు బ్రహ్మసూత్రములను రచించెను. ప్రస్థానత్రయమునందు బ్రహ్మసూత్రములకు సమున్నతమైన స్థానము కలదు. కాలక్రమమున సూత్రార్థమును వివరించుటకు ఎన్నియో భాష్యములు, వ్యాఖ్యానములు, ఉపవ్యాఖ్యానములు, టీకలు ఏర్పడినవి. శ్రీ శంకర భగవత్పాదులు అద్వైతపరముగను, శ్రీ భగవద్రామానుజులు విశిష్టాద్వైతపరముగను, శ్రీ భగవదానందతీర్థులు ద్వైతపరముగను బ్రహ్మసూత్రములకు భాష్యములను వెలయించిరి. పారిభాషికపదభూయిష్ఠమగు వారి శాస్త్రీయభాషను అర్థము చేసికొని, తత్త్వార్థమునుగ్రహించలేనివారికొఱకు ఈ భాష్యముల కన్నింటికి తెనుగులో అనువాదములేర్పడినవి. భాష్యములలోని విస్తృతమగు వాదప్రతివాదములను గ్రహించవలెనన్న కొంతకుకొంత వేదాంతపరిజ్ఞానమవసరమగుచున్నది అది కొద్దిమందికే సాధ్యమగును. కనుక సూత్రార్థమును సంగ్రహముగ తెలియజేయుచు ఆయా అధికరణములసారమును విశదపరచుగ్రంథము లీనాడు ఎంతో అవశ్యమగుచున్నవి. ఈ దృక్కోణము నవలంబించి శ్రీ భగవద్రామానుజులవార నుగ్రహించిన శ్రీభాష్యమునందలి సారభూతమైన అర్థమును ఉభయవేదాంతప్రవర్తకులు, శ్రీమాన్ కిడాంబి శ్రీనివాసరామానుజాచార్యుల వారు "శ్రీభాష్యసారము"ను పేర మనకందించినారు.

శ్రీమాన్ ఆచార్యులవారు ఆబాల్యము సంప్రదాయబద్ధమైన

అధికరణబోధాచరణప్రచారములయందు లబ్ధప్రతిష్ఠులైన విద్వద్వరేణ్యులు వేదాంతశాస్త్రమున తలస్పర్శిపాండిత్యము గలవారు. విశేషించి నిగూఢ మున తత్త్వార్థములను సరళసుందరముగా అందరకు అందించవలెనను తహతహగలవారు. వీరు ఇటువంటి కార్యమును చేపట్టుట ఆంధ్రుల భాగ్యవిశేషము. శ్రీవైష్ణవ సంప్రదాయాభిరతులకు వీరి రచన షడ్రసోపేతమగు విందు వంటిది. స్థాలీపులాకముగ కొన్ని అధికరణముల పరిశీలించితిని. సూత్రార్థమును శ్రీభాష్యచ్ఛాయలో అన్యూనానతిరిక్తముగ వీరు కృత్యకృత్యులైనారను నమ్మకము నాకు కలిగినది. పాఠకులకును అదే అనుభూతి తప్పకకలుగగలదని నా దృఢవిశ్వాసము.

భాష్యకారుల దివ్యానుగ్రహము పుష్కలముగనున్నగాని ఇంతటి పవిత్రకార్యమును నిర్వహించు భాగ్యమబ్బదు. భగవద్భాగవతాను గ్రహపూర్ణులగు శ్రీమాన్ రామానుజాచార్యులవారిని తోటి ఆంధ్రుల కలసి హార్దము నభినందించుచున్నాము. పద్మావతీజాని శ్రీనివాసాను గ్రహము వారికి నితోధికముగ కలుగవలెనని మనసారాప్రార్థించుచున్నాను

" రామానుజాచార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్ "

తిరుపతి,
19-3-1990

ఎస్. బి. రఘునాథాచార్యః



# పరిచయము

సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ
ఆకెళ్ళ అచ్చుతశాస్త్రి
ఆంధ్ర శాఖాధ్యక్షులు,
శ్రీవేంకటేశ్వర ఓరియంటల్ కళాశాల,
తిరుపతి.

1939వ సంవత్సరములో నేను నెల్లూరు మూలపేటలో ఉన్న శ్రీ వేదసంస్కృతకళాశాలలో విద్యార్థిగా చేరాను. అప్పట్లో నా కక్కడ పరిచయమైనవారిలో మా ప్రాంతము వారు శ్రీ సామవేదం సోమనాథ శాస్త్రి, శ్రీ రాటి కృష్ణమూర్తి మున్నగు వారు. వారితో సన్నిహిత సంబంధము కల శ్రీమాన్ కె. ఎస్. రామానుజాచార్యులు గారితో పరిచయమైనది. ఆ పరిచయం కూడా నేను నెల్లూరులో దిగిన రోజునే కలిగింది. అది మొదలు నేటివరకు మా పరిచయము దివసపరార్థ ఛాయవలె వర్ధిల్లుచునేయున్నది.

వాసుదేవోఽపి జగ్రాహ ప్రీతిం పార్థేన శాశ్వతీమ్ (ఆది-234-13)

"న వినా విప్రలంభేన శృంగారః పుష్టి మశ్నుతే" అన్నట్లు అప్పుడప్పుడు మా మధ్యలో ప్రణయకలహాలు రాకపోలేదు. అవి క్షణ భంగురములైనవి.

"ఏష నారాయణః కృష్ణః ఫాల్గునశ్చ నరః స్మృతః।
నారాయణో నరశ్చైవ సత్త్వమేకం ద్విధా కృతమ్॥(48-21)

అన్నట్లు మా శరీరాలు వేరు కాని మనస్సులు ఒకటే. సంబంధబాంధవ్యానికి అనుగుణంగానే "శ్రీ సంస్కృతభాషా ప్రవేశిక" అనే సరళ సంస్కృతవ్యాకరణ గ్రంథాన్ని రచించి ప్రచురించాము. నెల్లూరు వేదసంస్కృత కళాశాలలో కొంతకాలము సహోపన్యాసకులముగా పని

చేసినాము. 1984 వ సంవత్సరములో తిరుపతి S.V.O. కళాశాలకు రావలయునని ఇరువురము ప్రయత్నించితిమి. శ్రీ ఆచార్యులు గారు కారణాంతరములవలన రాలేదు. కాని నేను తిరుపతి చేరితిని. శరీరమే తిరుపతి చేరినది. కాని "తత్తు తత్రైవ రమతే" అన్నట్లు మనస్సు ఆచార్యులు గారితోనే ఉండిపోయింది.

శ్రీ ఆచార్యులు గారు, నేను రోజూ ఏదో సందర్భంలో కలిసికొని అనేక చర్చలు, గోష్ఠులు జరుపుతూ ఉండేవారము. మూలపేటలో ఉన్న శ్రీ వేణుగోపాలస్వామివారి దేవాలయంలో ఉన్న వాన మామలై మఠంలో వారు ఉండేవారు. ఆ మఠంమీద ఉండే గది ఎపుడు నాకై తెరచి ఉండేది. ఆ మిద్దెమీద ఎల్లప్పుడు నా పాఠాలు వల్లిస్తూ ఉండేవాడిని. రాత్రంతా నేను వల్లించిన పాఠాలు దగ్గరలోనే ఉన్న పూజ్యప్రాయులు, V.R. కాలేజి ప్రిన్సిపాల్, కీ. శే. శ్రీమాన్ రాఘవన్‌గారు రాత్రంతా విని, ఉదయాన్నే వచ్చి, రాత్రి నేనుచదివిన పాఠాలన్నీ ఒప్పచెప్పేసేవారు. శ్రీరామానుజాచార్యులవారు ప్రత్యక్ష గురువులు కారపోయినా అనేక విషయాలు ఆయన దగ్గర చదువు కున్నాము. శ్రీ ఆచార్యులు గారు శారీరకంగా బలహీనులే. కాని సాహిత్యంలో, శాస్త్రసిద్ధాంతాల్లో దిట్టలు. అనేక సందర్భాల్లో అనేకమైన శాస్త్రీయాంశాలు చర్చిస్తూఉండేవారము. ముఖ్యంగా బ్రహ్మసూత్రాల విషయంలో శ్రీ ఆచార్యుల వారు మతత్రయ ఆచార్యుల భాష్యాలు చదివి, వాటిల్లో ఉండే భేదాలు ప్రతినిత్యం నాకు శ్రుతపరుస్తూ ఉండే వదిచి. నాకు పెద్దగా చెవికెక్కకపోయినా వింటూ ఉండేవాడిని. నేను శ్రద్ధగా వింటున్నానని ఆచార్యుల వారు మరిదీక్షగా పరిశోధన చేసి మరిమరీ నాకు వినిపిస్తూ ఉండేవారు. నాకు శాస్త్రమసారం ఒంటబట్ట లేదనేది సత్యం, కాని, ఆచార్యులవారి కృషి మాత్రం నా శిష్యులకంతో మర్రిచెట్టులా పెరిగిపోయింది. తత్ఫలితంగా ఆచార్యులు గారు మత

త్రయ ఆచార్యుల భాష్యాలను బాగా లోతుగా పరిశీలించి, ఒకపుస్తకం వ్రాశారు. దానిని ముద్రించాలని అనుకున్నారు. కాని ముద్రణభారం మోయలేక విరమించుకున్నారు.

శ్రీ ఆచార్యులగారు కేవలం పండితులేకాదు, మంచికవులు కూడ, అందులోను సత్కవికోటికిచెందిన కవివతంసులు. వీరి కవితాఝరి అనర్గళముగా సాగిపోవును. నిండా ఇరువది ఏళ్ళు రాకముందరే "శుక సందేశః" అను సందేశకావ్యాన్ని మృదుమధురశైలితో రచించి, నెల్లూరు మూలపేటలో ఉన్న శ్రీవేదసంస్కృతకళాశాల వ్యవస్థాపకులు, ప్రాతఃస్మరణీయులు, మా గురువర్యులు, శ్రీ బ్రహ్మశ్రీ వేద మూర్తులైన గాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారికి అంకితమొసంగి, వారిచే ఆశీర్వదింపబడినారు. "కవిసామ్రాట్" కీ.శే. విశ్వనాథ సత్యనారాయణ గారి "హాహాహూహూ" అను నవలను అనువదించిరి. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి "స్వప్నము", "నేడు"అను కవితాఖండికలను "ఉల్లేఖమంజరి" అనుపేర సంస్కృతమున అనువదించి, ప్రశంసల నందుకొన్నారు. సంస్కృతమున ఎన్నో వ్యాసములను రచించిరి. ఖండికలుగా రచించిన వీరి పద్యాలలో ఎన్నో వెలుగుచూడలేదు. వాటినన్నిటిని ఏకీకరించి, త్వరలోనే సారస్వతప్రియులకు అందించ గలరని ఆశిస్తున్నాము.

శ్రీఆచార్యులుగారు సంప్రదాయబద్ధులు. వీరి ఆచారవ్యవహారము లన్నీ కులక్రమాగత విధివిధానము ననుసరించియే యుండును, కాని ఆధునికభావాలు కలవారు. ఇతరుల ఆచార వ్యవహారములను, మత సంప్రదాయములను ఎల్లప్పుడుమన్నించుచునేయుందురు. క్రమంగా వచ్చే సామాజికపరిణామాన్ని అడ్డరాదనేదే వీరి సిద్ధాంతము.

ప్రస్తుతము వీరు "శ్రీభాష్యసారము" అను పేర బ్రహ్మసూత్రము లకు శ్రీరామానుజభాష్యమును అనుసరించి తెలుగున లఘుటీకను రాసి

ప్రచురించుచున్నారు. ఇది వీరి చిరకాలవాంఛితఫలము. ఇట్లే భగవద్గీత కును తెలుగునటీకమ్రాసి శ్రీమద్వరవరమునీంద్రుల వ్యాఖ్యానమును కలిపి వీరు ప్రకటించుచున్నారు, సంస్కృతభాషాపరిచయము అంతగా లేని తత్త్వజిజ్ఞాసువులకు తొలిదశలో ఈ గ్రంథములు అత్యంతము ఉప కరింపగలవనుట నిర్వివాదము.

పూర్వపక్షసిద్ధాన్త ఖండనమండనాదులతో హడలెత్తించక, వివక్షి తాంశమును సరళమైన శైలిలో తెలియజేయుట ఈ రచనలోగల విశేషము. శ్రీభాష్యసారమును రెండుభాగములుగను, భగవద్గీతా మృతమును మూడు భాగములుగను ప్రచురించుచున్నారు.

వీరి శ్రీభాష్యసారమును సమగ్రముగ పరిశీలించితిని. "నామూలం లిఖ్యతే కించిత్, నానపేక్షిత ముచ్యతే" అను సూక్తిని అను సరించియున్నది. ప్రతిఅధికరణమునకును, అవసరమైనయెడలసూత్ర ములకును అవతారికలనుకూడ వ్రాసియుండిన పాఠకులకు మరింత ఉపకారకమై యుండెడిది. ప్రతిపాదమునకు చివర ఆ పాదమునందు ప్రతిపాదింపబడిన అర్థవిశేషములను సంగ్రహము తెలిపెడి శ్రీమద్వే దాన్త దేశికవిరచిత "అధికరణసారావళీ" శ్లోకమును తాత్పర్యముతో ఇచ్చుట, ప్రతి అధికరణమునకు ప్రారంభమున సూత్రప్రాయముగ ఆ అధికరణార్థమును ప్రదర్శించుట ప్రశంసనీయములు.

బ్రహ్మసూత్రములకు వేదాన్తశాస్త్రమునగల స్థానము అద్వితీయము. ఇవి ఉపనిషదర్థవిచారప్రవణములు "బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతు మద్భి ర్వినిశ్చితైః" (గీ-13-4) అని భగవద్గీతయు వీనిని ప్రస్తుతించిది వైదికమతాచార్యులందరు వీనికి భాష్యములవ్రాసి ధన్యులైనారు. అట్టివారిలో మతత్రయాచార్యుల భాష్యములు ప్రచుర ప్రచారము నందియున్నవి.

ప్రసన్న గంభీరమైన శ్రీమద్రామానుజుల శ్రీభాష్యము నను

సరించి సారరూపమున తెనుగులో వ్రాయబడిన శ్రీభాష్యసారము విశిష్టాద్వైతతత్త్వజిజ్ఞాసువులగు ఆంధ్రపాఠకులను అలరించుగాక!

తావన్యోన్యం సమాశ్లిష్య పృష్ట్వా చ కుశలం వనే।
ఆస్తాం ప్రియసఖాయౌతౌ నరనారాయణా వృషీ॥(ఆది-218-5)

శరణం చ ప్రపన్నానాం శిష్టాః కుర్వన్తి పాలనమ్।
శరణం త్వాం ప్రపన్నాః స్మ తస్మాత్ త్వం క్షంతు మర్హసి॥
(ఆది- 21 -6)

శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్। (గీత 2-7)

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాపి॥ (గీత- 11-41)

యచ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు।
ఏకోఽథవా వ్యచ్యుత। తత్సమక్షం
తత్క్షామయే త్వా మహ మప్రమేయమ్॥ (గీత- 11-42)

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥ (గీత-12-8)

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥
(గీత- 18-62)

యోఽహం తమర్జునం విద్ధియోఽర్జునః సోఽహమేవతు। (మౌ-6-22)

తిరుపతి,
25—3—91

ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రి

# విషయసూచిక

—O—





శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# విజ్ఞప్తి

శ్రీమద్రామానుజుల శ్రీభాష్యము ననుసరించి బ్రహ్మసూత్రము లకు ఆంధ్రమున లఘుటీకాతాత్పర్యములు వ్రాయవలయునను సంకల్పము నాకు చిరకాలముగ గలదు. భగవదనుగ్రహమున నేటికి ఇది ఫలప్రదమైనది. ఈ రచనకు నన్ను తొలుత ప్రోత్సహించినవారు ఉపనిషదుద్యానకోకిలేత్యాదిబిరుదాంకితులు, గోదాగ్రంథమాలను స్థాపించి, శతాఽధికసంప్రదాయగ్రంథములను లఘుటీకలతో ప్రచురించినవారునైన, శ్రీమాన్ కె టి. ఎల్. నరసింహాచార్యులుగారు. దీనికి ప్రోద్బలకులు "సంగీత సాహిత్య కళానిధి" శ్రీమాన్ ఎస్ సి హెచ్. కృష్ణమాచార్యులవారు, రిటైర్డ్ సంగీతవిద్వాంసులు ఎ. ఐ. ఆర్. విజయవాడ, శ్రీమాన్ కె.వి.ఆర్. నరసింహాచార్యులు, ఎం.ఏ., గారు, లెక్చరర్, ఓరియంటల్ కాలేజి, చిననింద్రకొలను, పశ్చిమగోదావరి జిల్లా. ఈ ఆచార్యత్రయమునకు సర్వదా కృతజ్ఞుడను.

నావంటి సామాన్యుడు ఇట్టి గురుతరకార్యమును సాధింపబూనుకొనుట సాహసమే! కాని "నిరుంధ్యాః కే వింధ్యాఽచలవికటసంధ్యానటజటా పరిభ్రష్టా పంగో రుపరి యది గంగా నిపతతి" అను శ్రీమద్వేదాన్తదేశికశ్రీసూక్తి నాయందు ఈ రూపమున ఫలించినది అని తలంతును. నిరంకుశస్వతంత్రుడగు శ్రియఃపతి సంకల్పించినచో ఎవనిచే ఏ కార్యమును చేయింపలేడు?

భగవద్రామానుజులు నాకృపామాత్రప్రసన్నాచార్యులు అని ప్రసిద్ధిగాంచినవారు. కావుననే అనేకశాస్త్రన్యాయజటిలమైన శ్రీభాష్యమును

సామాన్యులు అధికరింపజాలరని తలంచి, వారే స్వయముగ బ్రహ్మ సూత్రములకు "వేదాన్త దీపము", "వేదాన్తసారము" అను రెండు లఘు - లఘుతర వ్యాఖ్యలను అనుగ్రహించినారు. బ్రహ్మసూత్రార్థ మును స్పష్టముగ తెలిసికొనుటకు ఇవి చక్కగ ఉపకరింపగలవు. కావున వీనిని అనుసరించియే ఈ లఘుటీక వ్రాయబడినది. ఇందు సూత్రము, ప్రతిపదార్థము, వివరణము క్రమముగ నీయబడినవి ప్రతి అధికరణమునకును ప్రారంభమున ఆ అధికరణముయొక్క సారాం శము ఒక్క వాక్యములో సూత్రీకరింపబడినది. ప్రతిపాదమునకు చివర శ్రీమద్వేదాన్త దేశికులువారు అనుగ్రహించిన "అధికరణ సారావళి" నుండి ఆయాపాదార్థసంగ్రహశ్లోకము, దానితాత్పర్యము ఒసంగబడినవి

అలసశిరోమణి నగు నాచేత శ్రీభాష్యసారము క్రమము తప్ప కుండ చెప్పించి, చాలఓర్పుతో మూడునెలలలో స్వయముగ వ్రాసిపెట్టిన అభినవ శ్రీవత్సాంకమిశ్రులు, శ్రీయుతులు నేలనూతల శ్రీకృష్ణమూర్తి గారు ఎం ఏ., బి.ఎల్., అడ్వకేట్, నెల్లూరు. వీరు గొప్పపరిశోధకులు. సంస్కృతాంధ్ర - ఆంగ్లభాషావిశారదులు. వీరు సంగీతసాహిత్య నృత్యప్రియులు. వీనికి సంబంధించిన అనేక వ్యాసములను ఆంగ్ల మున వ్రాసినారు. అవి దేశవిదేశపత్రికలయందు ప్రచురితములైనవి. వాల్మీకిరామాయణమును ఆంగ్లమున వచనరూపమున అనువదించినారు. వీరి చిరకాలపరిశ్రమఫలితమైన వ్యాసనూచికను ఆంధ్రసాహిత్యఅకా డమి, హైదరాబాద్ వారు ప్రచురించినారు. ఇది పరిశోధకులకు మహో పకారకము. వీరు సహృదయులు, స్మితపూర్వాభిలాషి, మితభాషి, హితభాషి. అరువదియేండ్లవయస్సుకలయ్యు తరుగని ఉత్సాహము కలవారు. వీరివలె వీరి సతీమణి లక్ష్మీసౌభాగ్యవతి పార్వతమ్మ గారును విదు షీలలామ ఈమె "రామచరిత్రమానసామృతము", "జాయసి-పద్మావతి" అను హిందీ గ్రంథములను ఆంధ్రమున అనువదించినారు. "పవిత్ర గోదావరీనది" అనునది వీరి స్వతంత్రరచన. వీరి సాహచర్యము

శ్రీకృష్ణమూర్తిగారి రచనావ్యాసంగమునకు ప్రోత్సాహకరము. ఇట్టి ఈ పుణ్యదంపతులకు "నమోవాకం ప్రశాస్మహే".

ఈరచనను ముద్రించుటకు మార్గదర్శకులు అస్మన్మిత్రధేయము, విద్వత్కవిశిరోమణి, శ్రీమాన్‌ముదివర్తి కొండమాచార్యులుగారు. రిటైర్డ్ తెలుగు పండితులు, గూడూరు. వీరికి నా కృతజ్ఞలు.

ఏతద్గ్రంథమునకు పదివేలరూప్యకములను అందించిన తిరుమల-తిరుపతి దేవస్థానాధికారులకు సర్వథా కృతజ్ఞుడను. నేను ప్రార్థించి నంతనే నా యీ రచనను సమీక్షించి, అమూల్యములైన తమ అభిప్రాయములను, ఆశీర్వచనములను అనుగ్రహించిన న్యాయవ్యాకరణ మీమాంసావేదాన్త శిరోమణి, విద్యావారిధి, శాస్త్రరత్నాకర, తర్క వాచస్పతి, దర్శనసార్వభౌమ, ఉ.వే. శ్రీమాన్ ఎన్. ఎస్. రామానుజ తాతాచార్యులు, వైస్‌ఛాన్సలర్, రాష్ట్రియ సంస్కృత విద్యాపీఠమ్, తిరుపతి గారికి............

న్యాయశిరోమణి, డా॥ శ్రీమాన్. ఎస్. బి. రఘునాథాచార్యులు, Professor in Sanskrit, శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయము, తిరుపతి గారికి............

రాఘవగుణరత్నకోశాద్యనేక గ్రంథ రచయిత, విద్యాప్రవీణ, బ్రహ్మశ్రీ ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రి, బి. ఏ., ఆంధ్రశాఖాధ్యక్షులు, ఓరియంటల్ కళాశాల, తిరుపతి గారికి సౌహార్దమేదుర ప్రణామములు.

శ్రద్ధతో ప్రూఫులను పరిచూచిముద్రణ స్ఖాలిత్యములను తొలగించి, మహోపకారమొనర్చిన అస్మద్భాగినేయుడు, విద్యాశా వినయశీలి, చిరంజీవి, శ్రీమాన్ ఈయుణ్ణి అళహశింగరాచార్యులు,

ఎం.ఏ., సంస్కృతోపన్యాసకులు, శ్రీవేంకటేశ్వర జూనియర్‌కాలేజి, తిరుపతి గారికి అనేక మంగళాశాసనములు.

ఈ గ్రంథమును చక్కగ ముద్రించి ఇచ్చిన శ్రీమాన్ D.S.P రామకృష్ణ, మేనేజర్, శ్రీ సత్యసాయి ప్రింటర్స్, తిరుపతి గారికి శుభాశీస్సులు. ఇక ఈ రచనము చదువ నుత్సహించు సహృదయాంధ్ర పాఠకులకు సర్వదా స్వాగతము.



శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# ఉపోద్ఘాతము

భారతీయులకు వేదములు పరమ ప్రమాణములు. ఇవి అపౌరుషేయములు. ప్రత్యక్షాదిప్రమాణములచే తెలిసికొనుటకు సాధ్యముకాని ఆధ్యాత్మిక - ఆధిదైవికవిషయములను తెలియజేయునవి గావున (వేదయతీతి వేదః) వీనికి వేదములు అను సార్థకనామము ఏర్పడినది. ఋగ్యజుస్సామాథర్వ భేదములచే ఈ వేదములు నాల్గువిధములు. ఒక్కొక్కవేదము మంత్రములు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు అను అవాంతరవిభాగములను కలిగియున్నది. ఆరణ్యకముల చివరి భాగములకు ఉపనిషత్తులు అనిపేరు. కావున వేదలతల అగ్రాంతములే ఉపనిషత్తులు. "ఉపనిషత్" అనగా పరబ్రహ్మ సన్నిధిని చేర్చునది. (ఉపనిషాదయతీతి ఉపనిషత్) అని అర్థము. ఈ ఉపనిషచ్ఛాస్త్రమే వేదాంతశాస్త్రము. ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యక - ఐతరేయములు దశోపనిషత్తులుగా ప్రసిద్ధములైయున్నవి. శ్రీశంకరులు మొదలగు అనేకులు ఆచార్యులు వీనికి భాష్యములను వ్రాసియున్నారు.

వేదములు, కర్మకాండ బ్రహ్మకాండము అని రెండుకాండములుగ విభజింపబడియున్నవి. వీనికి పూర్వకాండము, ఉత్తరకాండము అని వ్యవహారము. బ్రహ్మతత్త్వమును బోధించునది ఉత్తరకాండము కాగా, తదారాధనారూపములైన యజ్ఞయాగాదికర్మలను బోధించునది పూర్వకాండము. కర్మకాండము ఆరాధనవిధాన బోధకము; బ్రహ్మకాండము ఆరాధ్యస్వరూపబోధకము. ఇట్టి వేదముల అర్థములను చర్చించుటకై ఏర్పడిన శాస్త్రము మీమాంసాశాస్త్రము. మీమాంస

అనగా చర్చ లేక విచారము అని అర్థము. పూర్వకాండార్థమును విచారించు శాస్త్రము పూర్వమీమాంసాశాస్త్రము. ఇది కర్మమీమాంస, దేవతా మీమాంస అని రెండువిధములు, ఉత్తరకాండార్థ విచారకశాస్త్రము ఉత్తరమీమాంసాశాస్త్రము. ఈ విషయము ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ కర్మదేవతాబ్రహ్మగోచరా,
సా త్రిధోద్భభౌ సూత్రకారతః।
జైమినేర్మునేః కాశకృత్స్నతో
బాదరాయణాదిత్యమ్యుక్రమాత్॥ (తత్త్వరత్నాకర)

జైమినిమహర్షిప్రవర్తింపజేసినకర్మమీమాంసాశాస్త్రమునుపూర్వమీమాంస అనియు, బాదరాయణమహర్షి ప్రవర్తింపజేసిన బ్రహ్మమీమాంసాశాస్త్రమును ఉత్తరమీమాంస అనియు వ్యవహరింతురు. కాశకృత్స్న మహర్షి ప్రవర్తింపజేసినదేవతాకాండకుసంకర్షణకాండ అనినామాంతరము గలదు. మూలముగా దొరకుట లేదని పలువురి అభిప్రాయము. కర్మ మీమాంస ఇదిడునే యథాయందు పన్నెండు అధ్యాయములు, దేవతా మీమాంసయందు నాల్గుఅధ్యాయములు బ్రహ్మమీమాంసయందు నాల్గు అధ్యాయములు గలవు, కావుననే వృత్తికారుడు బోధాయనుడు "సంహితమేతత్ శారీరకం జైమినీయేన షోడశలక్షణేనేతి శాస్త్రైకత్వసిద్ధిః" అని తెలిపినాడు. సమగ్రవేదార్థవిచారకమగుటచే పై మూడువిధము లైన విభాగములుగల మీమాంసాశాస్త్రము.

" అంగాని వేదాశ్చత్వారః
మీమాంసా న్యాయవిస్తరః।
పురాణం ధర్మశాస్త్రం చ
విద్యాహ్యేతాశ్చతుర్దశ॥

అని వరించిన చతుర్దశవిద్యలలో ఒకే శాస్త్రముగా పరిగణింపబడినవి. కొందరు పూర్వోత్తరమీమాంసాశాస్త్రములు భిన్నశాస్త్రములని తలంతురు

వీనిలో ఉత్తరమీమాంసాశాస్త్రమునకు బ్రహ్మమీమాంస, శారీరక

మీమాంస, వేదాంతశాస్త్రము అను నామాంతరములు గలవు. బాద
రాయణమహర్షి రచించిన బ్రహ్మసూత్రములతో ఈ శాస్త్రము ఆరంభ
మగుచున్నది. బాదరాయణులకాలమునకే ఉపనిషద్వాక్యములు
వ్యాఖ్యాన సాపేక్షములైనవి. కావుననే వారు సూత్రరూపమున వాని
అర్థములను సహేతుకముగ వివరించిరి. భగవద్గీతలలో "బ్రహ్మసూత్ర
పదైశ్చైవ" అనియుండుటచే భగవద్గీతకు ముందే ఈ సూత్రములు
రచింపబడినవని తలంపవచ్చును. పాణిని "పారాశర్యశిలాలిభ్యాం
భిక్షునటసూత్రయోః" అను సూత్రమున పారాశర్యవిరచిత భిక్షు
సూత్రములను పేర్కొనియున్నాడు. ఆ భిక్షుసూత్రములే బ్రహ్మసూత్ర
ములై యుండవచ్చునని పలువురి ఆశయము. అట్లయినచో పాణినికి
ముందే బ్రహ్మసూత్రరచన జరిగియుండును. వ్యాసబాదరాయణులు
ఒక్కరే అని సంప్రదాయము. భిన్నులని ఆధునిక విమర్శకులు
తలంచుచున్నారు.

ఈ బ్రహ్మసూత్రములకు తొలివ్యాఖ్యానము బోధాయనవృత్తి.
టంక లేక తంక అను నామాంతరముగల బ్రహ్మనంది రచించిన వాక్య
గ్రంథము. వీరి వెనుక ద్రమిడాచార్యులు పై వాక్యగ్రంథమునకు
భాష్యము రచించిరి. శంకరాదులకు పూర్వము భాష్యకారుడు అనగా
ఈ ద్రవిడభాష్యకారుడు అనియే అర్థము. గుహదేవుడు పై భాష్యము
నకు టీకను వ్రాసెను. నేడు ఈ గ్రంథము లేవియు లభించుటలేదు.

ద్వైతాద్వైతవిశిష్టాద్వైతములని ప్రసిద్ధిలో నున్న మతములకు
ప్రవర్తకులు శ్రీమధ్వ, శంకర, రామానుజులు. ఈమతములు అనాదిగా
వచ్చుచున్నవే. వేదములలోను ఉపనిషత్తులలోను ఈ సిద్ధాంతము
లకు సమర్థకములైన ప్రమాణవాక్యములు కోకొల్లలుగ కన్పించు
చున్నవి. వీరు బ్రహ్మసూత్రములకు భాష్యములను తమతమ సిద్ధాంత

ములకు అనుగుణముగ రచించియున్నారు. వీరేకాకభాస్కర,యాదవ ప్రకాశ, నింబార్క, శ్రీకంఠ, శ్రీపతి, వల్లభ, శుక, విజ్ఞానభిక్షు, బల దేవాదులును భాష్యములను రచించినారు. బ్రహ్మసూత్రములయందు సాంఖ్య – యోగ – వైశేషిక – బౌద్ధ – జైన – పాశుపత – పాంచరాత్ర మతములు విమర్శింపబడినట్లు భాష్యకారులు వివరించియున్నారు. ఆ మతముల సంగ్రహ పరిచయము.*

## సాంఖ్యమతము

శ్లో॥ "మూలప్రకృతిరవికృతి
ర్మహదాద్యాః ప్రకృతివికృతయస్సప్త ।
షోడశశ్చ వికారో
న ప్రకృతిర్నవికృతిః పురుషః ॥ (సాం. కా. ౩)

సామ్యావస్థలో నుండు సత్త్వరజస్తమోగుణములుగలది మూలప్రకృతి. ఇది దేనికిని వికృతి (కార్యము) కాదు. ఇది అచేతనము చేతనుని యొక్క భోగాపవర్గములకు హేతువైనది. మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు, ఆకాశాది పంచభూతములు-ఇవి వికృతములు. (కార్యములు) వీనిలో మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలును ప్రకృతులు, వికృతులుకూడ (కారణములు కార్యములు) అగుచున్నవి. తక్కినవి కేవల వికృతులు. పురుషుడు ప్రకృతిగాని, వికృతిగాని కాడు. ఇతడు నిత్యుడు.

---

*గమనిక : ఈ మతములనుగూర్చి వివరముగ తెలిసికొనగోరువారు శ్రీ అనుభవానన్దస్వాములవారి (బాపట్ల) సర్వదర్శనసారభమును, కులపతి, గీతాచార్య ఉ.వే. శ్రీమాన్ తే.కం. గోపాలాచార్య స్వామివారి సర్వదర్శన సంగ్రహమును చదువగోరిక, ఆశ్రమం, నడిగడ్డపాలెం, వయా చుండూరు, గుంటూరు (జిల్లా)

నిర్లిప్తుడు, చైతన్యమాత్ర స్వరూపుడు, కర్తృత్వభోక్తృత్వములు, ప్రకృతిధర్మములు గాని, పురుష ధర్మములు గావు. కుంటివాడు, గ్రుడ్డివాడు కలిసి ప్రయాణించురీతిని ఈ ప్రకృతిపురుషులు ప్రపంచ యాత్ర సాగించుచుందురు.

ఈ తత్త్వములయొక్క స్వరూపస్వభావములను చక్కగ తెలిసి కొనలేకపోవుటచే పురుషుడు ప్రకృతిధర్మములను తనలో ఆరోపించు కొని, తానే కర్త, భోక్త, అని భ్రమించి, సంసారియగుచున్నాడు. ఈ తత్త్వములయొక్క స్వరూప స్వభావాదికములను చక్కగ తెలిసికొని నచో, కేవలచైతన్యస్వరూపుడై పురుషుడు ముక్తుడగును. మూల ప్రకృతియొక్క కార్యము ఈ జగత్తు. ఇది త్రిగుణాత్మకమైయున్నది. కావున దీనికి కారణమైన మూలప్రకృతియు త్రిగుణాత్మకమైయుండ వలయును అని వీరి సిద్ధాంతము.

సాంఖ్యమతమునకు ప్రవర్తకుడు కపిలమహర్షి. ఇతడుసత్కార్య వాది. అనగా నువ్వుగింజలో నూనెవలె, పాలలో వెన్నవలె, కొయ్యలో నిప్పువలె కారణమునందే కార్యము దాగియున్నది అని భావము. కారణమునందు లేనిది ఏదియు కార్యరూపము దాల్పలేదు అనిభావము. వీరు ఈశ్వరుని అంగీకరింపరు.

ఈ సాంఖ్యసిద్ధాంతమునే అంగీకరించుచు, ఈశ్వరునికూడా అంగీ కరించువారు సేశ్వరసాంఖ్యులు. వీరివేయోగమతస్థులనియు అందురు

## వైశేషికమతము

గవాక్షరంధ్రములద్వారా వచ్చు సూర్యకిరణములలో సూక్ష్మాతి సూక్ష్మములైన కణములు చూపట్టుచుండును. కంటికి కనబడు ఇట్టి గుణములను త్ర్యణుకములు అని అందురు. ఇవి ద్వ్యణుకములచే ఏర్పడుచున్నవి. ఈద్వ్యణుకములు పరమాణువులచే రూపొందుచున్నవి పరమాణువులు నిరవయవములు.

ప్రళయకాలమున ఈ పరమాణువులు నిశ్చలములై యుండును. ఈశ్వరునకు జగత్తును సృష్టింపవలయును అనుసంకల్పము కలుగుట తోడనే, ఈ పరమాణువులయందు చలనము ఏర్పడి ఇవి ఒకదానితో కలియబడును. రెండు పరమాణువుల కలయికచే ద్వ్యణుకము ఏర్పడు చున్నది. మూడుద్వ్యణుకముల కలయికచే త్ర్యణుక మేర్పడును, ఈ రీతిగా పృథివ్యాదులుఏర్పడుచున్నవి. ఈశ్వరాధిష్ఠితములైన పరమాణు వులు జగత్కారణములు అగుటచే అవి అచేతనములైనములైనను ఈశ్వరేచ్ఛను పురస్కరించుకొని, జగత్సృష్ట్యాదులను గావింపగలుగు చున్నది.

ఇట్లు అనేక పరమాణువులు జగత్కారణములు అనుటకంటె సాంఖ్యులు చెప్పిన రీతిగ మూలప్రకృతి జగత్కారణమనుట లాఘవము గదా అని తలంపరాదు. ఒకే వస్తువునకు సంయోగసంబంధము ఉండదు. సంయోగసంబంధము లేనిచో అది జగత్తునకు ఆరంభకము కాలేదు. కావున పరమాణువులే జగత్కారణములు.

ఈ మతమునకు ప్రవర్తకుడు కణాదమహర్షి. విశేషము అను ధర్మమును ప్రత్యేకముగ అంగీకరించుటచే ఇతని మతమునకు వైశేషికమతము అనిపేరు.

## బౌద్ధులు

వైభాషికులు, సౌత్రాన్తికులు, యోగాచారులు, మాధ్యమికులు అని బుద్ధుని శిష్యులు నాల్గువర్గములుగ ఏర్పడియున్నారు.

వీరిలో వైభాషికులు, సౌత్రాన్తికులు బాహ్యపదార్థముల అస్తిత్వమును అంగీకరింతురు. ప్రత్యక్షముగ చూడబడుచున్న ఘట పటాదిబాహ్య పదార్థముల అస్తిత్వమును వైభాషికులు ఉన్నది ఉన్నట్లు అంగీకరించుచుండగా, సౌత్రాన్తికులు జ్ఞానముచే అవి అను మేయములు అని అనుచున్నారు.

వైభాషిక, సౌత్రాన్తికుల తత్త్వప్రక్రియ—

1 రూపరసగంధస్పర్శస్వభావములుగల పార్థివపరమాణువులు,
2 రూపరసస్వభావములు గల జలపరమాణువులు,
3 రూపరసస్వభావములుగల తైజసపరమాణువులు,
4 స్పర్శస్వభావముమాత్రము గల వాయుపరమాణువులు.

ఈ నాల్గువిధములైన పరమాణువులును పరస్పరము కలిసి జగత్సృష్టికి కారణములగుచున్నవి. తొలుత ఈ పరమాణువులనుండి పృథివ్యాది భూతచతుష్టయము ఏర్పడును. వానినుండి శరీరేంద్రియాదులు వాని వాని గుణములతో ఏర్పడుచున్నవి. ఈ విధముగ పదార్థములు "అణుహేతుక" సముదాయములు, "భూతహేతుక" సముదాయములు అని రెండు విధములుగ ఏర్పడుచున్నవి. ఈ పదార్థములే ప్రత్యక్ష విషయములగుచున్నవి అని వైభాషికుడు తలంచును.

సౌత్రాన్తికులు — నీలాద్యాకారజ్ఞానముచే నీలఘటాది బాహ్య పదార్థములు అనుమేయముల నితలంచుచున్నారు. పరమాణురూపము పరమాణుసంఘాతరూపము అయిన ఈజగత్తుక్షణికముఅని వీరిమతము.

యోగాచారులు — ఇతడు విజ్ఞానమొక్కటియే తత్త్వమని తలంచును. విజ్ఞానభిన్నమైన పదార్థమేదియు లేదు. ఘటఘటాది పదార్థములు ఆయా రూపాదికములతో జ్ఞానమున భాసించుచున్నవి. కావున ఘటపటాదులతో సమానమైన రూపాదికము జ్ఞానమునను కలదని అంగీకరింపవలయును. లేనిచో ఘటజ్ఞానముకంటె పటజ్ఞానము భిన్నము ఎట్లగును. కావున ఘటపటాద్యాకారముల దాల్చు విజ్ఞానము కంటె భిన్నముగ పదార్థములు లేవు. విజ్ఞానము ఉన్నపుడే ఇవి భాసించుచున్నవి, విజ్ఞానము లేనిచో ఇవి భాసించుటలేదు. వస్తువులు మన ఎదుట ఉన్నట్లు భాసించుట, ఆకాశమున ఉదయించుచున్న నక్షత్రములు నేలమీద ఉదయించుచున్నట్లు భాసించుటవంటిది. కావున

బాహ్యపదార్థములు భ్రాంతినిర్మితములు. ఇది ఇతని సిద్ధాంతము.

మాధ్యమికులు — ఈ మతమున శూన్యమే తత్త్వము. అభావమునొందుటయే మోక్షము. అభావము స్వతస్సిద్ధము గదా! ఘటపటాదికార్యములు అభావమునుండి పుట్టి, అభావమునందే లయించు చున్నవి. కావున అభావమే వాస్తవము. ఘటమునకు పూర్వదశ మృత్పిండము. (మట్టిముద్ద) దానినుండి ఘటముపుట్టుచున్నది. మృత్పిండము, ఘటము భావపదార్థములేగదా! అని శంకింపరాదు. మట్టిముద్ద మార్పుచెందనిచో ఘటముగ ఏర్పడదు గదా! ఘటముగా మార్పు చెందినదశలో అది మట్టిముద్ద కాదు. కావున అభావమునుండియే ఘటము పుట్టుచున్నది అని తలంపవలయును.

మరియు ఏ పదార్థము తననుండి తాను జన్మింపదు. మరియొక దానినుండియు జనింపదు. తననుండి తాను జనించుపక్షమున ఆత్మాశ్రయదోషము కల్గును. మరియొక వస్తువునుండి జనించుపక్షమున ఏ వస్తువునుండియు ఏ వస్తువైనను జనింపవచ్చును. కావున పదార్థముల ఉత్పత్తివినాశములు భ్రాంతిమూలకములే. ఈ రీతిగ పదార్థములు బాహ్యరూపమున గాని, అభ్యంతరరూపమున గాని ఉన్నవి అనుట సాధ్యము కాదు. కావున శూన్యమే తత్త్వము.

## జైనమతము

జైనమతమున ద్రవ్యము ఆరువిధములు, 1 జీవులు, 2 ధర్మము, 3 అధర్మము, 4 పుద్గలము, 5 కాలము, 6 ఆకాశము. పుద్గలము అనగా అణువు మొదలగు భూతములవరకుగల ద్రవ్యము. వీరు ఈశ్వరుని అంగీకరింపరు. పదార్థములన్నియు సత్త్వాసత్త్వ - నిత్యత్వానిత్యత్వ-భిన్నత్వాభిన్నత్వాది విరుద్ధధర్మములు కలిగి, అనైకాన్తికములై ఉండునని వీరు తలంతురు. దీనినే "సప్తభంగి" అని వ్యవహ

రింతురు. ఉదాహరణమునకు 1 స్యాదస్తి, 2 స్యాన్నాస్తి, 3 స్యాదస్తి చ నాస్తి చ, 4స్యాదవక్తవ్యమ్, 5స్యాదస్తి చ అవక్తవ్యంచ 6స్యాన్నాస్తి చ అవ్యక్తవ్యం చ, 7 స్యాదస్తి చ నాస్తి చ అవక్తవ్యం చ. ఏ పదార్థమును ఇదమిత్థముగ నిర్ణయించుటకు సాధ్యము కాదని దీని తాత్పర్యము. ఈ మతమున జీవులు అణువులుగాని, విభువులు గాని కారు. మధ్యమపరిమాణులై యుందురు. అనగా ఆయా శరీరముల పరిమాణమే జీవుల పరిమాణమై ఉండును. సత్కర్మాచరణద్వారా పాపములను తొలగించుకొని, అలోకాకాశమున సతతోర్ధ్వగతి నందుటయే ముక్తి

## పాశుపతమతము

కాపాలురు, కాలాముఖులు, పాశుపతులు, శైవులు అని పరమ శివోపాసకులు నాలుగు విధములుగ ఉందురు. వీరికి శివుడే పర దైవము. శైవాగమములు ప్రమాణములు. శివుడు ప్రపంచమునకు నిమిత్తకారణము మాత్రమే - ఉపాదానకారణము కాడు.

పశువులు. జీవులు, పశుపతి ఈశ్వరుడు. పాశము సంసారము. పశువులు పశుపతి నాశ్రయించి పాశమును తొలగించుకొనవలయును. ఇది వీరి సాధారణసిద్ధాంతము. వీరిలో మరికొన్ని అసాధారణసిద్ధాంతములు, ఆచారములును కలవు. ఇవి అన్నియు శైవాగమసిద్ధములే. ఆగమోక్తకర్మల నాచరించుటచేతను భక్తిచేతను శివసాయుజ్యము నందుటయే ముక్తి.

## పాంచరాత్రము

పాంచరాత్రమతమున జగత్కారణమైన పరబ్రహ్మము వాసుదేవుడు. ఇతనినుండి సంకర్షణుడు అను జీవుడు, ఈజీవునినుండి ప్రద్యుమ్నుడు అను మనస్సు, ఈ మనస్సునుండి అనిరుద్ధుడు అను అహంకారము పుట్టుచున్నవి. ఇచట వాస్తవమున జీవునకు పుట్టుకలేదు.

అతడు నిత్యుడు. అయినను జీవుని ఉత్పత్తి గౌణముగ చెప్పబడినది' "న హ్యనాదిరనన్తశ్చ పరమార్థేన నిశ్చితః" అనుచు జీవనిత్యత్వమును పాంచరాత్రము బోధించుచున్నది. ఈ సంకర్షణాదులు జీవాదులకు అధిష్ఠాతలై యుందురు. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులను" చతుర్వ్యూహములు అని వీరు వ్యవహరింతురు. ఇట్టి భగవంతుని అభిగమన, ఉపాదాన, ఇజ్యా, స్వాధ్యాయయోగములు అను పాంచకాలికవిధానములతో యావజ్జీవితము ఆరాధించి, భగవదనుగ్రహమును పొందవలయును. ఈ మతమున జగత్తునకు త్రివిధకారణములు భగవంతుడే వేదములు సర్వథాప్రమాణములు. అర్చోపాసన ప్రధానము శరీరావసానమున భగవత్సాయుజ్యప్రాప్తియే ముక్తి.

ఇక బ్రహ్మసూత్రభాష్యకారులలో సుప్రసిద్ధులు శ్రీమధ్వ శంకర రామానుజులు వీరి సిద్ధాంతములను సంక్షిప్తముగ తెలిసికొందము.

## అద్వైతమతము

ఈ మతమునకు ప్రవర్తకులు శ్రీ శంకరభగవత్పాదులవారు. బ్రహ్మమొక్కటియే తత్త్వము. అది సచ్చిదానందాత్మకమైనది. జీవుడు బ్రహ్మముకంటె భిన్నుడు కాడు. కేవల పరిశుద్ధచైతన్యము బ్రహ్మము కాగా, మాయావచ్ఛిన్నచైతన్యము ఈశ్వరుడు. అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము జీవుడు. జీవుడు బ్రహ్మత్వమును పొందుటయే ముక్తి. ఇది నిత్యసిద్ధము. సాధ్యముకాదు. "అహంబ్రహ్మాఽస్మి" అను జ్ఞానముచే ఇది సిద్ధించును. ఈ మతమున జగత్తు మిథ్య. అనగా పైకి కనిపించుచున్నదే కాని వాస్తవమున ఇది లేనిదే, త్రాటిని చూచి సర్పము అని భ్రమించునపుడు భ్రాంతిచే సర్పము చూపట్టుచున్నను వాస్తవమున లేదుగదా! ఇట్లే జగత్తు భ్రాంతిసిద్ధము. మాయ ఈ భ్రాంతికి కారణము. నిశితముగ పరిశీలించినచో ఈ మాయయు సత్పదార్థముకాదు. ఈ మతమున బ్రహ్మము నిర్గుణము, నిర్విశేషము-

ప్రపంచమునకు త్రివిధకారణములు బ్రహ్మమే. వీరు వ్యావహారిక సత్యము, పారమార్థికసత్యము, ప్రాతిభాసికసత్యము అని సత్యమును మూడువిధములుగ వర్గీకరించిరి. మనము చూచుచున్న ప్రపంచము వ్యావహారిక సత్యము. రజ్జుసర్పాదికము ప్రాతిభాసికసత్యము. బ్రహ్మ నుభూతి పారమార్థికసత్యము. వ్యావహారికసత్యమైన ఈ ప్రపంచము నకు నిర్గుణబ్రహ్మము వివర్తోపాదానము. వ్యావహారికదశలో అది పరిణామోపాదానము అగుచున్నది. కావున వీరు పారమార్థికదృష్టిలో వివర్తవాదమును, వ్యావహారికదృష్టిలో పరిణామవాదమును ప్రవచిం తురు. ముక్తికి ముఖ్యాధికారి సన్న్యాసి. అంతఃకరణనైర్మల్యసిద్ధికై వేదచోదితకర్మలను ఆచరింపవలయును. మోక్షసాధనములలో భక్తి సులభమైనది. కాని ఇది సగుణబ్రహ్మమునొద్దకు చేర్చును. జ్ఞానము నిర్గుణబ్రహ్మప్రాపకము. ఇట్లు భక్తిద్వారా క్రమముక్తిని పొంద వచ్చును. కాన సాధనచతుష్టయసంపన్నుడైన సన్న్యాసి మోక్షము మునకు ముఖ్యాధికారి.

## ద్వైతమతము

ఈ మతమునకు ప్రవర్తకులు శ్రీమధ్వాచార్యుల వారు. వీరికి పూర్ణప్రజ్ఞులని నామాంతరము గలదు. వీరు స్వతంత్రము, అస్వతం త్రము అని తత్త్వమును రెండువిధములుగ విభజించిరి. స్వతంత్ర తత్త్వము భగవంతుడు విష్ణువు. ఇతడు దోషరహిత - అనంతకళ్యాణ గుణాకరుడు. అస్వతంత్రతత్త్వము జీవుడు, జడము అని రెండు విధములు. ఇవి పరమాత్మాధీనములై యుండును. ప్రపంచమునకు భగవంతుడు నిమిత్తకారణమే. కాని ఉపాదానకారణము కాడు. ఉపా దానకారణమైనచో ప్రపంచగతదోషములన్నియు భగవంతునియందును సంక్రమించునని వీరు భావింతురు. వీరు 1 జీవేశ్వరభేదము 2 జడే శ్వరభేదము, 3 జీవపరస్పరభేదము, 4 జడజీవభేదము, 5 జడ పర

స్వరభేదము అనుచు ఐదువిధములైన భేదములను అంగీకరింతురు. విష్ణుసాయుజ్యము మోక్షము. భక్తి దానికి సాధనము, అద్వైతవాదము అను వీరు అన్నివిధముల ప్రతిఘటింతురు.

## విశిష్టాద్వైతమతము

జీవుడు, ప్రకృతి, ఈశ్వరుడు అను మూడు తత్త్వములను వీరు అంగీకరింతురు. జీవుడు అణుపరిమాణుడు, జ్ఞానస్వరూపుడు, జ్ఞానమునే గుణముగా గలవాడు, కర్త. కాని పరమాత్మాధీనుడు. స్వతంత్రుడు కాడు. ప్రకృతి ఇరువదినాల్గు తత్త్వములుగ పరిణమించుచున్నది. ఇది జడము. అనగా జ్ఞానశూన్యము. ఇది శుద్ధసత్త్వమయము, మిశ్రసత్త్వమయము అని రెండువిధములు. శుద్ధసత్త్వమయప్రకృతి వైకుంఠమున నుండును. మిశ్రసత్త్వమయప్రకృతి ఈ జగద్రూపమున పరిణమించునది. ఈశ్వరుడు — ఇతడు జీవప్రకృతులకు నియంత. వీనియందు అంతర్యామియై, వీనిని తనకు శరీరముగ చేసికొనియుండును. కావున జీవప్రకృతులకును, పరమాత్మకును గల సంబంధము శరీరశరీరిభావరూపమైనది. ఈ సంబంధమును అంగీకరించుటచే భేదశ్రుతులు, అభేదశ్రుతులు చక్కగ సమన్వితము లగుచున్నవి. ఈ "శరీరాత్మభావసంబంధము" "యస్య పృథివీ శరీరం, యః పృథివ్యాం అంతరో యమయతి....... ....యస్యాత్మా శరీరం యః ఆత్మానం అంతరోయమయతి" ఇత్యాది శ్రుతివాక్యములు స్పష్టముగ తెలుపుచున్నవి అద్వైతులు వ్యావహారిక పారమార్థికదశాభేదములచే భేదాభేదశ్రుతులను సమన్వయించుచుండగా, విశిష్టాద్వైతులు శరీరశరీరిభావసంబంధముచే భేదాభేదశ్రుతులను సమన్వయింతురు. కావున వీరి సిద్ధాంతమున ప్రపంచము సత్యమే, మిథ్య కాదు. "యథార్థం సర్వవిజ్ఞానం ఇతి వేదవిదాం మతమ్" అనునది వీరి ముఖ్యాశయము.

నిర్గుణబ్రహ్మము మాయావచ్ఛిన్నమై జగత్కారణ మగుచున్న దని అద్వైతము బోధించుచున్నది. కాని ఆ పక్షమున ఈ క్రింది దోష ములు అనివార్యములు. 1. ఆశ్రయానుపపత్తి:- జ్ఞానస్వరూపమైన బ్రహ్మము జ్ఞానబాధ్యమైన అవిద్యకు ఆశ్రయము కాజాలదు. 2. తిరోధా నానుపపత్తి :- ప్రకాశైకస్వరూపమైన బ్రహ్మమును అవిద్య తిరో హితము ఒనర్పజాలదు. బ్రహ్మస్వరూపము తిరోహితము కానిచో జగత్తు ఎట్లు భాసించును? 3. అనిర్వచనీయత్వానుపపత్తి:-ప్రతివస్తువు "సత్తు" అనిగాని, "అసత్తు" అనిగాని భాసించును. కావున "అవిద్య" అనిర్వచ నీయము అనుట అసంగతము. 4. స్వరూపానుపపత్తి:- నిర్విషయము, నిరాశ్రయము, నిర్విశేషము, స్వయంప్రకాశము అయిన జ్ఞానస్వరూప బ్రహ్మము స్వాశ్రయదోషవశమున తనను అనంతాశ్రయముగను, అనంతవిషయముగను తలంచుచుండును అనుట తగదు. బ్రహ్మము నాశ్రయించియున్న అవిద్య సత్యమని వారంగీకరింపరుగదా! అసత్య మైనచో జగద్భ్రాంతి ఎట్లు కలుగును? 5. ప్రమాణానుపపత్తి :- "నా సదాసీన్నోసదాసీత్" ఇత్యాదిశ్రుతులు అనిర్వచనీయజ్ఞానపరములు గావు. మాయాశబ్దము ఉపనిషత్తులయందును విచిత్రసృష్టిహేతువైన ప్రకృతిని బోధించును. కావున అది లేనిది కాదు. ఉన్నదే. పురాణేతి హాసములయందలి సత్, అసత్‌వంటి పదార్థములు చిదచిద్వాచకములు కావున ప్రమాణము లేవియు నిర్విశేష బ్రహ్మమును బోధించుటలేదు. 6. నివర్తకానుపపత్తి:-బ్రహ్మాత్మైకత్వజ్ఞానము అవిద్యానివర్తకముఅనుట తగదు. జ్ఞానస్వరూపమైన బ్రహ్మమే అవిద్యాశ్రయమైనచో ఆ అవిద్యను తొలగించినదెవరు? 7. నివృత్త్యనుపపత్తి :- అవిద్యానివర్త కుడగు జ్ఞాత మరియొకడు లేనందువలన బ్రహ్మాత్మైకత్వజ్ఞానము ఎన్నటికిని సిద్ధింపదు. కావున నిర్గుణబ్రహ్మవాదము సరియైనది కాదని శ్రీరామానుజుల ఆశయము.

శ్రీరామానుజులమతమున ఈశ్వరుడుపర, వ్యూహ, విభవ, అర్చా,

అంతర్యామిరూపమున ఐదు విధములుగ నుండును. అతడు లీలకై జగత్సృష్టి గావించును. జీవులు వర్ణాశ్రమానుగుణములైన కర్మల నాచరించుచు, తత్త్వహితపురుషార్థములను చక్కగతెలిసికొని, భక్తితో భగవంతుని ఆరాధించినచో అతని అనుగ్రహమేర్పడి ముక్తులగుదురు. ముక్తియనగా వైకుంఠలోకప్రాప్తి. శ్రీమన్నారాయణుడు వీరికి పరమప్రాప్యుడు. ప్రపత్తి లేక శరణాగతి పరమసాధనము. భక్తి, ప్రపత్తులు, వివేకవిమోక అభ్యాసక్రియా కళ్యాణఅనవసాద అనుద్ధర్షణల వలన కలుగుచున్నవి.

1. వివేకము :- పరిశుద్ధాన్నభోజనమువలన కలుగు కాయశుద్ధి, 2. విమోకము:-కామాదిదోషరహితత్వము, 3. అభ్యాసము-అనుదినము భగవద్ధ్యానము గావించుట, 4. క్రియ :- ఫలాపేక్ష లేక శ్రౌతస్మార్త కర్మలనాచరించుట, 5 కళ్యాణము :- సత్య-ఆర్జవ-దయా-దానాది గుణములు, 6.అనవసాదము:- బాధలుకలిగినపుడు అతిగక్రుంగిపోకుండుట, 7 .అనుద్ధర్షము:-అనుకూలపరిస్థితులయందు అతిగాఆనందింపకుండుట.

ముముక్షువైన సాత్త్వికుడు పైరీతిని తనజీవితమును మలచుకొన వలయును. వేదములు, మన్వాదిస్మృతులు, శ్రీవైఖానసపాంచరాత్రాగమములు, ఆళ్వారుల దివ్యప్రబంధములు వీరికి ప్రమాణగ్రంథములు.

## బ్రహ్మసూత్రముల ప్రమేయము

బ్రహ్మసూత్రములు "అథాఽతో బ్రహ్మ జిజ్ఞాసా" అను సూత్రముతో నారంభమై, "అనావృత్తిశ్శబ్దాత్" అను సూత్రముతో పూర్తియగు చున్నవి. ఇందు శ్రీశంకరుల భాష్యమువనుసరించి 555 సూత్రములు కాగా, శ్రీమద్రామానుజుల భాష్యమునసుసరించి 545 సూత్రములు గలవు. ఇట్లే అధికరణములును శంకరభాష్యానుసారము 191 కాగా, శ్రీ రామానుజభాష్యానుసారము 156 అధికరణములు గలవు. శ్రీమద్రా

మానుజులు బోధాయనవృత్తిని అనుసరించి శ్రీభాష్యమును రచించిరి. శ్రీవేదాంతదేశికులు ఉపవర్షుడు, బోధాయనుడు అభిన్నులనితలంచిరి. బాదరాయణమహర్షి ఆశ్మరథ్య, బాదరి, ఔడులోమి, కాశకృత్స్న, కార్ష్ణాజిని ఆత్రేయ మహర్షులను బ్రహ్మసూత్రములయందు ప్రస్తుతించును. వీరు బాదరాయణునికి పూర్వమున నుండిన బ్రహ్మతత్త్వవిచారకులు.

బ్రహ్మసూత్రములయందు బ్రహ్మము ఈ క్రిందివిధముగ నిర్దేశింపనడినది. బ్రహ్మము- సత్తు, ఈక్షిత (చూచునది, సంకల్పించునది)ఆనందమయము, ఆదిత్యాంతర్వర్తి, నేత్రాంతర్వర్తి, ఆకాశము, ప్రాణము, జ్యోతి, అత్త(భోక్త) అదృశ్యత్వాదిగుణకము, వైశ్వానరము (1.1) ద్యుభ్వాద్యాయతనము (ద్యులోకములకు ఆధారమైనది) ముక్తోపసృప్యము(ముక్తపురుషులచేపొందదగినది)భూమము, (అనంతమైనది) అక్షరము,(నాశరహితము) ప్రశాస్త,(సర్వమును శాసించునది) ఈక్షతికర్మభూతము, (ముక్తపురుషులచే దర్శింపబడునది) దహరము, (సూక్ష్మమైనది) అంగుష్ఠప్రమితము, కంపకము(1.3) ప్రకృతి(ఉపాదానము యోని(కారణము)జగద్రూపమునపరిణమించువాడు,సర్వోపేతము, వికరణము, లీలైకరసము, వైషమ్యనైర్ఘృణ్యరహితము, సంభవరహితము, చరాచరవ్యపాశ్రయము, అనాదికర్మసాపేక్షము,(1.4) ఉభయలింగము, సేతువు, ఫలప్రదాత, జీవునిబంధవిపర్యయములకు కర్త(2 2)

జీవుడు- ఇతనినిగూర్చి బ్రహ్మసూత్రములు ఇట్లు చెప్పుచున్నవి. ఆత్మ నిత్యుడు, జ్ఞాని, కర్త, అణువు, జ్ఞానమునే గుణముగ గలవాడు, పరమాత్మాయత్తస్వరూపుడు, పరమాత్మయొక్క అంశము. దేహసంబంధమువలన విధినిషేధములను అనుసరించువాడు, పరమాత్మసంకల్పముచే తిరోహితమైన స్వభావము కలవాడు. ఇతని బంధమోక్షములు పరమాత్మాధీనములు. జగత్సృష్ట్యాదికర్తృత్వము ఇతనికి ఎన్నటికి సంభవింపదు. మోక్షదశయందు బ్రహ్మభోగములను అనుభవించును.

జడము — జీవాత్మపరమాత్మలకు ఉత్పత్తివినాశములు లేవు.

ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, పృథివి జనించునవి. ఇవి పరమాత్మాధిష్ఠితములై సృజించుచున్నవి. పరమాత్మ సంకల్ప పూర్వకముగ జీవులద్వారా ఆకాశాదులయందు అనుప్రవేశము గావించి, జగత్సృష్ట్యాదికము చేయుచుండును. కావుననే జీవప్రకృతులు పరమాత్మకు శరీరములు. అతడు వీనికి ఆత్మ. ఇతనికి మించిన మరియొక ఆత్మ లేనందువలన ఇతడు పరమాత్మ అనబడుచున్నాడు. ఈ కారణముచే ఇంద్రప్రాణాకాశాది చేతనాచేతనవాచకపదములు పరమాత్మను సైతము బోధింపగల్గుచున్నవి. పరమాత్మాధిష్ఠితములు కాని కేవల, ప్రకృతి గాని, పరమాణువులు గాని జగత్కారణము కాజాలవు. ఈ ప్రపంచమంతయు బ్రహ్మముయొక్క నాల్గవభాగము. ఇది ఏనాటికైనను పరిత్యజింపదగినది. ఇచట శాశ్వతానందము చేకూరదు.

శాశ్వతానందమును పొందుగోరువాడు వర్ణాశ్రమోచితములైన శ్రౌతస్మార్త కర్మములను యావజ్జీవితము అనుష్ఠించుచు, శమదమాది గుణసంపన్నుడై, ఆహారాది నియమములు గలిగి, ఏదేని ఒక ఉపాసనమును గావించుచుండవలయును. ఇట్టి ముముక్షువునందు పరమాత్మకు అనుగ్రహము గల్గినచో శరీరావసానసమయమున పరమాత్మ ఇతని పుణ్యపాపశేషములను తొలగించి అర్చిరాదిమార్గమున పరమపదమునకు గొనిపోవును, ముక్తజీవుడు అచట పరమాత్మానుభవజనిత పరమానందములో నిమగ్నుడై ఉండును. అచటనుండి అతడు ఎన్నటికిని సంసారమండలమునకు మరలిరాడు. ఇదియే ముక్తి. ప్రతియొక్కడును ఇట్టి ముక్తిని పొందుటకై ప్రయత్నింపవలయును. బ్రహ్మసూత్రకారుని స్పష్టమైన ఉపదేశము.

—0—

# అధికరణసూచిక

## ప్రథమాధ్యాయము - సమన్వయాధ్యాయము

### ప్రథమపాదము_అత్యంతాఽస్పష్టజీవాదిలింగకపాదము



### ద్వితీయపాదము-అస్పష్టలింగకపాదము



### తృతీయపాదము-స్పష్టజీవాదిలింగకపాదము

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# ప్రార్థనా

## ఓం నమో భగవతే వేదవ్యాసాయ

శ్రీమద్వైదికసిద్ధాంతప్రథమాచార్యమాశ్రయే ।
కల్పాదౌ యస్స్వయం వేదాన్ బ్రహ్మణే సముపాదిశత్ ॥ 1

మత్స్యహంసహయగ్రీవదివ్యమూర్తీ స్స్వమాశ్రయన్ ।
రరక్ష వేదాన్ దైత్యేభ్యో యో హరి స్తముపాశ్రయే ॥ 2

గీతాచార్య మహం వందే యోఽపిషిదన్త మర్జునమ్ ।
రణాఙ్గణే జ్ఞోపదేశసుధయా సమజీవయత్ ॥ 3

వేదవ్యాస మహం నౌమి పరాశరతనూభవమ్ ।
శ్రుత్యన్తతత్త్వరత్నాని యస్స్వసూత్రై రబంధయత్ ॥ 4

బాదరాయణభావజ్ఞం బోధాయనమునిం స్తుమః ।
యస్స్వవృత్త్యా ప్రదధీచక్రే బ్రహ్మసూత్రార్థ మచ్ఛలమ్ ॥ 5

కాశకృత్స్నమునిం స్తౌమి తత్త్వయాథాత్మ్యదర్శినమ్ ।
రత్నదీపాయతే యస్య సూక్తి ర్వేదాన్తమందిరే ॥ 6

రామానుజమునిః శ్రీమాన్ దయతాం మయ్యకించనే ।
శ్రీభాష్యోదితసూత్రార్థసంగ్రహే సహసోఽద్యతే ॥ 7

ఆత్రేయగోత్రసద్రత్నం శ్రీభాష్యస్య ప్రవర్తకమ్ ।
వేదాన్తోదయనం వందే ప్రణతార్తిహరం గురుమ్ ॥ 8

శ్రీమద్గోపాలకృష్ణార్యం పితామహ మహం స్తువే ।
శ్రీభాష్యకారకైంకర్యే ప్రవణం విదుషాం వరమ్ ॥ 9

శ్రీవేంకటనృసింహాఖ్యపితృపాదా నుపాశ్రయే ।
యత్కృపాలేశమాత్రేణ సత్తా మయ ముపేయివాన్ ॥ 10



శ్రీరస్తు

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః



## -: ప్రార్థనా :-

శ్లో॥ అఖిలభువనజన్మస్థేమభంగాదిలీలే,

వినతవివిధభూతవ్రాతరక్షైకదీక్షే ।

శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే,

భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా ॥

శ్రీరస్తు

## -: ప్రరోచనా :-

శ్లో॥ పారాశర్యవచస్సుధా ముపనిషద్దుగ్ధాబ్ధిమధ్యోద్ధృతాం,
సంసారాగ్ని విదీపనవ్యపగత ప్రాణాత్మసంజీవనీమ్ ।
పూర్వాచార్యసురక్షితాం బహుమతివ్యాఘాతదూరస్థితాం,
ఆనీతాం తు నిజాక్షరై స్సుమనసో భౌమాః పిబంత్వన్వహమ్ ॥

## -: ప్రతిజ్ఞా :-

" భగవద్బోధాయనకృతాం విస్తీర్ణాం బ్రహ్మసూత్రవృత్తిం పూర్వాచార్యాః సంచిక్షిపుః. అథ తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యంతే. "

శ్రీ రస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ భాష్యసారము

## ప్రథమాధ్యాయము - (సమన్వయాధ్యాయము)

## ప్రథమపాదము - (అత్యంతాస్పష్ట జీవాదిలింగకపాదము)

శ్లో॥ ప్రణమ్య సర్వానాచార్యాన్ శ్రీభాష్యోదితవర్త్మనా॥
కుర్వే సతాం ప్రమోదాయ బ్రహ్మసూత్రార్థసంగ్రహమ్॥

### 1. జిజ్ఞాసాధికరణము

ముముక్షువు బ్రహ్మమును చక్కగా విమర్శించి తెలిసికొనవలయును.

1 సూత్రము — హరిః ఓమ్ - అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా 1.1.1

పదచ్ఛేదము :- అథ, అతః, బ్రహ్మజిజ్ఞాసా

అర్థము — అథ = అనంతరము, అనగా వేదమున పూర్వభాగమైన కర్మకాండమును సమగ్రముగ విమర్శించి తెలిసికొనిన పిదప, అతః = ఇందువలన అనగా కేవల కర్మానుష్ఠానము అల్పము, అస్థిరము అయిన ఫలమునిచ్చునని తెలిసికొనుటవలన, బ్రహ్మజిజ్ఞాసా = అనంతము శాశ్వతమునైన ఫలితము నొసంగు బ్రహ్మమును గూర్చి విచారణ ప్రారంభింపవలయును.

ఇందులకు శ్రుతిప్రమాణము - "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్ - నాస్త్యకృతః కృతేన....తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్. తస్మై స విద్వాన్ ఉపసన్నాయ సమ్యక్ ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ.

యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవి-
ద్యామ్" [ముండ 1 (2) - 12 - 13.

"వేదాధ్యయనము గావించిన బ్రాహ్మణుడు కర్మలచే సంపాదిత ములైన లోకములు అనిత్యము లని తెలిసికొని నిత్యమైన బ్రహ్మ తత్త్వము సత్కార్యాచరణమాత్రముననే పొందశక్యము కాదని నిశ్చ యించుకొని నిర్వేదమును పొందినవాడై ఆ బ్రహ్మతత్త్వమును తెలిసి కొనుటకు శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడు అయిన గురువుసన్నిధికి సమి త్పాణియై అనగా సమిధలను చేతనుంచుకొని, లేక చేతులను జోడిం చుకొని చేరవలయును. ఆచార్యుడును తనను వినయముతో చేర వచ్చిన ఆశిష్యునకు ఏ విద్యాబోధనచే "అనశ్వరము సత్యము అయిన పురుషతత్త్వము (బ్రహ్మ) బోధపడునో అట్టి బ్రహ్మవిద్యను ప్రశాంత చిత్తుడు శమాన్వితుడు అయిన అతనికి బోధింపవలయును"

బృహత్త్వగుణముగలది బ్రహ్మము. పెద్దది లేక గొప్పది అని భావము. స్వరూపముచేత, గుణములచేత దీనికి మించి పెద్దది మరియొకటి ఏదియు నుండరాదు. ఇట్టి బృహత్త్వగుణము కలవాడు పరమేశ్వరుడు శ్రీమన్నారాయణుడే. ఇతడే ఇచట జిజ్ఞాస్యుడు.

## 2. జన్మాద్యధికరణము - 2

జగత్కారణత్వము బ్రహ్మముయొక్క లక్షణము

2 సూ — జన్మా ఽ ద్యస్యయతః

పద — జన్మ + ఆది; అస్య, యతః

అర్థ — అస్య = ఈ జగత్తునకు, యతః = దేనినుండి జన్మాది = సృష్టిస్థితిలయములు కలుగుచున్నవో (తత్ బ్రహ్మ = అది బ్రహ్మము.)

ఏ వస్తువునైనను తెలిసికొనగోరునపుడు దాని లక్షణమును మొదట తెలిసికొనవలయునుగదా! కావున "జగత్సృష్ట్యాదులకు కారణమైనది బ్రహ్మము" అని ఈ సూత్రముచే బ్రహ్మలక్షణము చెప్పబడినది. ఇచట కారణము అనగా ఉపాదానకారణము నిమిత్తకారణము రెండును అని అర్థము. ఇందులకు శ్రుతిప్రమాణము.

యతో వా ఇమాని భూతాని జాయంతే
యేన జాతాని జీవంతి
యత్ ప్రయం త్యభిసంవిశంతి.
తద్విజిజ్ఞాసస్వ. తద్బ్రహ్మేతి. (తైత్తి.భృ - 1)

"ఈ చేతనాఽచేతనములు దేనినుండి జన్మించుచున్నవో జన్మించినవి దేనివలన జీవించుచున్నవో చివరికి దేనియందు లయమును పొందుచున్నవో దానిని తెలిసికొనుము! అది బ్రహ్మము."

## 3. శాస్త్రయోనిత్వాధికరణము 3

బ్రహ్మము శాస్త్రైకవేద్యము
3 సూ — శాస్త్రయోనిత్వాత్ 1-1-3

అర్థ—శాస్త్రయోనిత్వాత్ = బ్రహ్మము శాస్త్రమునే కారణముగా కలిగియుండుటచే (ఈ వేదాంతశాస్త్రమును అధ్యయన మొనర్పవలెను.)

వివ — బ్రహ్మతత్త్వము ప్రత్యక్షప్రమాణముచేత గాని అనుమానప్రమాణముచేత గాని తెలిసికొనతగినది కాదు. కేవలము "యతోవా ఇమాని భూతాని జాయంతే" అను ఈ మొదలైన ఉపనిషద్వాక్యములద్వారానే తెలియదగి యున్నది. కావున ఈ శాస్త్రాధ్యయనము సార్థకము.

## 4. సమన్వయాధికరణము 4

వేదాంతవాక్యము లన్నియు బ్రహ్మమునే జగత్కారణముగ బోధించును.

4 సూ — తత్తు సమన్వయాత్. 1-1-4

పద — తత్, తు, సమన్వయాత్

అర్థ — తత్తు = ఆ బ్రహ్మము శాస్త్రము చేతనే తెలియతగినది అను విషయము. సమన్వయాత్ = వేదాంతవాక్యములన్నియు నిరతిశయ పురుషార్థభూతమైన బ్రహ్మమునందే చక్కగా అన్వయించుట వలన ఉపపన్నము అగుచున్నది.

వివ — ఉపనిషత్తులయందు జగత్కారణతత్త్వమును చెప్పునపుడు "సత్", "ఆత్మ", "బ్రహ్మ", 'ఆకాశః', "అనన్తః" "నారాయణః" ఈ మొదలగుపదములు జగత్కారణవస్తువాచకములుగ ప్రయోగింపబడుచున్నవి. ఈ పదములు పరస్పరము భిన్నార్థకములుగ కనుపించుచున్నవి. కాని ఈ శబ్దము లన్నియు పరబ్రహ్మమును బోధించునపుడే, ఉపనిషత్తులకు ఏకార్థకత సిద్ధించును. లేనిచో అవి విరుద్ధార్థ బోధకములై అప్రమాణములు కావలసివచ్చును. కావునబ్రహ్మతత్త్వము ఉపనిషచ్ఛాస్త్రమూలముననే తెలియతగియున్నదని సిద్ధించినది. ఉపనిషత్తులలోని ఇట్టి నిగూఢభావములను వివరించుటకొరకే గదా ఈ బ్రహ్మసూత్రములు ఏర్పడినవి.

ఈ నాలుగు సూత్రములకు "చతుస్సూత్రి" అను ప్రసిద్ధ వ్యవహారము కలదు. ఇవి శాస్త్రారంభ సమర్థకములు.

## 5. ఈ క్ష త్య ధి క ర ణ ము 5 (8)

ప్రకృతి జగత్కారణము కాదు

4 సూ — ఈక్షతేర్నాఽశబ్దం (1) 1-1-5

పద — ఈక్షతేః, న; అశబ్దం.

అర్థ — అశబ్దం = (వేదముచే జగత్కారణముగ పేర్కొనబడని) ప్రకృతి, న = 'సత్' అను శబ్దముచే చెప్పబడదు, ఈక్షతేః = 'సత్' శబ్దవాచ్యమైన తత్త్వము చూచినది (సంకల్పించినది) అని ఉండుటవలన.

వివ — ఛాందోగ్యమున సద్విద్యాప్రకరణమునందు "సదేవ సౌమ్య! ఇదమగ్ర ఆసీత్. ఏకమేవాద్వితీయమ్" (ఛాం-6.2.1.1) అని ప్రారంభించి, "తదైక్షత బహు స్యాం ప్రజాయే యేతి, తత్తేజోఽసృజత" (ఛాం-6-2.1-3) అనికలదు. "సృష్టికి పూర్వము ఈ కనుపించుచున్నదంతయు ఏకము, అద్వితీయము అయిన 'సత్' మాత్రముగనే ఉండినది" అని ప్రారంభించిన ఈ వాక్యములలో జగత్కారణముగ పేర్కొనబడిన "సత్" తత్త్వము ప్రకృతి అని సాంఖ్యుని వాదము. కాని, ఈ ప్రకరణమునగల వాక్యముల నన్నింటిని పరిశీలించినచో సాంఖ్యునివాదము సరియైనది కాదని గ్రహింపగలము. ఎట్లనగా "తదైక్షత బహు స్యాం ప్రజాయే యేతి.తత్తేజోఽసృజత." "ఆ సత్పదవాచ్యమైన తత్త్వము తలంచినది" నేను అనేక విధములుగ రూపొందుదునుగాక" అని వెంటనే "అది తేజస్సును సృజించినది" అను తరువాతి వాక్యములలో 'సత్' పదవాచ్యమైన తత్త్వము "సంకల్పించినది" అనుటచే అది అచేతన మగుటకు వీలు లేదు. అచేతనమైన ప్రకృతి సంకల్పింపలేదుకదా? కావున "సదేవ సౌమ్య" అను వాక్యమున 'సత్' పదమునకు సర్వజ్ఞము, సత్యసంకల్పము అయిన బ్రహ్మము అనియే అర్థము. ప్రకృతి జగత్కారణమని ఉపనిషత్తులయందు చెప్పుటను కానరాదు.

6 సూ — గౌణశ్చేన్నాఽత్మ శబ్దాత్. (2) 1-1-6

పద — గౌణః, చేత్. న, ఆత్మశబ్దాత్.

అర్థ — గౌణశ్చేత్=సత్పదవాచ్యమైన తత్త్వము సంకల్పించినది. అనుట "వర్షప్రతీక్షాః శాలయః" "పైరులు వర్షమును ఎదురు

చూచుచున్నవి" వంటి ప్రయోగముల వలె అవివక్షిత మని చెప్ప దలచినచో, న = అదియు సరిపడదు, ఆత్మశబ్దాత్ = తరువాతి వాక్యములలో ఆ తత్త్వమును 'ఆత్మ' అను శబ్దముచే పేర్కొనియున్నందు వలన.

వివ — 'సత్' శబ్దవాచ్యమైన తత్త్వము, తరువాతి వాక్యములో "సఆత్మా (ఛాం 6-8-7) "అతడు ఆత్మ" అని ఆత్మశబ్దముచే పేర్కొనబడినందువలన ప్రకృతి "సత్" శబ్దవాచ్యము కాజాలదు. ప్రకృతి అచేతనము గదా.

7 వ సూ — తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్ (3) 1:1.7

పద — తత్ + నిష్ఠస్య, మోక్ష + ఉపదేశాత్.

అర్థ — తన్నిష్ఠస్య = ఆ 'సత్' శబ్దవాచ్యమైన తత్త్వమును ఉపాసించు వానికి, మోక్షోపదేశాత్ = "అథ సంపత్స్యే" – (ఛాం - 6. 14.2) "నేనిక బ్రహ్మప్రాప్తి రూపమైన మోక్షమును పొందుచున్నాను" అని మోక్షమును ఉపదేశించుటవలనను అచేతనమైన ప్రధానము "సత్" శబ్దవాచ్యము కాజాలదు. ప్రధానమును ఉపాసింపుమనిగాని, అట్లు ఉపాసించిన వారికి మోక్షము కలుగునని గాని సాంఖ్యులు సైతము అంగీకరింపరుగదా!

8 సూ — హేయత్వాఽవచనాచ్చ (4) 1-1-8

పద — హేయత్వ + అవచనాత్, చ

అర్థ — హేయత్వావచనాచ్చ = సత్ శబ్దముచే చెప్పబడిన తత్త్వము హేయము, అనగా పరిత్యజింప తగినదని ఉపనిషత్తులలో చెప్పకపోవుటవలనను. (సత్ శబ్దముచే ప్రకృతి చెప్పబడదు.)

వివ — "సత్" శబ్దవాచ్యము ప్రకృతి అగు పక్షమున, శ్రుతి దానిని వదలిపెట్టుమని చెప్పియుండును. కాని ఆ తత్త్వమును ఉపా

రూపమని చెప్పియున్న సాంఖ్యసిద్ధాంతమునను ప్రకృతి పరిత్య జింపతగినదే కాని, ఉపాసింపతగినది కాదు కదా! కావున "సత్" శబ్దవాచ్యము 'బ్రహ్మ'మే గాని ప్రకృతి కాజాలదు.

9 సూ — ప్రతిజ్ఞావిరోధాత్. (5) 1-1-8

అర్థ — ప్రతిజ్ఞావిరోధాత్ = ప్రారంభమున చేసిన ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞకు విరోధ మేర్పడుటవలనను [ప్రకృతి జగత్కా రణము కాజాలదు.]

వివ — "యేనాఽశ్రుతం శ్రుతం భవతి" (ఛాం - 6-1-3) "దేనిని గురించి విన్నందువలన విననది కూడా విన్నట్లగునో అది బ్రహ్మము" అని ప్రారంభమున చెప్పియున్నందువలన కార్య కారణములకు సాజాత్యమును అంగీకరింప వలసియున్నది. ఈ చేత నాచేతనాత్మకమైన ప్రపంచమునకు అచేతనమైన ప్రకృతి కారణమగు పక్షమున దానిని తెలిసికొనుటచే చేతనతత్త్వమును తెలిసికొనగలమా? లేము. చేతనతత్త్వము అచేతన కార్యము కాదుగదా? కావున ప్రకృతి జగత్కారణము కాదు. ఈ సూత్రము శంకరభాష్యమున చూపట్టదు.

10 సూ — స్వాఽప్యయాత్ (6) 1-1-10

పద — స్వ + అప్యయాత్

అర్థ — స్వాప్యయాత్ = "నిద్రించు సమయమున జీవుడు సచ్ఛబ్దవాచ్యమైన ఆత్మయందు లీనమగును" అని చెప్పుటవలనను ప్రకృతి జగత్కారణము కాదు.

వివ — "సతా సోమ్య తదా సంపన్నో భవతి. స్వమపీతో భవతి" [ఛాం. 6-8-1]

పై వాక్యము "స్వపితి" = "నిద్రించుచున్నాడు" అనుశబ్దమును "స్వం, అపీతో భవతి" అని నిర్వచించినది. అనగా నిద్రలో జీవుడు

సత్ శబ్దవాచ్యమైన తత్త్వములో లీనమైయుండును అని భావము. చేతనుడైన జీవుడు అచేతనమైన ప్రకృతియందు ఎట్లు లీనమగును? కావున ఇచట సత్ శబ్దముచే బ్రహ్మమునే గ్రహింపవలయును.

11 సూ — గతిసామాన్యాచ్చ (7) 1-1-11

అర్థ — గతిసామాన్యాత్ = ఉపనిషత్సిద్ధాంత పరిపాటి ననుసరించియు, ప్రకృతి జగత్కారణము కాదు.

వివ — "తస్మాద్వా ఏతస్మాత్ ఆత్మన ఆకాశస్సంభూతః" (తైత్తి - బ - 1) "ఈ ఆత్మనుండి ఆకాశము ఏర్పడినది" మున్నగు ఉపనిషద్వాక్యములు చేతనమగు ఆత్మనే జగత్కారణముగ పేర్కొని యుండుటచే ఇచటి 'సత్' శబ్దము చేతను ఆ ఆత్మయే పేర్కొనబడుచున్నది గాని, ప్రకృతి కాదు

12 సూ — శ్రుతత్వాచ్చ (8) 1-1-12

పద — శ్రుతత్వాత్, చ

అర్థ — శ్రుతత్వాచ్చ = చేతనమగు బ్రహ్మము జగత్కారణమని ఈ ఛాందోగ్యోపనిషత్తునందే స్పష్టముగ పేర్కొనబడి యున్నందునను 'సత్' శబ్దవాచ్యము బ్రహ్మమే కాని ప్రకృతికాదు.

వివ — "ఆత్మన ఏవేదం సర్వం" (ఛాం. 6-26-1) "ఆత్మనుండియే ఈ ప్రపంచ మంతయు ఏర్పడినది" అని చెప్పుచు ఛాందోగ్యము సర్వజ్ఞము, సత్యసంకల్పము అయిన బ్రహ్మమే జగత్కారణమని స్పష్టము చేయుచున్నది. కావున "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అను వాక్యమున జగత్కారణముగ పేర్కొనబడిన 'సత్' అను తత్త్వము పరబ్రహ్మమే గాని ప్రకృతి కాదు అని సిద్ధించుచున్నది.

# అధికరణ సారాంశము

ఛాందోగ్యమున జగత్కారణతత్త్వము 'సత్' అని పేర్కొనబడినది. ఆ తత్త్వము సంకల్పపూర్వకముగ జగత్తును సృష్టించు బ్రహ్మమే, గాని సాంఖ్యులు చెప్పిన ప్రకృతి కాదు. ఆ తత్త్వము జగత్సృష్టికై సంకల్పించినది అనుట గౌణమును కాదు. ఆ తత్త్వమును 'ఆత్మ' శబ్దముచే పరామర్శించెను గదా. మఱియు సద్విద్యానిష్ఠునికి మోక్షము కల్గునని ఉపదేశించుచున్నాడు. మోక్షము బ్రహ్మనిష్ఠునికే గాని ప్రకృతినిష్ఠునికి కాదు. కావున 'సత్' అనగా బ్రహ్మమే! ప్రకృతి పరిత్యజింపతగినది. బ్రహ్మము ఉపాసింపతగినది. 'సత్' తత్త్వమును ఉపాసింపుమని ఉపదేశించియుండుటచే అది ప్రకృతి కాజాలదు. మఱియు "దేనిని తెలిసికొనిన సర్వము తెలియగలదో, అట్టి దానిని తెలిసికొనుము" అని ప్రతిజ్ఞచేసియుండుటచే జగత్కారణతత్త్వమును బ్రహ్మముగా అంగీకరింపవలయును. సుషుప్తిదశలో జీవుడు తన కారణములో లీనమగును. కావుననే 'స్వపితి' అని అనుచున్నాము. ఇచట కారణమైన తత్త్వము బ్రహ్మమే. దానియందు జీవుడు లీనమగుట యుక్తమగును. ఇతర ఉపనిషత్తులన్నియు ఆత్మ, బ్రహ్మ, మున్నగు శబ్దములచే జగత్కారణ వస్తువు చేతనము అని తెలుపుచుండుటచే, ఇచటి 'సత్' శబ్దమునకును బ్రహ్మము అనియే అర్థము. ఇంత యేల? ఈ ఛాందోగ్యముననే, "ఆత్మన ఏవేదం సర్వం" అని ఉండుటచే ఇచటి 'సత్' శబ్దమునకును, బ్రహ్మ మనియే అర్థము. కాని ప్రకృతి యని కాదు.

## 6. ఆనన్దమయాధికరణము 6 (8)

### ఆనన్దమయుఁడు పరమాత్మ

13 సూ — అనందమయోఽభ్యాసాత్. (1) 1.1.13

పద — ఆనందమయః, అభ్యాసాత్.

అర్థ — ఆనందమయః = 'అన్యోఽన్తర ఆత్మాఽనందమయః' (తైత్తి-బ్ర-5) అను శ్రుతివాక్యమున, "ఆనందమయ శబ్దముచే బోధింపబడువాడు పరమాత్మ, అభ్యాసాత్ = ఆనన్దమును మూరేసి రెట్లు పెంచి చెప్పియున్నందువలన.

వివ — "సైషా నందస్య మీమాంసా భవతి." (తైత్తి-బ్ర-2-8) ఇది "ఆనంద మీమాంస" అని ప్రారంభించి "యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ, ఆనన్దం బ్రహ్మణో విద్వాన్ (తైత్తి - బ్ర-9) "ఏతత్త్వము నుండి మనస్సులతో సహా వాక్కులు మరలుచున్నవో, అట్టి బ్రహ్మానందమును పొందినవాడు" అను శ్రుతి మనుష్యానందము మొదలుకొని, బ్రహ్మానందము వరకు గల అనేక దేవతాదుల ఆనందములను ఒకదానికంటె, మరియొకటి నూరురెట్లు అధికమని తెల్పుచు బ్రహ్మానందము అవాఙ్మానస గోచరమని తెలిపియున్నది. అట్టి నిరతిశయానన్దము కలది పర బ్రహ్మమేగాని జీవుడు కాజాలడు. కావున "అన్యోఽన్తర ఆత్మాఽనందమయః" అను వాక్యమున "ఆనందమయ శబ్దముచే అపరిమితానందమగు పరబ్రహ్మమే బోధింపబడుచున్నది.

14 సూ — వికారశబ్దాన్నేతిచేన్న ప్రాచుర్యాత్ (2) 1-1-14

పద — వికారశబ్దాత్, న ఇతి చేత్, న, ప్రాచుర్యాత్.

అర్థ — వికారశబ్దాత్ = ఆనందమయ శబ్దమున వికారమగు "మయట్" ప్రత్యయము వినబడుటవలన, నేతిచేత్ = ఆనందమయ

శబ్దము బ్రహ్మమును బోధింపజాలదు అనుచో, 'న' = 'మయట్' ప్రత్యయము వికారార్థమున వచ్చినదికాదు, ప్రాచుర్యాత్ = ప్రాచు ర్యార్థమున వచ్చినది. కావున ఆనందమయ శబ్దము బ్రహ్మమును బోధించుచున్నది,

వివ — సంస్కృత వ్యాకరణమున 'మయట్' అను ప్రత్యయము కలదు. అది మృణ్మయము, సువర్ణయము, పున్నగురూపములలో వికారార్థమున అనగా మూలవస్తువే పరిణమించినది అను అర్థమున వచ్చినది. మృణ్మయము అనగా మట్టితో తయారైనది, సువర్ణ మయము అనగా బంగారుతోతయారైనది అని అర్థము. ఇచట మృణ్మయమైన కలశమునకు మూలపదార్థము మట్టి. ఆ మట్టి కలశముగా వికారమును = మార్పును - పొందినది. ఇట్లే, స్వర్ణ మయమైన ఆభరణమునకు మూలపదార్థము బంగారము. బంగారమే ఆభరణముగా మార్పుచెందినది. ఈ మార్పునే శాస్త్రకారులు వికారమని యందురు. ఆనందమయ శబ్దముచే బ్రహ్మము బోధింప బడుచో అతడు ఆనందవికారుడు కావలసియుండును. బ్రహ్మము నిర్వికారము కదా! ఇది పూర్వపక్షము

సిద్ధాంతము. : 'మయట్' ప్రత్యయము వికారార్థ మునసే కాక, ప్రాచుర్యార్థమునను అనగా, అధికమైనది, లేక నిండినది, అను అర్థమునను వచ్చుచున్నది. జలమయము, అన్నమయము మొదలగునవి ఇందులకు ఉదాహరణములు. ఎక్కువనీరు వ్యాపించినది, ఎక్కువ అన్నము విస్తరించియున్నది అని అర్థము. ఆనందమయ శబ్దమున, మయట్ ప్రత్యయము ఈ ప్రాచుర్యార్థమున వచ్చినది. ఆనందమయుడనగా, ఆనం దముతో నిండినవాడు అని అర్థము. ఇది బ్రహ్మమునకే తగి

యున్నది. జీవుడు బ్రహ్మమువలననే ఆనందమును పొందగలుగు చున్నాడు. జీవుల నందరిని ఆనందింపజేయగల బ్రహ్మము ఇచట ఆనందమయ శబ్దముచే పేర్కొనబడినది.

15 సూ — తద్ధేతువ్యపదేశాచ్చ (3) 1-1-15

పద — తత్ + హేతువ్యపదేశాత్, చ

అర్థ — తద్ధేతువ్యపదేశాచ్చ="ఏష హ్యేవానన్దయాతి" (తైత్తి-బ్ర-7-1) "ఈ పరమాత్మయే జీవుల నానందించేయుచున్నాడు" అను శ్రుతివాక్యము ఇతరుల ఆనన్దమునకు హేతువు పరమాత్మ అని చెప్పుట చేతను ఈ ఆనన్దమయుడు పరమాత్మయే.

16 సూ — మాంత్రవర్ణికమేవ చ గీయతే (4) 1-1-16

పద — మాంత్రవర్ణికం, ఏవ, చ, గీయతే.

అర్థ — మాంత్రవర్ణికమేవ = "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" (తైత్తి-బ్ర-2-1) అను మంత్రమున పేర్కొనబడిన బ్రహ్మమే, గీయతే="అన్యోఽన్తర ఆత్మానందమయః" (తైత్తి-2-5) అను బ్రాహ్మణ వాక్యమున ఆనందమయముగ ప్రస్తుతింపబడినది. కావున ఆనందమయము బ్రహ్మమే.

17 సూ — నేతరోఽనుపపత్తేః (5) 1-1-17

పద — న, ఇతరః, అనుపపత్తేః

అర్థ — ఇతర = బ్రహ్మముకంటెవేరైన జీవుడు ఆనందమయ శబ్దముచే బోధింపబడడు, అనుపపత్తేః = ఈ ప్రకరణమున బ్రహ్మమునకు చెప్పబడిన సర్వజ్ఞత్వాది గుణములు, సంకల్పపూర్వకముగ సృష్టి, స్థితి, లయాదులు గావించుట, మొదలగునవి జీవునియందు అనుపపన్నములగుటవలన.

వివ — ఈ ప్రకరణమున "సోఽకామయత బహుస్యామ్" (తైత్తి - బ్ర- 2-1) "ఆ బ్రహ్మము వివిధరూపములను తాల్చవలయు నని సంకల్పించినది" అనుచు బ్రహ్మము అతని జగత్కారణముగ పేర్కొనబడినది. ఇట్లే "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా"(తైత్తి - 2-1) "సత్య, జ్ఞాన అనంత స్వరూపమైన బ్రహ్మ మును దర్శించినవాడు సర్వజ్ఞమైన ఆ బ్రహ్మముతో బాటు సకల విధములైన అతని కళ్యాణగుణములను అనుభవించును" అని బ్రహ్మముయొక్క సర్వజ్ఞత్వము చెప్పబడినది. ఈ గుణము లేవియు జీవుని యందు సంగతములు గావు. కావున ఆనందమయ శబ్దము బ్రహ్మమును బోధించునే గాని, జీవుని బోధింపజాలదు. (కామ్యంతే ఇతి) కామాః = కోరబడు కళ్యాణ గుణములు.

18 సూ — భేదవ్యపదేశాచ్చ. (6) 1-1-18

పద — భేద వ్యపదేశాత్ చ.

అర్థ — భేదవ్యపదేశాచ్చ = "విజ్ఞానమయాత్ అన్యోన్తర ఆత్మానందమయః (తైత్తి-బ్రి-2-4) విజ్ఞానమయుడైన జీవునికంటే వేరుగా అతనిలో ఉన్నవాడు ఆనందమయుడు" అని స్పష్టముగ, జీవాత్మకంటె ఆనందమయునికి భేదమును చెప్పియుండుటచేతను ఆ ఆనందమయుడు బ్రిహ్మమే.

19 సూ — కామాచ్చ నాఽనుమానాఽపేక్షా. (7) 1-1-19

పద — కామాత్, చ, న, అనుమాన + అపేక్షా.

అర్థ — కామాత్ = "బహుస్యామ్" "వివిధరూపముల దాల్తును" అని బ్రహ్మము సంకల్పించుటవలన, అనుమానాఽపేక్షా = అను మానముయొక్క అనగా ప్రకృతియొక్క అవసరము, న = లేదు) కావున ఆనందమయము బ్రహ్మమే కాని జీవుడు కాడు.

వివ — ప్రకృతి సంబంధము ఉన్నప్పుడే జీవుడు ఏ కార్యమునైనను చేయుచున్నాడు. ఆనందమయ శబ్దముచే చెప్ప బడినవాడు సంకల్పమాత్రముచేతనే సృష్టించుచున్నాడని చెప్పి నందున అతడు బ్రహ్మమే.

20 సూ — అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి. (8) 1-1-20

పద — అస్మిన్, అస్య, చ, తత్ + యోగం, శాస్తి.

అర్థ — అస్మిన్ = ఈ ఆనందమయునిలో (చేరినంతనే) అస్య = ఈ జీవునకు, తద్యోగం = ఆ ఆనందసంబంధమును ఉప నిషత్తు శాస్తి = బోధించుచున్నది.

వివ — "రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి" (తైత్తి - బ్ర - 2-6) "అతడు (బ్రహ్మము) రసము. అట్టి రసస్వరూపుడైన బ్రహ్మమును పొంది, ఈజీవుడు ఆనందము కల వాడగుచున్నాడు" అనుటచే జీవు లందరికి అన్ని దశలలోను ఆనం దమును కలిగించు అ బ్రహ్మమే ఇచట ఆనందమయ మని పేర్కొన బడినది.

## 7. అంతరధికరణము 7 (2)

సూర్యుని యందు అక్షియందు ఉన్నవాడు పరమాత్మ

21 సూ — అంతస్తద్ధర్మోపదేశాత్. (1) 1-1-21

పద — అంతః, తత్ + ధర్మ + ఉపదేశాత్.

అర్థ — అంతః = సూర్యునియందును, నేత్రమునందును ఉన్నట్లు వర్ణింపబడినది బ్రహ్మమే, తద్ధర్మోపదేశాత్ = బ్రహ్మమునకు సంబంధించిన ధర్మములను ఉపదేశించి ఉండుటవలన.

వివ — ఛాందోగ్యమున, అథ య ఏషోఽంతరాదిత్యే హిర ణ్మయః పురుషో దృశ్యతే'' (ఛాం. 1-6-6-7) అను వాక్యమునందు ఆదిత్యునియందు హిరణ్మయుడైన పురుషుడు, దర్శింపబడుచున్నట్లు చెప్పబడియున్నది. ఇట్లే "అథ య ఏషోఽన్తరక్షిణి పురుషః'' (ఛాం-ప్ర- 15-1) అను వాక్యమున నేత్రమునందు పురుషుడు ధ్యానింప బడుచున్నట్లు చెప్పబడియున్నది. ఈ ఆదిత్యునియందును, నేత్రము నందును ధ్యానింపబడునట్లు చెప్పబడిన పురుషుడెవడు? అను ప్రశ్నకు ఈ సూత్రము సమాధానము. పై రెండు స్థలములందు ధ్యానింప బడుచున్నట్లు చెప్పబడిన పురుషుడు బ్రహ్మమే గాని, జీవుడు కాదు. ఏల యన "తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ." "ఆ పురుషునియొక్క నేత్రములు వికసించి. తామరపూలవలె ఉండు ననియు, (కపి + ఆసం, కః పిబతి ఇతి కపిః, అనగా నీటిని త్రాగు వాడు = సూర్యుడు, అతనిచే ఆసం = వికసింపచేయబడిన) "స ఏష సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః" (ఛాం-1- 6-7) "ఈ పురుషుడు అన్ని పాపములనుండి దూరముగ నుండు వాడ"నియు చెప్పియుండుటచే, ఈ ధర్మములు బ్రహ్మమునకే గాని, జీవునకు సంభవింపవు. కావున ఆదిత్యాంతర్వర్తియైన పురుషుడు బ్రహ్మమే యని భావము.

22 సూ — భేదవ్యపదేశాచ్చాన్యః (2) 1-1-22

పద — భేదవ్యపదేశాత్, చ, అన్యః.

అర్థ— భేదవ్యపదేశాచ్చ = "య ఆదిత్యే తిష్ఠన్ ఆదిత్యాదంతరో యమాదిత్యో న వేద'' (బృ- 5-7-9) "ఎవడు ఆదిత్యునియందు ఉన్నవాడగుచు అతనిని నియమించుచున్నాడో ఎవనిని ఆదిత్యుడు తెలియలేకున్నాడో" అనియు, "య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽన్తరః యమాత్మా న వేద'' (బృ- 5-7-12) "ఎవడు ఆత్మలో ఉన్నవాడ

యము అతనిని నియమించుచున్నాడో, ఎవనిని ఆత్మ తెలియలేకున్నదో'' అనియెడు జీవాత్మపరమాత్మలకు భేదమును చెప్పుటవలనను, అన్యః = ఆదిత్యుని యందున్న పురుషుడు జీవునికంటె భిన్నుడు.

## 8. ఆ కా శా ధి క ర ణ ము. 8

జగత్కారణమని పేర్కొనబడిన ఆకాశము పరమాత్మ.

సూత్ర — ఆకాశస్తల్లింగాత్.

పద — ఆకాశః, తత్ + లింగాత్.

అర్థ — ఛాందోగ్యమున "అస్య లోకస్య కా గతిరితి, ఆకాశ ఇతి హోవాచ'' (ఛాం-1-8-1) అనియున్నది. "ఈ లోకమునకు ఏది గతి'' అని ప్రశ్నింపగా "ఆకాశము'' అని సమాధానము చెప్పబడినది. ఇచట ఆకాశ శబ్దమునకు "బ్రహ్మము'' అని అర్థము. ఆకాశమనగా అంతట వ్యాపించి, ప్రకాశించునది. కావున ఈ వ్యుత్పత్తి ప్రకారము బ్రహ్మము ఆకాశ శబ్దముచేత పేర్కొనబడినది, తల్లింగాత్ = తరువాతి వాక్యములలో బ్రహ్మమునకు సంబంధించిన ముఖ్యలక్షణములు పేర్కొనబడియున్నందువలన.

వివ — "సర్వాణి హ వా ఇమాని భూతాని ఆకాశదేవ సముత్పద్యంతే, ఆకాశం ప్రత్యస్తంయంతి, ఆకాశో హ్యేవైభ్యో జ్యాయాన్ ఆకాశః పరాయణం'' (ఛాం- 1-9-1) "ఈ ప్రాణులన్నియు ఆకాశము నుండియే పుట్టుచున్నవి. ఆకాశమునందే లీనమగుచున్నవి. వీని కన్నిటి కంటె ఆకాశము చాల పెద్దది. ఆకాశము ఈ ప్రాణుల కన్నింటికి స్థానము''. అని చెప్పబడియున్నది. ఇచట ఆకాశమును గురించి చెప్పిన, ఈ లక్షణము లన్నియు బ్రహ్మమునకు సంబంధించినవే కాని, పంచభూతములలో ఒకటైన ఆకాశమునకు సంబంధించినవి కావు. ఇట్లు బ్రహ్మలక్షణములను చెప్పుటవలన జగత్కారణముగ చెప్పబడిన ఆకాశశబ్దమునకు బ్రహ్మమనియే అర్థము.

## 9. ప్రాణాఽధికరణము 9 (1)

### జగత్కారణమైన ప్రాణము పరమాత్మ

24 సూ— అత ఏవ ప్రాణః 1-1-24

పద — అతః, ఏవ, ప్రాణః

అర్థ — అతఏవ = బ్రహ్మ లక్షణములు చెప్పబడియున్నవి అను ఈ కారణమువలననే ; ప్రాణః = ప్రాణశబ్దవాచ్యుడు పరమాత్మ.

వివ — "సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభి సంవిశంతి" (ఛా-1-11-5) అని ఛాందోగ్యమున కలదు. ఈ "ప్రాణులన్నియు ప్రళయమున ప్రాణమును ప్రవేశించుచున్నవి" అని చెప్పబడినది. ఇచటి "ప్రాణ" శబ్దమునకును (పై ఆకాశశబ్దమునకువలె) బ్రహ్మ మనియే అర్థము. కాని పంచప్రాణములలో ఒకటైన ప్రాణము అని కాదు. ప్రాణము అనగా జీవింపచేయునది. "ప్రకర్షేణ అనయతీతి ప్రాణః" అని వ్యుత్పత్తి.

## 10. జ్యోతిరధికరణము 10 (4)

### ద్యులోకమునకు పైన వెలుగు జ్యోతి పరమాత్మ.

25 సూ — జ్యోతిశ్చరణాభిధానాత్ (1) 1-1-25

పద — జ్యోతిః, చరణ + అభిధానాత్.

అర్థ — జ్యోతిః = "అథ యదతః పరో దివోజ్యోతిః దీప్యతే (ఛా- 3- 13-7) "ఇక ద్యులోకముకంటె పైగా ఏ జ్యోతి వెలుగుచున్నదో" అను వాక్యమున జ్యోతిశ్శబ్దము బ్రహ్మమును బోధించును; చరణాఽభిధానాత్ = "పాదోఽస్య విశ్వా భూతాని. త్రిపాదస్యాఽమృతం దివి" (ఛా- 3- 12-6) "జ్యోతిస్సుయొక్క ఒకపాదము (¹) ఈ వ్యక్తమైన ప్రపంచము" అని చెప్పుటవలన,- "దీనియొక్క

అనశ్వరముపైన మిగిలిన మూడు పాదములు ద్యులోకమున నున్నవి.

26 సూ — ఛందోఽభిధానాన్నేతి చేన్న, తథా చేతోఽర్పణ నిగమాత్తథా హి దర్శనమ్ (2) 1-1-26

పద — ఛందః, అభిధానాత్, నఇతిచేత్, న, తథా, చేతః+అర్పణ నిగమాత్, తథాహి, దర్శనమ్.

అర్థ — ఛందః + అభిధానాత్ = గాయత్రీఛందస్సును చెప్పియున్నందువలన, నేతిచేత్ = ఇచటి జ్యోతిశ్శబ్దము బ్రహ్మమును బోధించదు అనినచో న = అట్లుకాదు, తథా = అట్లు గాయత్రీసాదృశ్యముతో జ్యోతిరూపమగు బ్రహ్మమును, చేతోఽర్పణ నిగమాత్ = మనస్సున భావింపవలసినట్లు నిశ్చయింపబడుటవలన; తథాహి దర్శనం = ఆ విధముగనేగదా గాయత్రీఛందము నాల్గుపాదములతో చూపట్టుచున్నది

వివ — "అథ యదతః పరో దివోజ్యోతిః దీప్యతే" (ఛా-3-13-7) అను వాక్యమున పేర్కొనబడిన జ్యోతిస్సు "గాయత్రీ వా ఇదం సర్వం" (ఛా- 3-12-1) "ఇదియంతయు గాయత్రియే" అనుటచే గాయత్రీఛందస్సే ఇచట ప్రతిపాదింపబడియున్నది. "గాయత్రికి మూడు పాదములే కదా! "పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" (ఛా- 3-12-6) అను వాక్యమున నాలుగు పాదములు ప్రస్తావింపబడియున్నవే" అను సందేహమువలదు.. గాయత్రీ ఛందస్సు నాల్గు పాదములతోడను చూపట్టుచున్నది ఇందులకు ఉదాహరణము—

" ఇంద్రశ్శచీపతిః, వలేన పీడితః
దుశ్చ్యవనో వృషా, సమిత్సు సాసహిః. "

ఈ నాల్గుపాదములగల గాయత్రియే ఇదివరలో జ్యోతిస్సుగా ప్రస్తుతింప బడినది అని పూర్వపక్షము.

సిద్ధాంతము : "గాయత్రీ వా ఇదం సర్వం" అనుచు గాయత్రీ ఛందస్సును ప్రస్తావించి, అది నాల్గుపాదములు కలదిగా ప్రశంసింపబడినది. అంతమాత్రమున చేత ఇచటి జ్యోతిశ్శబ్దము గాయత్రీ ఛందస్సును బోధించుననని తలంపరాదు. జ్యోతిశ్శబ్దముచేత బోధింపబడు బ్రహ్మమును గాయత్రీ రూపమున ధ్యానింపుమని తెలుపుటకే గాయత్రి ఇచట ప్రస్తావింపబడినది. గాయత్రీఛందస్సునకు వలెనే, బ్రహ్మమునకును నాల్గుపాదములు కలవు.

శ్రీ శంకరుల భాష్యమున "ఛందోఽభిధానాన్నేతి చేన్న తథా చేతోఽర్పణ నిగదాత్తథాహి దర్శనమ్" అని యీ సూత్రము పఠింపబడినది.

27 సూ — భూతాది పాద వ్యపదేశోపపత్తేశ్చైవం (3) 1-1-27

పద — భూత + ఆది, పాద వ్యపదేశ + ఉపపత్తేః, చ, ఏవం

అర్థ — భూతాది = భూత, పృథివీ, శరీర, హృదయములను నాల్గింటిని పాదవ్యపదేశ=నాలుగుపాదములనుగా చెప్పుట ఉపపత్తేశ్చ = బ్రహ్మమునకు మాత్రమే సరిపడుచున్నందువలనను, ఏవం = జ్యోతిశ్శబ్దమునకు ఇట్లే బ్రహ్మమని అర్థమును గ్రహింపవలయును.

28 సూ — ఉపదేశ భేదాన్నేతి చేన్నోభయస్మిన్నప్యవిరోధాత్ (4) 1-1-2

పద — ఉపదేశభేదాత్, న, ఇతి, చేత్, న, ఉభయస్మిన్, అపి, అవిరోధాత్.

అర్థ — ఉపదేశభేదాత్ = ద్యులోకమున అని ఒకచోట

లోకముకంటె పైన అని మరియొకచోట చెప్పియున్నందువలన ఈ రెండు స్థలములలో బ్రహ్మమే చెప్పబడినది అనుట, న = తగదు. ఇతిచేన్న = ఇట్లు చెప్పుట యుక్తముకాదు, ఉభయస్మిన్‌అపి = పైన రెండు పద్ధతులలోను, అవిరోధాత్ = విరోధము లేనందువలన.

వివ — ఛాందోగ్యమున "త్రిపాదస్యామృతందివి" (ఛా-3-13-7) "ఈ బ్రహ్మముయొక్క మూడు పాదములు (భాగములు) ద్యులోకమునందు ఉన్నవి" అని చెప్పబడినది. ఆ ఉపనిషత్తునందే మరియొకచోట "అథ యదతః పరోదివో జ్యోతిః దీవ్యతే" (ఛా-3-12-6) "ఈ ద్యులోకముకంటె పైన ఏ జ్యోతి వెలుగుచున్నదో" అని చెప్పబడినది. ద్యులోకమున ఉన్నది, ద్యులోకముకంటె పైన ఉన్నది ఒకటే ఎట్లగును? కావున ద్యులోకముకంటె పైన ఉన్నజ్యోతిస్సు బ్రహ్మము కాజాలదు అని పూర్వపక్షము.

సిద్ధాంతము : ద్యులోకమున ఉన్నది అన్నను, ద్యులోకము కంటే పైన ఉన్నది అన్నను అర్థములో భేదము కలుగదు. కావున పై రెండు వాక్యములలో చెప్పబడినది బ్రహ్మమే! ఇందుకు ఒక ఉదాహరణము.

"వృక్షాగ్రే శ్యేనః" చెట్టు కొనలో డేగ యున్నది."
"వృక్షాగ్రాత్" పరతః శ్యేనః ""వృక్షము కొనకంటె పైన డేగ యున్నది" అను ఈ రెండు వాక్యముయొక్క భావము ఒక్కటే కదా?

## 11. ఇంద్ర ప్రాణాధికరణము (4)

### ఇంద్రప్రాణశబ్దములు పరమాత్మ వాచకములు

29 సూ — ప్రాణస్తథాఽను గమాత్ (1) 1-1-29

పద — ప్రాణః, తథా, అనుగమాత్.

అర్థ — ప్రాణః = "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా" (కౌషీతకి 3-2) "ప్రజ్ఞా స్వరూపుడైన ప్రాణమునై వున్నాను" అను వాక్యమున "ప్రాణ' శబ్దము బ్రహ్మమును బోధించుచున్నది; తథా = బ్రహ్మము నకు సంబంధించినట్లు ; అనుగమాత్ = తర్వాతి వాక్యములద్వారా తెలియుటవలన.

వివ — "కౌషీతకి" ఉపనిషత్తున "ప్రతర్దమని" ఐతిహ్య మొకటి కలదు. "దివోదాసుని కుమారుడు ప్రతర్దముడు. ఇతడుయుద్ధ రంగమున పౌరుషమును చూపుటచే ఇంద్రుని సన్నిధిని చేరెను. ఇంద్రుడు. ఏదేని వరమును కోరుకొనమనెను ప్రతర్దముడు మనుష్యు నికి ఏది హితమని నీవు తలంతువో, అద్దానిని ప్రసాదింపుమనెను. అంతట ఇంద్రుడు "నన్ను వుపాసింపుము; నేను ప్రజ్ఞాస్వరూపమైన ప్రాణమై యున్నా"నని వుపదేశించెను. వాస్తవమున ఈ సన్ని వేశమును పరిశీలించినచో ఇచటి ప్రాణశబ్దముచేత ఇంద్రుడే బోధింప బడుచున్నాడని స్ఫురించుచున్నది. కాని సమగ్రముగా ఈ వుపనిష ద్వాక్యములను పరిశీలించినచో "ప్రాణ" శబ్దముచేత బ్రహ్మము బోధింపబడునే కాని ఇంద్రుడుకాడు. ఏలఅన "సఏషప్రాణఏవ ప్రజ్ఞాత్మా అనందః అజరః అమృతః" (కౌషీతకి. 3-9) "ఈ ప్రాణశబ్ద వాచ్యుడే ప్రజ్ఞాస్వరూపుడు, ఆనంద స్వరూపుడు, జరామరణములు లేనివాడు" అని వర్ణింపబడియున్నది. ఆనందమయుడు, జరామరణ రహితుడు అయినవాడు బ్రహ్మము కావలయునే కాని ఇంద్రుడుగాని, ప్రాణముగాని కాదు.

30 సూ — న వక్తురాత్మోపదేశాదితి చేత్ అధ్యాత్మ సంబంధ భూమా హ్యస్మిన్ (2) 1-1-30

పద — న, వక్తుః, ఆత్మోపదేశాత్, ఇతి, చేత్, అధ్యాత్మ సంబంధభూమా, హి, అస్మిన్.

అర్థ—వక్తుః = వక్తయైన ఇంద్రునియొక్క, ఆత్మోపదేశాత్ = తనను ప్రాణముగ ఉపాసింపుమని ఉపదేశించుటవలన; నేతి చేత్= ఇచటి ప్రాణశబ్దమునకు బ్రహ్మము అర్థముకాదు అనినచో, (అది సరికాదు) అస్మిన్ = ఈ ప్రాణశబ్దముచే బోధింపబడిన వానియందు, అధ్యాత్మసంబంధభూమా హి = బ్రహ్మమునకు సంబంధించిన అనేక విషయములు చూపట్టుచున్నవి గదా!

వివ — ఇంద్రుడు "నేను ప్రాణము; నన్ను ఉపాసింపుము" అని ఉపదేశించినను, ప్రాణశబ్దము ఇంద్రుని బోధింపదు ఈ ప్రాణశబ్దవాచ్యుడు మంచిపనులను, చెడుపనులను చేయించు ననియు, ఇతడు ఆనందము, అజరము, అమృతము అనియు, లోకాధిపతి, సర్వేశ్వరుడు అనియు చెప్పబడిన అనేక విషయములు బ్రహ్మమునందే సంగతములు కని, ఇంద్రునియందు సంగతములు కాకపోవుటచే ఈ ఇంద్రప్రాణశబ్దములకు బ్రహ్మమనియే అర్థము.

31సూ — శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్. (3) 1-1-31

పద — శాస్త్రదృష్ట్యా, తు, ఉపదేశః, వామదేవవత్.

అర్థ — ఉపదేశస్తు = "నన్నే ఉపాసింపుము" అను దేవేంద్రుని ఉపదేశము ఎట్లు సంగతమగును? అనినచో, శాస్త్రదృష్ట్యా = శాస్త్రమును దృష్టిలో ఉంచుకొనుటచేత, (సంగతమగును) వామదేవ

వత్ = " అహం మనురభవం సూర్యశ్చ " (బృ- 1-4-10) " నేను మనువునైతిని, సూర్యుడనైతిని " అని పలికిన వామదేవుని వలె.

వివ — బ్రహ్మము చేతనాచేతనములయందు అంతర్యామిగ ఉండుటచే, చేతనాచేతనవాచకములైన పదములు బ్రహ్మమును బోధింపవచ్చును. ఆకారణముచేతనే వామదేవుడు " నేనే మనువును అయితిని ; సూర్యుడనైతిని " అని పల్కినాడు. ఈ దృష్టితోనే ఇచట ఇంద్రుడును " నన్ను ఉపాసింపుము, నేను ప్రాణమైయున్నాను " అని చెప్పెను. ఇచట " నన్ను అనగా నాయందు అంతర్యామిగా ఉన్న పరమాత్మను " అని అర్థము.

32 సూ — జీవముఖ్యప్రాణలింగాన్నేతి చేన్నోపాసాత్రైవిద్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్ (4) 1-1-32

పద — జీవముఖ్యప్రాణలింగాత్, న, ఇతి, చేత్, న, ఉపాసాత్రైవిద్యాత్, ఆశ్రితత్వాత్, ఇహ, తత్ + యోగాత్.

అర్థ — జీవముఖ్యప్రాణలింగాత్ = జీవునికి సంబంధించిన అంగములు ఉండుటవలన, నేతిచేత్ = ఈ ఇంద్ర ప్రాణ శబ్దములు బ్రహ్మబోధకములు కావు అనిన చో, న = అది యుక్తముకాదు. ఉపాసాత్రైవిద్యాత్ = ఉపాసనలు మూడు విధములుగ ఉండుటవలన ; ఆశ్రితత్వాత్ = మూడు విధములైన ఉపాసలును, ఉపనిషత్తులలో బోధింపబడినందువలనను, ఇహ = ఇచట, అనగా ఇంద్రప్రాణాదిపదముల విషయమున, తద్యోగాత్ = ఆ మూడు విధములైన ఉపాసనలు సరిపడుటవలనను, ఇంద్రప్రాణశబ్దములచే బ్రహ్మమేబోధింపబడుచున్నది.

వివ — ఇంద్రుడు ప్రతర్దనునితో " మాముపాస్వ" " నన్ను

ముపాసింపుము" అనిచెప్పి "త్రిశీర్షాణం త్వాష్ట్ర మహనం" (కౌషీ తకి3-2 "మూడుతలలుగల త్వాష్ట్రుని అనగా త్వష్టృప్రజాపతియొక్క పుత్రుని చంపితిని అనిచెప్పుటచేత ఉపాస్యునిగాచెప్పినది ఇంద్రుడు అనుజీవుని గూర్చియే యని స్పష్టమగుచున్నది. ఇట్లే "ప్రాణోఽస్మి" "నేను ప్రాణమైయున్నాను" అనిచెప్పి, "యావదస్మిన్ శరీరే ప్రాణోవసతి తావదాయుః"(కౌషీ-3-2) "ఎంతవరకు ఈశరీరమున ప్రాణముండునో అంతవరకే ఆయుపు" అని చెప్పుటచే ప్రాణ శబ్దమునకు ముఖ్య ప్రాణమనియే అర్థమని స్పష్టమగుచున్నది. కావున ఈ పదములు బ్రహ్మబోధకములుకావు అని పూర్వపక్షము.

ఇక సిద్ధాంతము :

ఉపనిషత్తులలో బ్రహ్మము మూడు విధములుగ వర్ణింపబడు చున్నది. 1) శుద్ధబ్రహ్మము. ఇది సత్య, జ్ఞాన, ఆనంద స్వరూపము 2) జీవాంతర్యామియైన బ్రహ్మము "య ఆత్మని తిష్ఠన్ ఆత్మానం అంతరోయమయతిం" (బృహ-3-7-9) "ఎవడు ఆత్మలో వున్నవాడై ఆత్మను ప్రేరేపించుచుండునో" అనితెలుపబడినది 3)అచేత నాంతర్యామి యైనబ్రహ్మము. "యః పృథివ్యాం తిష్ఠన్"(బృహ-3-7-3)"ఎవడు భూమి లోపల వున్నవాడై దానిని ముందుకు నడిపించుచున్నాడో అతడు" అని తెలుపబడినది. ఈ మూడు రూపములలోను బ్రహ్మమును ఉపాసింపవచ్చును. దీనిచే ఈ ఉపాసన మూడు విధములగు చున్నది.

1) శుద్ధబ్రహ్మోపాసన,
2) జీవాంతర్యామి బ్రహ్మోపాసన,
3) అచేతనాంతర్యామి బ్రహ్మోపాసన.

ప్రకృతము ఈ మూడు విధములైన ఉపాసనలు ఇచట తెలుపబడినవి

ఇంద్రుడు " మా ముపాస్స్వ " నన్ను " ఉపాసింపుము " అనుటచే జీవాంతర్యామిబ్రహ్మోపాసనము ; " ప్రాణోఽస్మి " " ప్రాణమై యున్నాను " అనుటచే అచేతనాంతర్యామి - బ్రహ్మోపాసనము, "ఆనందః, అజరః, అమృతః" "ఆనందమయుడు జరామరణరహితుడు" అనుటచే శుద్ధబ్రహ్మోపాసనము అగుచున్నవి. కావున ప్రతర్దునికి ఇంద్రునిచే ఉపదేశింపబడినది బ్రహ్మోపాసనము కాని కేవల చేతనా చేతనోపాసనలు కావు.

ప్రథమాధ్యాయ ప్రథమపాదము సమాప్తము

అధికరణములు 11 - సూత్రములు 32

శ్రీమతే నిగమాన్త మహాదేశికాయ నమః

అధికరణ సారావళీ

ప్రథమాధ్యాయ ప్రథమపాదార్థ సంగ్రహశ్లోకము.

శ్లో॥ స్వేచ్ఛాతస్సర్వహేతు శ్శుభగుణవిభవానన్తనిస్సీమహర్షః
శుద్ధాఽకర్మోత్థ దివ్యాకృతి రనవధికాఽఽకాశనాదిస్వభావః।
సప్రాణాఽప్రాణభేదవ్యతిభిదురజగత్ప్రాణనో దివ్యదీప్తిః
ప్రాణేంద్రాద్యంతరాత్మా ప్రభురధికరణై స్స్వప్తభిః ప్రత్యపాది॥

భావము : ఈక్షత్యధికరణమున సంకల్పపూర్వకజగత్స్రష్టృత్వము, ఆనందమయాధికరణమున ఆనందమయత్వాద్యనంత కళ్యాణగుణా కరత్వము, అంతరధికరణమున అకర్మవశ్యదివ్యమంగళవిగ్రహ త్వము, ఆకాశాధికరణము సర్వత్ర ప్రకాశమానత్వము, ప్రాణాధి కరణమున చేతనాచేతనాత్మక జగత్ప్రాణనత్వము, జ్యోతిరధికరణమున దీప్తిమత్త్వము, ఇంద్రప్రాణాధికరణమున సర్వాన్తర్యామిత్వము అను కళ్యాణగుణములు పరమాత్మకు కలవని ఈ ప్రథమాధ్యాయ ప్రథమ పాదమున నిరూపింపబడినవి.

—o—

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# ప్రథమాధ్యాయ - ద్వితీయపాదము

## అస్పష్ట జీవాది లింగకపాదము

## 12 సర్వత్రప్రసిద్ధ్యధికరణము (8)

మనోమయత్వాదిగుణములుగల బ్రహ్మము పరమాత్మయే.

33 — సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్ (1) 1-2-1

అర్థ— సర్వత్ర = "సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛా-3-14-12) "ఇది యంతయు బ్రహ్మము గదా" అను వాక్యమున అన్నింటికి ఆత్మగా చెప్పబడిన బ్రహ్మము పరబ్రహ్మమే; ప్రసిద్ధ + ఉపదేశాత్ = బ్రహ్మమునకు సంబంధించి ప్రసిద్ధమైన జగత్కర్తృత్వము చెప్పబడి నందువలన.

వివ — ఛాందోగ్యమున "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత" (ఛా- 3-14-2) "ఇది యంతయు బ్రహ్మముగదా: దానినుండి ఇదియంతయు పుట్టుచున్నది. దానియందే లయించు చున్నది. దానివలననే జీవించుచున్నది, అని, బ్రహ్మమును శాంతుడై ఉపాసింపవలయును " అను వాక్యమునగల బ్రహ్మశబ్దము పర బ్రహ్మమునుబోధించుచున్నది. జగత్సృష్ట్యాదులు పరబ్రహ్మకార్యములు గదా! బ్రహ్మశబ్దము జీవాత్మనుగూడ బోధించుచున్నది. కావున ఇచట బ్రహ్మశబ్దము జీవబోధకముగాదు అనుటకై ఈ అధికరణము ప్రారంభింపబడినది.

34 సూ — వివక్షితగుణోపపత్తేశ్చ (2) 1-2-2

అర్థ — వివక్షిత = ఇచట ఉపాసనమునకు అనుకూలముగ చెప్పదలంచిన, గుణ=మనోమయత్వాది గుణములు, ఉపపత్తేః + చ=

"సర్వం ఖల్విదం బ్రహ్మ" అను వాక్యమున గల బ్రహ్మశబ్దమునకు, "పరబ్రహ్మము" అని అర్థము చెప్పినపుడే ఉపపన్నము అగుటవలనను ఇచట బ్రహ్మశబ్దము పరమాత్మవాచకము.

వివ—"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత" అని ప్రారంభించి, "మనోమయః, ప్రాణశరః భారూపః సత్యసంకల్పః ఆకాశాత్మా, సర్వకర్మా, సర్వకామః," (ఛా- 3-14-12) "పరిశుద్ధ మైనమనస్సుచే తెలియబడువాడు, సర్వప్రాణములను శరీరముగా గలవాడు, అనగా సర్వప్రాణములకు ఆధారము, నియన్త, శేషి అయిన వాడు, ప్రకాశమాన దివ్యమంగళ విగ్రహ విశిష్టుడు, సత్యసంకల్పుడు, ఆకాశస్వరూపుడు, సర్వకర్మప్రేరకుడు, అవాప్తసమస్త కాముడు" అని ఆ బ్రహ్మము వర్ణింపబడినది. ఈ గుణములన్నియు పరమాత్మ యందే ఉపపన్నము అగుటవలన ఇచటి బ్రహ్మశబ్దము పరమాత్మను బోధించుచున్నది.

35 సూ — అనుపపత్తేస్తు న శారీరః (3) 1-2-3

అర్థ — అనుపపత్తేః + తు = పై మనోమయత్వాదిగుణములు జీవునియందు ఉపపన్నములు కానందువలన, శారీరః = శరీర సంబంధము గల జీవుడు, న = ఈ బ్రహ్మశబ్దమునకు అర్థము కాజాలడు.

36 సూ — కర్మకర్తృవ్యపదేశాచ్చ (4) 1-2-4

అర్థ — కర్మకర్తృవ్యపదేశాత్+చ= పరబ్రహ్మమును కర్మము గను, జీవుని కర్తగను చెప్పుటవలనను ఇచటి "బ్రహ్మ" శబ్దముచే జీవుడు బోధింపబడడు.

వివ — "ఏతమితః ప్రేత్య అభిసంభవితాస్మి" (ఛా-3-14-4)

"ఇచటినుండి బయలుదేరి జగత్కారణమైన ఈ తత్త్వమును పొంద గలను" అనుటచే బ్రహ్మమును పొందుటలో జీవుడు కర్తయగు చున్నాడు. బ్రహ్మము జీవునిచే పొందబడుటవలన అది కర్మము అగు చున్నది. ఈ రీతిని జగత్కారణముగ పేర్కొనబడిన బ్రహ్మము కంటె దానిని పొందునట్టి జీవుడు వేరగుటవలన ఇచటి బ్రహ్మశబ్దము పరబ్రహ్మమనియే అర్థము.

37 సూ — శబ్దవిశేషాత్ (5) 1-2-5

అర్థ — శబ్దవిశేషాత్ = "ఏషమ ఆత్మా అన్తర్హృదయే" (ఛా-3-14-3) "ఇతడు నాకు ఆత్మగా హృదయములోపల ఉన్నాడు" అని స్పష్టముగా పేర్కొనుటచే ఈ బ్రహ్మశబ్దము జీవవాచకము కాదు. జీవునకు అంతరాత్మగా బ్రహ్మమున్నది అనిగదా పై వాక్యమునకు భావము!

38 సూ — స్మృతేశ్చ (6) 1-2-6

అర్థ — స్మృతేః + చ = స్మృతివాక్యమువలనను ఈ విషయము స్పష్టమగుచున్నది.

వివ — "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" (భ.గీ. 15-15) "అందరి హృదయములయందు నేను ఉన్నాను" అను గీతావచనము పరబ్రహ్మము జీవులందరి హృదయములలో ఉన్నట్లు తెలుపుచున్నది.

39 సూ — అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతిచేన్న నిచాయ్యత్వా దేవం వ్యోమవచ్చ (7) 1-2-7

పద — అర్భక + ఓకస్త్వాత్, తత్ + వ్యపదేశాత్, చ, న, ఇతిచేత్ + న, నిచాయ్యత్వాత్, ఏవం, వ్యోమవత్, చ.

అర్థ — అర్భక + ఓకస్త్వాత్ = స్వల్పమైన హృదయమును

ఆనందముతో నుండును ” అని చెప్పబడినది. ఇచట కర్మఫలమును అనుభవింపక ఆనందముతో నుండు పక్షి పరమాత్మ. వాస్తమున సుఖ దుఃఖానుభవమునకు కారణము పుణ్యపాపరూపకర్మములే గాని కేవల శరీరసంబంధముకాదు. అట్టి పుణ్యపాపరూపకర్మలు జీవునకే గాని పరమాత్మకు ఉండవు గదా!

## 13. అత్త్రధికరణము 2 (4)

### ప్రళయకాలమున జగద్భక్షకుడు పరమాత్మ

41 సూ — అత్తా చరాచరగ్రహణాత్. (1) 1-2-9

అర్థ — అత్తా=కఠవల్లిలో “ యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః” (కఠ- 1-2-24) “ బ్రహ్మక్షత్రములు అనగా బ్రాహ్మణులు, క్షత్రియులు, ఈ ఉభయులును ఎవరికి అన్నమో” అని వర్ణింప బడిన జగద్భోక్త పరబ్రహ్మమే, చరాచర గ్రహణాత్ = “ బ్రహ్మ చ క్షత్రం చ” అనుచు చరాచరములను అతనికి అన్నముగ చెప్పుటవలన

వివ — కఠవల్లిలోని “ యస్య బ్రహ్మ చ క్షత్రం చ “ అను మంత్రమునందు జగద్భోక్తగా వర్ణింపబడినవాడు పరబ్రహ్మమే కాని జీవుడుకాడు. జగత్తును సృష్టించినవాడే గదా దానిని లయమొనర్చు నది. ఆ లయమునే ఇచట భోజనము అనుచున్నాడు. ఇచటి బ్రహ్మ క్షత్రపదములు చరాచరములకును ఉపలక్షకములు.

42 సూ — ప్రకరణాచ్చ. (2) 1-2-10

అర్థ — ప్రకరణాత్+చ= ప్రకరణమునుబట్టియు ఈ జగద్భోక్త పరబ్రహ్మమే.

వివ — “ యస్య బ్రహ్మ చ క్షత్రం చ ” అను మంత్రము

గల ప్రకరణమంతయు పరమాత్మనే బోధించుటచే ఈ జగద్భోక్త పర బ్రహ్మ మని భావము.

43 — గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్ (3) 1-2-11

అర్థ — గుహాం = హృదయగుహను, ప్రవిష్టౌ = ప్రవేశించిన వారు, ఆత్మానౌ హి = జీవత్మ పరమాత్మలుగదా. తత్+దర్శనాత్=ఆ అ విధముగ జీవాత్మతో కలసి పరమాత్మయు హృదయగుహలో ప్రవేశించినట్లు చూపట్టుచున్నందువలన.

వివ — "ఋతంపిబన్తౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ" (కఠ-1-3-1) "కర్మఫలము ననుభవించుచు ఇద్దరు హృదయగుహను ప్రవేశించిరి" అని కఠవల్లియందు చెప్పబడినది. ఈ గుహలో ప్రవేశించినవారు జీవాత్మపరమాత్మలు అని గ్రహింపవలయును. పరమాత్మ గుహలో ప్రవేశించునని ఈ కఠవల్లియందే "తం దుర్దర్శం గూఢమను ప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్" (కఠ- 2-2-12) "అతడు చూచుటకు శక్యముకాడు. పదార్థములలో గూఢముగ ప్రవేశించి యుండును. గుహలో ఉండును. అతిపురాతనుడు" అను మంత్రమున స్పష్టముగ చెప్పబడినది. ఇట్లే "యా ప్రాణేన సంభవత్యదితిర్దేవతా మయీ । గుహాం ప్రవిశ్య తిష్ఠన్తీ యా భూతేభిర్వ్యజాయత" (కఠ-2-4-7) "ప్రాణములతో కలసియుండునది ఇంద్రియాధీనములైన భోగములు గలది, హృదయ: గుహలో ప్రవేశించినదియునై పృథివ్యాది భూతములతో ఏది జనించినదో" అనుచు ఈ శ్రుతి జీవుడు హృదయ గుహలో ప్రవేశించినట్లు తెలుపుచున్నది. ఇచట "అదితి" అను పదమునకు కర్మఫలభోక్తయైన జీవుడు అని అర్థము. కావున హృదయ గుహలో ప్రవేశించి యుండువారు జీవాత్మ పరమాత్మలే అని భావము. జీవాత్మ కర్మఫలమును అనుభవించును. పరమాత్మ

అతనిచే కర్మఫలమును అనుభవింపజేయును. కాని కొందరు పరమాత్మకు కర్మఫలభోగము అసంభావితము గావున అంతఃకరణవిశిష్టుడైన జీవుడు ఇచట భోక్తగా వర్ణింపబడినట్లు తలంతురు. కాని అది సంగతము కాదు.

44 సూ — విశేషణాచ్చ (4) 1-2-12

అర్థ — విశేషణాత్ + చ = జీవాత్మ పరమాత్మలకు సంబంధించిన విశేషణములు చూపట్టుటవలనను ఈ గుహలో ప్రవేశించినవారు జీవాత్మ పరమాత్మలే.

వివ — "మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి" (కఠ- 1-2-22) "మహత్తు విభువునైన పరమాత్మను ఉపాసించి ధైర్యవంతుడైన ఉపాసకుడు దుఃఖింపడు" అని పరమాత్మను ఉపాస్యునిగను, జీవాత్మను పరమాత్మోపాసకునిగను అనేకమంత్రములయందు చెప్పియున్నందువలనను గుహలో ప్రవేశించినవారు జీవాత్మ పరమాత్మలే.

## 14 అన్తరాధికరణము 3 (6)

అక్షియందు ధ్యానింపబడు పురుషుడు పరమాత్మ.

45 సూ — అన్తర ఉపపత్తేః (1) 1-2-13

అర్థ— అన్తరః= "య ఏషోఽన్తరక్షిణి పురుషో దృశ్యతే" (ఛా- 4-15-1) "నేత్రమునందు ఏ ఈ పురుషుడు ధ్యానింపబడుచున్నాడో" అను వాక్యమునందు ధ్యానగోచరుడుగా ప్రస్తావింపబడిన పురుషుడు పరమాత్మయే. ఉపపత్తేః = ఆ ప్రకరణమున చెప్పబడిన ధర్మములు ఆ పురుషశబ్దమునకు పరమాత్మయని అర్థము చెప్పబడినపుడే ఉపపన్నము లగుటవలన.

వివ — ఛాందోగ్యమున ఉపకోసలవిద్యయందు అక్షివిద్య"

ప్రస్తావింపబడినది. దక్షిణనేత్రమునందు పురుషుని ధ్యానించుట ఈ ఉపాసనలో ప్రధానవిషయము. ఇట్లు ధ్యానింపబడు పురుషునిగూర్చి ఛాందోగ్యము ఈ విధముగా చెప్పుచున్నది. "ఏష ఆత్మేతి హోవాచ ఏతదమృత మభయమేతద్బ్రహ్మేతి" (ఛా– 4-15-1) "ఈ పురుషుడు ఆత్మ. ఇతడే అమృతము, అభయము. ఇతడు బ్రహ్మము." ఈ అమృతత్వాదికళ్యాణగుణములు పరమాత్మకు సంబంధించినవే కాని జీవునకు సంబంధించినవి కావు. కావున అక్షిపురుషుడు పరమాత్మయే అని భావము.

46 సూ — స్థానాదివ్యపదేశాచ్చ (2) 1-2-14

అర్థ — స్థానాదివ్యపదేశాత్ + చ = పరబ్రహ్మమునకు నేత్రాదులు స్థానములు, నియామ్యములు అని చెప్పబడియున్నందు వలనను ఈ అక్షిపురుషుడు పరమాత్మయే.

వివ — "యశ్చక్షుషి తిష్ఠన్, చక్షుషోఽన్తరః, యం చక్షుర్న వేద, యస్య చక్షుశ్శరీరం, యశ్చక్షురన్తరో యమయతి ఏషత ఆత్మా అన్తర్యామ్యమృతః" (బృ– 3-7-18) "ఎవడు నేత్రమున నున్నాడో, ఎవనిని నేత్రము తెలిసికొనలేకున్నదో, ఎవనికి నేత్రము శరీరమో, ఎవడు నేత్రములోపల నున్నవాడై ఆ నేత్రమును నియమించుచున్నాడో అతడు నీకు ఆత్మ. అతడు అంతర్యామి– అనగా లోపలి నుండి నియమించువాడు. అతడు మరణస్వభావము లేనివాడు" అను బృహదారణ్యకవాక్యము పరబ్రహ్మమునకు నేత్రాదులయందు స్థితి నియమనాదులను బోధించుటచే "య ఏషోఽన్తరక్షిణి పురుషోదృశ్యతే" అను ఛాందోగ్యవాక్యమున ప్రస్తుతుడైన అక్షిపురుషుడు పరమాత్మయే.

47 సూ — సుఖవిశిష్టాభిధానాదేవ చ (3) 1-2-15

అర్థ—సుఖవిశిష్ట + అభిధానాత్ + ఏవ + చ = అక్షిపురుషుడు

సుఖముతో కూడినవాడు అని చెప్పుటవలనను అతడు పరమాత్మ.

ఏవ—"ప్రాణో బ్రహ్మ, కం బ్రహ్మ, ఖం బ్రహ్మ" (ఛా-4-10-5) "ప్రాణము బ్రహ్మము, సుఖము బ్రహ్మము, ఆకాశము బ్రహ్మము" అని బ్రహ్మమును సుఖముతో కూడిన దానినిగ చెప్పియున్నందు వలన అట్టి బ్రహ్మమే అక్షివిద్యలో ఉపాసనార్థమై స్వీకరింపబడినది.

48 సూ — అత ఏవ చ స బ్రహ్మ (4) 1-2-16

అర్థ — అతః + ఏవ + చ = సుఖవిశిష్టము అని చెప్పుటవలననే, సః= "ఖం బ్రహ్మ" అనువాక్యమున "ఖ" శబ్దముచే బోధింపబడుబడు వాడు, బ్రహ్మ=పరమాత్మయే (ప్రసిద్ధాకాశముకాదు)కావుననే "యద్వావ కం తదేవ ఖం. యదేవ ఖం తదేవ కం" (ఛా- 4-10-5) ఏది "క" శబ్దవాచ్యమో అదియే "ఖ" శబ్దవాచ్యము, ఏది ఖ శబ్దవాచ్యమో అదియే క శబ్దవాచ్యము" అనువాక్యము "ఖ" శబ్దమునకు పరమాత్మ అను అర్థమును ధ్రువీకరించుచున్నది.

49 సూ — శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ (5) 1-2-17

అర్థ — శ్రుత + ఉపనిషత్క, గతి + అభిధానాత్ + చ = ఉప నిషత్తత్త్వమును తెలిసిన ఉపాసకునకు అర్చిరాదిగతిని ఉపదేశించి యుండుటవలనను ఈ అక్షిపురుషుడు పరమాత్మయే.

ఏవ — "తేஉర్చిషమభిసంభవన్తి" (ఛా- 4-15-5) "బ్రహ్మో పాసకులు అర్చిస్సున ప్రవేశింతురు" అనుటచేతను అక్షిపురుషుడు పరబ్రహ్మము కావలసియున్నది. అట్లు కాకున్నచో అక్షిపురుషోపాసకు నకు అర్చిరాదిగతి సంభవింపదుగదా!

50 సూ — అనవస్థితేరసంభవాచ్చ నేతరః (6) 1-1-18

అర్థ— అనవస్థితేః=జీవుడు నియతముగ నేత్రమునందు ఉండ

52 సూ — నచ స్మార్తమతద్ధర్మాభిలాపాచ్ఛారీరశ్చ (2) 1-2-20

అర్థ — స్మార్తం=కపిలస్మృతియందు జగత్కారణముగ చెప్ప బడిన ప్రకృతి, నచ = పై అంతర్యామి కాజాలదు. అతద్ధర్మ + అభి లాపాత్=దానికి సంబంధింపని ధర్మములను చెప్పియున్నందువలన, శారీరః + చ = ఈ కారణముచేతనే జీవుడును పై అంతర్యామి కాజాలడు.

వివ — " అదృష్టో ద్రష్టా, అశ్రుతః శ్రోతా, అమతో మన్తా అవిజ్ఞాతో విజ్ఞాతా" (బృ-3-7-23) "అతడు మనచే చూడబడడు. తాను చూడగలడు. మనకు వినబడడు, తాను వినగలడు. మనచే కనుగొన బడడు, తాను కనుగొనగలడు. మనచే తెలియబడడు. కాని తెలిసి కొనగలడు." అని అంతర్యామినిగురించి చెప్పబడియున్నది. చూచుట, వినుట, తెలిసికొనుట ఈ మొదలైన గుణములు అచేతనమైన ప్రకృతికి సంభవింపవు, జీవునకు ఇవి కొంతవరకు సంబంధించియున్నను, కన్నులు లేక చూచుట, చెవులు లేక వినుట, మొదలైన మరికొన్ని ధర్మములు ఇతనియందు అన్వయింపవు. కావున ప్రకృతి, జీవుడు అంతర్యామి కారు. అంతర్యామి పరమాత్మయే.

53 సూ — ఉభయేఽపి హి భేదేనైనమధీయతే (3) 1-2-21

అర్థ — ఉభయే + అపి = ఇరువురును అనగా మాధ్యందిన శాఖీయులు, కాణ్వశాఖీయులును, ఏనం = ఈ జీవాత్మను, భేదేన = భేదములతో (అంతర్యామికంటె భిన్నునిగా) అధీయతే హి = పఠించు చున్నారుగదా!

వివ — " యో విజ్ఞానే తిష్ఠన్ " (బృ- 3-7-22) " ఎవడు విజ్ఞా

నమున అనగా జీవునియందు ఉన్నవాడై " అని కాణ్వులును, "య ఆత్మని తిష్ఠన్...." " ఎవడు ఆత్మ యందున్నవాడై" అని మాధ్యం దినులును జీవునియందు సయితము పరమాత్మ అంతర్యామిగనున్నట్లు స్పష్టముగ చెప్పుటచే జీవుడు అంతర్యామి కాజాలడు. కావున సర్వాంతర్యామి పరమాత్మ.

ముందుసూత్రమున చివరనగల "శారీరశ్చ" అను పదములు రెండును శ్రీశంకరుల భాష్యమున ఈ సూత్రప్రారంభమున చేర్చబడినవి.

## 16. అదృశ్యత్వాదిగుణకాధికరణము 5 (3)

### అదృశ్యత్వాదిగుణములు కలవాడు పరమాత్మ

54 సూ — అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః (1) 1-2-22

అర్థ — అదృశ్యత్వాదిగుణకః = ముండకోపనిషత్తున అదృశ్య త్వాదిగుణములు కలవాడుగ వర్ణింపబడినవాడు పరమాత్మ, ధర్మ + ఉక్తేః = బ్రహ్మమునకు సంబంధించిన ధర్మములను చెప్పుటవలన.

వివ — ముండకోపనిషత్తునందు "అథ పరా యయా తదక్షర మధిగమ్యతే, యత్తదద్రేశ్యమగ్రాహ్యం" (ముం- 1-1-5) "ఇక పరా విద్య దేనిచే ఆ అక్షరతత్త్వము పొందబడుచున్నదో, అది చూడబడదగి నది కాని గ్రహింపబడతగినది కాని కాదు" అని, "యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" (ముం- 1-1-5) "ప్రపంచమునకు కారణమైన దేనిని ధీరులైన ఉపాసకులు దర్శింతురో" అనియుచెప్పబడియున్నది. ఇట్లు చూడబడని, గ్రహింపబడని తత్త్వము పరబ్రహ్మమే కాని మరి యొకటికాదు. ఏలయన తరువాతి మంత్రములలో " యస్సర్వజ్ఞ స్సర్వవిత్, యస్య జ్ఞానమయం తపః " (ముం- 1-1-9) "ఎవడు సర్వజ్ఞుడు, సర్వవేత్తయునై యున్నాడో, ఎవని తపస్సు జ్ఞానమయ మైయున్నదో " అని ప్రస్తావింపబడినది. ఈ సర్వజ్ఞత్వాది గుణములు పరబ్రహ్మమునకు సంబంధించినవే కాని జీవునకు సంబంధించినవి

కావు. కావున అద్రేశ్యత్వ, అగ్రాహ్యత్వాదిగుణములు కలవాడు పరమాత్మయే.

55 సూ— విశేషణభేదవ్యపదేశాభ్యాం చ నేతరౌ (2) 1-2-23

అర్థ— విశేషణభేదవ్యపదేశాభ్యాం చ = బ్రహ్మమునకు సంబంధించిన విశేషణములను చెప్పియుండుటవలనను, జీవప్రకృతుల కంటె భేదములను తెలిపియున్నందువలనను, ఇతరే= జీవప్రకృతులు, న = అదృశ్యత్వాదిగుణములు కలవి అని చెప్పుట తగదు.

వివ— "కస్మిన్ను భగవో విజ్ఞాతే ఇదం సర్వం విజ్ఞాతం భవతి" (ముం- 2-1-2) "భగవన్! ఎవనిని తెలిసికొనినచో ఇదియంతయు తెలియగలదు ?" అని ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞామును విశేషించి చెప్పుటచే ఈ అదృశ్యత్వాదిగుణములు కలది పరబ్రహ్మమని స్పష్టమగుచున్నది. మరియు " అక్షరాత్ పరతః పరః " (ముం- 2-1-2) " అక్షరము (ప్రకృతి) కంటె పరుడైన జీవునికంటె పరమైనవాడు " అని చెప్పుటచే జీవప్రకృతుల కంటె పరబ్రహ్మము భిన్నమైన దని స్పష్టమగుచున్నది. కావున ఈ అదృశ్యత్వాదిగుణములు కలది పరబ్రహ్మమే.

56 సూ — రూపోపన్యాసాచ్చ (3) 1-2-24

అర్థ — రూప + ఉపన్యాసాత్ + చ= ఈ అదృశ్యత్వాదిగుణములుకలవానికి విశ్వమంతయు రూపము అనిచెప్పుటవలనను అదృశ్యత్వాదిగుణకుడు పరమాత్మయే.

వివ — అదృశ్యత్వాదిగుణకుని గూర్చి చెప్పుచు "అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ, దిశః శ్రోత్రే, వాగ్వివృతాశ్చ వేదాః" (ముం- 2-1-4) "ఇతనికి అగ్ని శిరస్సు, చంద్రసూర్యులు నేత్రములు, దిక్కులు చెవులు, వేదములు వాక్కులు " అని చెప్పబడియున్నది. ఇటువంటి రూపము పరమాత్మకు మాత్రమే గదా సంభవము!

# 17 వైశ్వానరాధికరణము 6 (9)

## ఉపాస్యుడైన వైశ్వానరుడు పరమాత్మ.

57 సూ — వైశ్వానరస్సాధారణశబ్దవిశేషాత్ (1) 1-2-25

అర్థ — వైశ్వానరః = "యస్త్వేతమేవం ప్రాదేశమాత్రం మభివిమానమాత్మానం వైశ్వానరముపాస్తే " (ఛా- 5-18-2) "ఎవడు ప్రాదేశమాత్రుడు, అంతట వ్యాపించువాడు, ఆత్మ అయిన వైశ్వానరుని ఉపాసించునో " అనువాక్యమునగల "వైశ్వానర" శబ్దము పరబ్రహ్మమును బోధించుచున్నది, సాధారణ శబ్దవిశేషాత్ = అగ్నిని, జఠరాగ్నినికూడ బోధించు ఈ "వైశ్వానర" పదమునకు ఇచట పరమాత్మకు సంబంధించిన విశేషణములను ప్రయోగించియున్నందువలన.

వివ — ఛాందోగ్యమున "వైశ్వానరముపాస్వ" "వైశ్వానరుని ఉపాసింపుము" అని యున్నది. వైశ్వానరశబ్దమునకు పరమాత్మాసాధారణములైన సర్వాత్మకత్వాదివిశేషణములను ప్రయోగించియున్నందువలన ఇది పరమాత్మనే బోధించుచున్నది. అగ్నిని గాని, జఠరాగ్నిని గాని బోధించుట లేదు.

58 సూ — స్మర్యమాణమనుమానం స్యాదితి (2) 1-2-26

అర్థ — ఇతి స్మర్యమాణం = "అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ " (ముం- 1-4-6) "అగ్ని శిరస్సు, చంద్రసూర్యులు నేత్రములు" అని వర్ణింపబడిన పరమాత్మయొక్క విశ్వరూపమే ఇచటి వైశ్వానరునకు "వైశ్వానరస్యద్యౌః మూర్ధా అదిత్యశ్చక్షుః, వాయుః ప్రాణః" "వైశ్వానరునకు ద్యులోకము శిరస్సు, సూర్యుడు నేత్రము, వాయువు ప్రాణము " అని స్మరింపబడుచున్నది. ఇదియే, అనుమానం స్యాత్ =

వైశ్వానరశబ్దమునకు పరబ్రహ్మమని అర్థము చెప్పుటలో సూచకము కాగలదు. విశ్వరూపము పరమాత్మకే గదా సంభవించును!

59 సూ — శబ్దాదిభ్యోఽన్తః ప్రతిష్ఠానాచ్చ నేతిచేన్న తథా దృష్ట్యుపదేశాదసంభవాత్ పురుషమపి చైనమధీయతే (3) 1-2-27

పద — శబ్ద + ఆదిభ్యః, అన్తః ప్రతిష్ఠానాత్, చ, న, ఇతిచేత్, న, తథాదృష్టి + ఉపదేశాత్, అసంభవాత్, పురుషం, అపిచ, ఏనం, అధీయతే.

అర్థ—శబ్దాదిభ్యః=స ఏషోఽగ్నిర్వైశ్వానరః" (శతపథ బ్రాహ్మణము. 10-6-1-11) "ఈ అగ్ని వైశ్వానరుడు" అని స్పష్టముగ చెప్పియున్నందువలనను, అంతఃప్రతిష్ఠానాచ్చ = "హృదయం గార్హపత్యో మనోఽన్వాహార్య పచనః ఆస్యమాహవనీయః" "ఈ వైశ్వానరునకు హృదయము గార్హపత్యము. మనస్సు అన్వాహార్యపచనము, ఆస్యము గార్హపత్యము" అనుచు శరీరము లోపల ఇతడు త్రేతాగ్ని రూపమున నున్నట్లు చెప్పుటవలనను, నేతిచేత్ = వైశ్వానరశబ్దమునకు పరబ్రహ్మమని అర్థముకాదు, అనుచో, న=అట్లుకాదు, తథా దృష్ట్యుపదేశాత్ = జఠరాగ్నిశరీరకుడైన పరమాత్మను ఉపాసింపుమని ఉపదేశించుటవలనను, అసంభవాత్ = ఉపాస్యుడైన ఈ వైశ్వానరునకు చెప్పిన విశ్వరూపము జఠరాగ్నికి సంభవింపకపోవుటవలనను, ఇచటి వైశ్వానరశబ్దము పరబ్రహ్మమునే బోధించును. పురుషం అపిచ = "స ఏషోఽగ్నిర్వైశ్వానరఃయత్పురుషః" (శతపథబ్రా-10-6-1-11) "ఈ అగ్ని వైశ్వానరుడు. ఇతడు పురుషుడు అనుచు పురుషునిగను, ఏనం= ఈ వైశ్వానరుని" అధీయతే = పఠించుచున్నారు. "సహస్ర శీర్షా పురుషః", "పురుష ఏవేదం సర్వం" (పు.సూ.) అను శ్రుతివచనము లనుబట్టి నిరుపాధికపురుషుడు పరమాత్మయే గదా! కావున ఇచట వైశ్వానరశబ్దవాచ్యుడు పరబ్రహ్మమే!

60 సూ — అత ఏవ న దేవతా భూతం చ (4) 1-2-28

అర్థ — అత ఏవ = ఇందువలననే, దేవతా = దేవతారూపియైన అగ్ని, భూతం చ=పంచభూతములలో నొకటైన అగ్నియు, న= ఇచ్చటి వైశ్వానరశబ్దమునకు అర్థము కాదు.

61 సూ — సాక్షాదప్యవిరోధం జైమినిః (5) 1-2-29

అర్థ — జైమినిః = జైమిని మహర్షి, సాక్షాదపి = అగ్నిశబ్దము వైశ్వానరశబ్దమువలె సాక్షాత్తుగ పరమాత్మను బోధించినను, అవిరోధః= విరోధములేకుండుటను (భావించుచున్నారు)

వివ—"య ఏషోఽగ్నిర్వైశ్వానరః" అనువాక్యమునందలి అగ్ని, వైశ్వానర శబ్దములు తమ యోగశక్తిచే పరమాత్మను బోధింపవచ్చును. ఎట్లనగ "అగ్రం నయ తీతి అగ్నిః"= "ముందుకు నడిపించువాడు" "విశ్వేషాం నరాణాం నేతా వైశ్వానరః"="సకలప్రాణులకు నేత." అను వ్యుత్పత్తిచే ఈ శబ్దములు సాక్షాత్తుగానే పరమాత్మను బోధించుచున్నవని జైమిని మహర్షి తలంచుచున్నారు.

62 సూ — అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః (6) 1-2-30

అర్థ — అభివ్యక్తేః = బ్రహ్మము అపరిచ్ఛిన్నమైనదైనను ఉపాసనాసౌకర్యముకొఱకు పరిచ్ఛిన్నముగ అభివ్యక్తమగుటవలన వైశ్వానరాది శబ్దములు పరబ్రహ్మమును [illegible]ంపవచ్చును. ఇతి [illegible] అని, ఆశ్మరథ్యః = ఆశ్మరథ్యులను [illegible] తలంచుచున్నారు.

వివ— "యస్త్వేతమేవం ప్రాదేశమా[illegible] [illegible] మాన [illegible] నం వైశ్వానరం" (ఛా- 5-18-1) అను వాక్య[illegible] = [illegible] అపరిచ్ఛిన్నుడైనను ఉపాసనాసౌకర్యము[illegible] [illegible]ంపబడు నని బోధించుచున్నది గదా!

సుతేజాః" (ఛా- 5-18-2) "ఉపాసకుని శిరస్సే వైశ్వానరునకు ప్రకాశమానమైన శిరస్సు" అని చెప్పుటచే ఉపాసకుడు తన శరీరము నందు పరబ్రహ్మము ఈరీతిగ వ్యాపించియుండునని భావించి, ధ్యానింప వలయును అని తెలియజేయుచున్నది. కావున ఉపనిషత్తులలో ఉపాస్యముగ ఉపదేశింపబడిన వైశ్వానరుడు పరబ్రహ్మమే అని భావము.

ప్రథమాధ్యాయ ద్వితీయపాదము సమాప్తము.

ప్రథమాధ్యాయ ద్వితీయపాదార్థ సంగ్రహ శ్లోకము

శ్లో॥ స్వాధీనాఽశేషసత్తాస్థితియతనతయా సర్వభావేన తిష్ఠన్
గ్రస్తాశేషోఽక్షినిత్యస్థితిరఖిలతనుః కల్పితాఽగ్న్యాదిగాత్రః।
స్వర్లోకాద్యంగవైశ్వానరవపురపి యో లక్షణస్యాదిమస్య
ప్రోక్తః పాదే ద్వితీయే శ్రుతినికరశిరశ్శేఖరశ్శ్రీనివాసః ॥

తా — ఈ పాదమునందు సర్వత్రప్రసిద్ధోపదేశాధికరణమున చేతనాచేతనముల సత్తాస్థితిప్రయత్నాదులు పరమాత్మాధీనము లగుటచే అతడు "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని చేతనాచేతనము లతో అభిన్నముగ వ్యవహరింపబడుటను, అత్త్రధికరణమున జగ ద్భోక్తృత్వమును, అంతరాధికరణమున నేత్రాన్తర్వర్తిత్వమును, అంత ర్యామ్యధిదేవాధికరణమున, చేతనాచేతనశరీరకత్వమును అదృశ్యత్వాది గుణకాధికరణమున అగ్నిచంద్రసూర్యాదులను అవయవములనుగా కలిగియుండుటను, వైశ్వానరాధికరణమున సకలజగన్నియామకత్వ, ద్యులోకశిరస్కత్వాదికమును వివరించినారు. ఇవి భగవంతుని కళ్యాణ గుణములు.

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# ప్రథమాధ్యాయ తృతీయపాదము

## స్పష్టజీవాది లింగకపాదము

## 18 ద్యుభ్వాద్యధికరణము 1 (6)

### ద్యులోకభూలోకాదులకు ఆధారము పరమాత్మ.

66 సూ — ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్ (1) 1-3-1

అర్థ — ద్యు + భూ + ఆది + ఆయతనం=ద్యులోక, భూలోకాదులకు ఆధారముగ పేర్కొనబడినది పరబ్రహ్మము. స్వశబ్దాత్ = "ఆత్మ అనియు", " అమృతమునకు సేతు" వనియు అది అసాధారణ శబ్దములచే పేర్కొనబడుటవలన.

వివ — " యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతం మన స్సహ ప్రాణైశ్చ సర్వైః తమేవైకం జానథాత్మానమన్యా వాచో విముంచథ, అమృతస్యైష సేతుః" (ముం-2-2-15) " ఎవనియందు ద్యులోకము, పృథివి, అన్తరిక్షము మనస్సు, ప్రాణములు కలిసిమెలసి యున్నవో ఆ ఆత్మను ఒక దానిని మాత్రమే తెలిసికొనుడు. తక్కిన మాటలను వదిలిపెట్టుడు. ఇతడు అమృతమునకు సేతువు. " అని ముండకోపనిషత్తున చెప్పబడియున్నది. ఇచట ద్యులోకభూలోకాదులకు ఆధారముగ వర్ణింపబడినవాడు పరమాత్మ. కావుననే అది ఆత్మయని, అమృతమునకు సేతువని చెప్పబడినది. ఈ రెండు ధర్మములు పరమాత్మకు సంబంధించినవే కదా!

67 — ముక్తోపసృప్యవ్యపదేశాచ్చ (2) 1-3-2

అర్థ — ముక్త + ఉపసృప్యవ్యపదేశాత్ + చ = సంసార

విముక్తులచే పొందతగినదిగ చెప్పుటవలనను ద్యులోకభూలోకాదులకు ఆధారమైనది పరమాత్మయే.

వివ — "యథానద్యః స్యందమానాస్సముద్రే, అస్తంగచ్ఛన్తి నామరూపే విహాయ। తథా, విద్వాన్ నామరూపాద్విముక్తః, పరాత్పరం పురుషముపైతిదివ్యమ్॥" (ముం-3-2-8) "నదులు ప్రవహించుచు వెళ్ళి, నామరూపములను వదలి, సముద్రమున ఎట్లు విలీనములగుచున్నవో, అట్లే ముక్తపురుషుడును నామరూపవిరహితుడై పరాత్పరుడు, దివ్యుడు అయిన పురుషుని చేరును" అని చెప్పుటచే ముక్తపురుష ప్రాప్యుడైన పరమాత్మయే ద్యులోకభూలోకదులకు ఆధారముగ ఇచట పేర్కొనబడినాడు.

68 సూ — నానుమానమతచ్ఛబ్దాత్ప్రాణభృచ్చ (3) 1-3-3

అర్థ — అతత్ + శబ్దాత్ = ఆ ప్రకృతిని బోధించు శబ్దము లేనందువలన, అనుమానం = ప్రకృతి, న = ద్యులోకభూలోకాదులకు ఆధారము కాజాలదు. ప్రాణభృత్ + చ = జీవుడును, న = అతనిని బోధించు శబ్దము లేనందువలన ద్యులోకభూలోకాదులకు ఆధారము కాజాలడు.

శ్రీశంకరులభాష్యమున "నానుమానమతచ్ఛబ్దాత్", "ప్రాణభృచ్చ" అను పై సూత్రభాగములు రెండును వేర్వేరు సూత్రములుగ స్వీకరింపబడినవి.

69 సూ — భేదవ్యపదేశాత్ (4) 1-3-4

అర్థ — భేదవ్యపదేశాత్ = జీవునకు, ద్యులోకాద్యాధారమైన వానికిని భేదమును స్పష్టముగ చెప్పియున్నందువలనను జీవుడు ద్యులోకాద్యాధారము కాడు.

వివ — "సమానే వృక్షే పురుషో నిమగ్నః, అనీశయా శోచతి ముహ్యమానః। జుష్టం యదా పశ్యత్యన్యమీశం, అస్య మహిమాన

మితి వీతశోకః॥ ” (ముం- 3-2-9) “ ఒకే వృక్షమున నిమగ్నుడై అస్వతంత్రుడై మోహమును పొందుచున్న పురుషుడు (జీవుడు) తనతో కూడియుండి, తనకంటె వేరైన ఈశ్వరుని ఎపుడు దర్శించునో అపుడు అతని మహిమలను పొంది దుఃఖరహితుడగును” అని చెప్పియున్నందు వలన ద్యులోకాదులకు ఆధారమైనవాడు జీవునికంటె భిన్నుడు అని స్పష్టమగుచున్నది.

70 సూ — ప్రకరణాత్ (5) 1-3-5

అర్థ -- ఈ ప్రకరణమునుబట్టియు ద్యులోకాదులకు ఆధారమైన వాడు పరమాత్మ.

వివ -- “ అథ పరా యయా తదక్షరమధిగమ్యతే ” అనుచు పరబ్రహ్మమునుగూర్చి ప్రారంభించిన ప్రకరణమున పఠింపబడుటచే ద్యులోకాదులకు ఆధారముగ పేర్కొనబడినవాడు పరమాత్మ అని భావము.

71 సూ — స్థిత్యదనాభ్యాం చ (6) 1-3-6

అర్థ — స్థితి + అదనాభ్యాం + చ = “ ద్వా సువర్ణా సయుజా సఖాయా ” (ముం- 2-3-1) అను మంత్రమున జీవేశ్వరులు ఒకే వృక్షమున కలిసియున్నట్లును అందొక్కడు మాత్రమే కర్మ ఫలమును అనుభవించుచున్నట్లు చెప్పుటవలనను ద్యులోకాదులకు ఆధారమైనవాడు జీవునికంటె భిన్నుడు అని స్పష్టమగుచున్నది.

## 19 భూమాధికరణము 2 (2)

భూమము పరమాత్మ.

72 సూ — భూమా సంప్రసాదాదధ్యుపదేశాత్ (1) 1-3-7

అర్థ— భూమా = ఛాందోగ్యమున “భూమా” అని పేర్కొనబడినది పరబ్రహ్మమే. సంప్రసాదాత్=జీవునికంటెను, అధ్యుపదేశాత్=అధికుడుగ ఉపదేశింపబడినందువలన.

వివ — “ యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్వి

జానాతి సభూమా యత్ర అన్యత్పశ్యతి అన్యచ్ఛృణోతి అన్యద్విజానాతి తదల్పమ్" (ఛా-7-23-24) "ఎచట మరియొకదాని చూడడో, వినడో, నితెలిసికొనడో అట్టిది భూమ అనగా అతి విస్తృతమైనది. ఎచట మరి యొకదానిని చూచునో, వినునో, తెలిసికొనునో అట్టిది అల్పము." ఇచట నిరతిశయసుఖస్వరూపమైన భూమ పరమాత్మ. "సుఖం త్వేవ విజిజ్ఞాసి తవ్యమ్"(ఛా-7-22) "భూమైవ సుఖమ్" (ఛా- 7-23) అనుచు ఈ భూమతత్త్వము ఉపాస్యముగ నిర్దేశింపబడినది. "ఏష తు వా అతి వదతి యస్సత్యేన అతివదతి" (ఛా- 7-16-1) "ప్రాణముకంటె అధిక ముగ సత్యమును చెప్పుచుందురు అను వాక్యమున సత్యశబ్దము పర బ్రహ్మమును బోధించుచున్నది. ప్రాణశబ్దము జీవుని తెలియజేయు చున్నది. ప్రాణశబ్దవాచ్యమైన జీవునికంటె సత్యశబ్దవాచ్యమైన పర బ్రహ్మము భూమము, ఉపాసనీయము నగుచున్నదని భావము.

73 సూ — ధర్మోపపత్తేశ్చ (2) 1-3-8

అర్థ — ధర్మ + ఉపపత్తేః + చ = ఈ ప్రకరణమున చెప్ప బడిన అనన్యాధారత్వాది ధర్మములు పరబ్రహ్మమునందే ఉపపన్నము లగుటవలన అనన్యాధారత్వాది గుణవిశిష్టమైన భూమ పరబ్రహ్మము.

వివ— "స్వేమహిమ్ని ప్రతిష్ఠితః"(ఛా-7-6-6) "తన మహిమ యందే ప్రతిష్ఠితుడై యుండును." అనుటచే తనకు మరియొక ఆధారము లేకుండునది అనన్యాధారమైనది పరబ్రహ్మమే కదా. కావున అదియే భూమము.

## 20. అక్షరాధికరణము 3 (3)

### ఆకాశాదులనుధరించు అక్షరము పరమాత్మ.

74 సూ — అక్షరమమ్బరాన్తధృతేః. (1) 1-3-9.

అర్థ— అక్షరం="ఏతద్వై తదక్షరం గార్గి" (బృ-3-[illegible]) అను బృహదారణ్యకవాక్యమున గల అక్షరశబ్దము పరమాత్మను బోధించు

చున్నది. అమ్బర + అన్తధృతేః = ఆ అక్షర శబ్దవాచ్యమైన తత్త్వము ఆకాశమువరకుగల వస్తువులనుధరించుచున్నట్లు చెప్పుటవలన

వివ -- "కస్మిన్ను ఖలు ఆకాశః ఓతశ్చ ప్రోతశ్చేతి, సహోవాచ ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి అస్థూలమనణు అహ్రస్వ మదీర్ఘమ్" (బృ- 5-8.7) గార్గి ప్రశ్న- "ఆకాశము దేనియందు ఊతప్రోతముగ (పడుగుపేకలుగ) కలసియున్నది?" యాజ్ఞవల్క్యుని సమాధానము- "గార్గి! ఆకాశమునకు ఆధారము ఆ అక్షరమే అని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు. ఆ అక్షరతత్త్వము స్థూలము కాదు, అణువు కాదు. హ్రస్వముకాదు, దీర్ఘము కాదు." అని చెప్పబడిన ఆకాశాద్యాధారమైన అక్షరము పరబ్రహ్మము. ఆకాశము వరకు గల వస్తువులను ధరింపగల్గినది పరబ్రహ్మము తప్ప వేరొకటి లేదు కదా!

75 సూ -- సా చ ప్రశాసనాత్ (2) 1-3-10

అర్థ — సాచ=ఆ ధరించుటయు, ప్రశాసనాత్=శాసించుటవలన.

వివ — "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసే విధృతేతిష్ఠతః" (బృ-3-8-9) "గార్గి! ఈ అక్షరతత్త్వముయొక్క ఆదేశమునను సరించి సూర్యచంద్రులు ధరింపబడియున్నారు." అని చెప్పుటచే ఈ అక్షరబ్రహ్మము తనశాసనము ద్వారా ఈ జగత్తును ధరించుచు, నడిపించుచున్న దని తెలియుచున్నది.

76 సూ — అన్యభావవ్యావృత్తేశ్చ (3) 1-3-11

అర్థ — అన్యభావవ్యావృత్తేః + చ= జీవప్రకృతులకు వేరుగ చెప్పుటవలనను ఇచటి అక్షరశబ్దమునకు పరబ్రహ్మమనియే అర్థము. ప్రకృతి అని గాని, జీవుడు అనిగాని కాదు.

వివ— "తద్వై తదక్షరం గార్గి అదృష్టం ద్రష్టృ" (బృ-3-8-11)

"గార్గి! ఈ అక్షరతత్త్వము ఇతరులచే చూడబడదు, తాను చూచును."
అనుటచే ఇది అచేతనమైన ప్రకృతికంటెను భిన్న మని తెలియు
చున్నది. "నాన్యదతోఽస్తి ద్రష్టృ" (బృ–3–8–11) "దీనికి మించిన
వేరొక ద్రష్టలేడు" అనుటచే జీవుడును అక్షరశబ్దవాచ్యుడు కాడు.
జీవుడు ద్రష్ట యైనను సర్వద్రష్ట కాలేడు కదా. కావున ఇచటి అక్షర
శబ్దమునకు పరబ్రహ్మ మనియే అర్థము.

## 21 ఈక్షతి కర్మాధికరణము 4

ఉపాసకునిచే దర్శింపబడు పరమపురుషుడు పరమాత్మ.

77 సూ — ఈక్షతికర్మ వ్యపదేశాత్సః 1–3–12

అర్థ — ఈక్షతికర్మ = "పరాత్పరం పురిశయం పురుషమీక్షతే
(ప్రశ్న – 5–2–5) "పరాత్పరుడు హృదయగుహలో నుండువాడు
నైన పురుషుని దర్శించును" అనుచు దర్శనమునకు కర్మగా ప్రస్తు
తింపబడినవాడు, సః = ఆ పరమాత్మ, వ్యపదేశాత్ = పరమాత్మకు
సంబంధించిన ధర్మములను అచట పేర్కొనియున్నందువలన.

వివ — "యః పునరేతం త్రిమాత్రేణౌమిత్యేతేనైవాక్షరేణ
పరమపురుషభిధ్యాయీత" (ప్రశ్న– 5–2–2) "ఎవడు ఈ పరమ
పురుషుని త్రిమాత్మకమైన "ఓమ్" అను అక్షరముతో ధ్యానమొన
ర్చునో" అని ప్రారంభించి "స ఏతస్మాత్ జీవఘనాత్ పరాత్పరం
పురిశయం పురుషమీక్షతే" (ప్రశ్న– 5–2–5) "ఇట్లు ధ్యానించిన
వాడు జీవతత్త్వముకంటె శ్రేష్ఠుడై, హృదయగుహలో నున్న పురుషుని
దర్శించును" అను సందర్భమున ఉపాసకునిచే దర్శింపబడునట్లు
చెప్పబడిన పరమపురుషుడు పరమాత్మయే. "తమోంకారేణైవాయ
నేనాన్వేతి విద్వాన్ తచ్ఛాన్తమజరమభయమమృతం పరంచ"
(ప్రశ్న– 5–7) "ప్రణవముద్వారా ఉపాసకుడు శాన్తము, జరామరణ

భయరహితము, ఉత్తమము అయిన ఆ పురుషుని చేరును " అనుచు పరమాత్మ సాధారణములైన అజరత్వ - అమృతత్వాది ధర్మములను అచట పేర్కొనియున్నాడు గదా!

## 22. దహరాధికరణము 5 (10)

### దహరాకాశము పరమాత్మ.

78 సూ — దహర ఉత్తరేభ్యః (1) 1-3-13

అర్థ— దహరః= ఛాందోగ్యమునందు దహరశబ్దముచే పేర్కొనబడినది పరబ్రహ్మము. ఉత్తరేభ్యః = తరువాతి వాక్యములవలన

వివ — " అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్ అంతర ఆకాశః తస్మిన్ యదన్తః తదన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యమ్ " (ఛా- 8-1-1) " ఈ బ్రహ్మపురమునందు (బ్రహ్మమునకు స్థానమైన శరీరమునందు) చిన్ని పుండరీకము వంటి స్థానముకలదు. అందుగల దహరాకాశమును అన్వేషించి తెలిసికొనవలయును"అని ఛాందోగ్యవాక్యమున హృదయపుండరీకమునందు తెలిసికొనదగినదిగా వర్ణింపబడిన దహరాకాశము పరబ్రహ్మమే కాని భూతాకాశము కాదు. " ఏష ఆత్మా అపహత పాప్మా విజరోవిమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసస్సత్యకామస్సత్యసంకల్పః'' (ఛా-8-1-5) " ఈ ఉపాస్యమైనది, పాపరహితమై, జరామృత్యుశోకవిరహితమై, బుభుక్షాపిపాసలు లేనిదై సత్యకామము సత్యసంకల్పమునైన ఆత్మ " అనితరువాతివాక్యములలో దహరాకాశముఅపహతపాప్మత్వాది కళ్యాణగుణములుగలదిగా వర్ణింపబడినది. ఈ గుణములు సర్వథా పరమాత్మయందేసంభావ్యములు. కావున ఇచట విజ్ఞేయముగా పేర్కొనబడిన దహరము పరమాత్మయే అని భావము.

79సూ— గతిశబ్దాభ్యాం తథా హి దృష్టం లింగం చ (2) 1-3-14

అర్థ — గతిశబ్దాభ్యాం = సుషుప్తిసమయమున సకలప్రాణులు దహరమును చేరుటవలనను ఈదహరాకాశమును "బ్రహ్మలోక"శబ్దముచే పేర్కొనుటవలనను దహరాకాశము పరబ్రహ్మము. తథా హి దృష్టం= ఇతరఉపనిషత్తులయందును అట్లేకదా చెప్పబడియున్నది. లిఙ్గఞ్చ = ప్రజలు ప్రతినిత్యము దహరమును చేరుచుండుట దానిని "బ్రహ్మలోక" శబ్దముతో పేర్కొనుటయుదహరాకాశము పరబ్రహ్మమనుటకు సాధకము.

వివ — "ఇమాస్సర్వాః ప్రజాః అహరహర్గచ్ఛన్త్యః ఏతం బ్రహ్మలోకం న విన్దన్తి" (ఛా– 8-3-2) "ప్రాణులన్నియు ప్రతి దినము వెళ్లుచున్నను ఈ బ్రహ్మలోకమును తెలిసికొనలేకున్నవి" అనుటచే ఈ దహరాకాశము పరబ్రహ్మమని తెలియుచున్నది. సుషుప్తి యందు ప్రాణులు పరబ్రహ్మమునే గదా చేరుచుందురు. "ఏవమేవ ఖలు సోమ్యేమాస్సర్వాః సతి సమ్పద్య న విదుః సతి సమ్పద్యామహే" (ఛా–6-9-2) "ఓ సౌమ్యుడా! ఈ విధముగ ఈ ప్రజలందరు సచ్ఛబ్దవాచ్యుడైన పరమాత్మను సుషుప్తిదశయందు ప్రతినిత్యము చేరుచున్నను ఆ విషయమును తెలియజాలరు." "బ్రహ్మలోకము" అనగా "దర్శింపబడు బ్రహ్మము" అని అర్థము. లోక్యతే ఇతి లోకః, బ్రహ్మైవ లోకః బ్రహ్మలోకః అని సమాసము. బ్రహ్మలోక శబ్దము పరమాత్మవాచకముగ "ఏష బ్రహ్మలోకః సమ్రాడితి హోవాచ" (బృ– 6-3-33) "ఈ బ్రహ్మలోకము సమ్రాట్టు అని పల్కెను" అను బృహదారణ్యకవాక్యమున చూపట్టుచున్నది గదా. కావున ఇచట దహరాకాశ శబ్దము పరమాత్మను బోధించుచున్నది అని భావము.

30 సూ— ధృతేశ్చ మహిమ్నోఽస్యాస్మిన్నుపలబ్ధేః (శ్రీ)1-3-15

అర్థ — అస్య = ఈ పరబ్రహ్మముయొక్క, ధృతేః = జగత్తును

ధరించుట అను, మహిమ్నః = మహమను, అస్మిన్= ఈ దహరాకాశము నందు, ఉపలబ్ధేశ్చ=చూపట్టుటవలనను ఈ దహరాకాశము పరబ్రహ్మము

వివ — "అథ య ఆత్మా స సేతుః విధృతిరేషాం లోకానాం అసంభేదాయ" (ఛా- 8-4-1) "దహరాకాశరూపమైన ఈ పరమాత్మ ఈ లోకములు సంకీర్ణములు కాకుండునట్లు సేతువై ధరించును" అనుటచే ఇట్టి మహిమ గల దహరాకాశము పరబ్రహ్మము.

81. సూ — ప్రసిద్ధేశ్చ (4) 1-3-16

అర్థ — ప్రసిద్ధేః + చ = ఆకాశశబ్దముచే బ్రహ్మమును బోధించునట్టి ప్రసిద్ధివలనను దహరాకాశము పరబ్రహ్మము.

వివ—"యదేష ఆకాశ ఆనన్దో నస్యాత్"(తై.బ్రహ్మవల్లి-6) "ఈ ఆనందరూపమైన ఆకాశము లేనిచో ఏవడు జీవించును?" మున్నగు వాక్యములలోని ఆకాశశబ్దముసైతము పరబ్రహ్మను బోధించుటప్రసిద్ధమే కదా!

82సూ— ఇతరపరామర్శాత్ స ఇతిచేన్నాసంభవాత్ (5)1-3-17

అర్థ— ఇతర పరామర్శాత్ = పరబ్రహ్మముకంటె వేరైన జీవుని ప్రస్తావించుటవలన, స. ఇతిచేత్ = ఆ జీవుడే దహరశబ్దమునకు అర్థమనినచో, న = అట్లు కాదు, అసంభవాత్ = జీవునియందు అపహతపాప్మత్వాది కళ్యాణగుణములు సంభవింపనందువలన.

వివ — "స ఏష సంప్రసాదోఽస్మాత్ శరీరాత్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే"(ఛా-8-3-4) "ఈ జీవుడు ఈ శరీరమునుండి బయలువెడలి, పరంజ్యోతిని చేరి, తనరూపముతో ప్రకాశించును" అనుచు ఈ ప్రకరణమున జీవుని ప్రస్తావనయు ఉన్నందునవలన దహరశబ్దమునకు జీవుడుఅర్థమనిచెప్పరాదు. పూర్వము

పేర్కొనబడినఅపహత పాప్మత్వాదిగుణములు ఇతనియందు సంభవిం పవుగదా! కావున ఈ దహరశబ్దమునకు పరబ్రహ్మమనియే అర్థము.

83 సూ — ఉత్తరాచ్చేదావిర్భూతస్వరూపస్తు (6) 1-3-18

అర్థ — ఉత్తరాత్ + చేత్ = తరువాత వచ్చు వాక్యముల వలన జీవునియందుండు అపహతపాప్మత్వాదికళ్యాణగుణములు కల వని తెలియుటచే అట్టి గుణములుగల దహరాకాశము జీవుడు కావచ్చును అన్నచో, ఆవిర్భూతస్వరూపః + తు = అచటి ముక్తి దశయందు జీవుడు అపహతపాప్మత్వాదిగుణములును కలిగియున్నట్లు ప్రస్తుతింప బడినాడు. కావున ఈ దహరశబ్దము జీవవాచకము కాదు.

వివ— "ఏష ఆత్మా అపహత పాప్మా" (ఛా-8-1-3) "ఈ ఆత్మ పరంజ్యోతిని చేరిన ముక్తజీవుడు, పాపము లేనివాడు" అనుటచే, సంసారిజీవుని యందు ఈ గుణములు చూపట్టవు గదా! కావున దహరా కాశశబ్దము జీవుని బోధించదు. పరమాత్మనే బోధించును.

84 సూ — అన్యార్థశ్చ పరామర్శః (7) 1-3-19

అర్థ—పరామర్శః+చ, దహరవిద్యలో జీవుని ప్రస్తావించుటయు= అన్యార్థ = జీవుడు దహరాకాశమును చేరి తన వాస్తవరూపమును పొందునని తెలుపుటకై చేయబడినది.

85 సూ — అల్పశ్రుతేరితిచేత్తదుక్తమ్ (8) 1-3-20

అర్థ — అల్పశ్రుతేః + ఇతిచేత్= దహరశబ్దముచే సూక్ష్మత్వము చెప్పబడుచున్నది. కావున "దహరము, పరబ్రహ్మము కాదు అనినచో, తత్ + ఉక్తం = దీనికి సమాధానము ముందే చెప్పబడినది.

వివ — "అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతిచేన్న నిచాయ్య త్వాదేవం వ్యోమవచ్చ" (బ్ర.సూ. 1-2-7) "ధ్యానసౌకర్యముకొరకు

హృదయము పరమాత్మకు స్థానముగ చెప్పబడినది. వాస్తవమున పరమాత్మ ఆకాశమువలె అంతట వ్యాపించియుండును అని ముందే చెప్పబడియున్నందువలన దహరశబ్దము పరమాత్మను బోధించుటలో విప్రతిపత్తి లేదు.

86 సూ — అనుకృతేస్తస్య చ (9) 1-3-21

అర్థ — తస్య = పరమాత్మను, అనుకృతేః + చ = జీవుడు అనుసరించుటవలనను దహరశబ్దము జీవవాచకము కాదు.

వివ — "యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం, కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిమ్ । తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ, నిరంజనః పరమం సామ్యముపైతి ॥" (ము- 3-1-3) "ఈ ఉపాసకుడు స్వర్ణ వర్ణుడు, కర్త, ఈశ్వరుడు, జగత్కారణము అయిన పరమాత్మను సాక్షాత్కరించునో అపుడు ఇతడు పుణ్యపాపములను తొలగించుకొని, శరీర సంబంధము లేనివాడై పరమాత్మతో పరమసామ్యమును పొందు చున్నాడు" అను మంత్రమునుబట్టి పరమాత్మ అనుకార్యుడుగా, జీవుడు అనుకరించువాడుగ చెప్పుటవలన పరమాత్మకంటె భిన్నుడైన జీవుని ఈ దహరశబ్దము బోధింపజాలదు.

87 సూ — అపి స్మర్యతే (10) 1-3-22

అర్థ — స్మర్యతే+అపి= జీవుడు పరబ్రహ్మముతో సామ్యమును పొందునని స్మృతియందును చెప్పబడుచున్నది.

వివ — "ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః । సర్గేపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ॥ (భ. గీ. 14-2) "ఈ జ్ఞానమును పొంది నాయొక్క సామ్యమును పొందినవారు సృష్టి సమయమున జన్మింపరు. ప్రళయ సమయమున నశింపరు," కావున దహరశబ్దము పరమాత్మయే.

## 23 ప్రమితాధికరణము 6 (2)

### ఉపాసకుల హృదయమునందు అంగుష్ఠపరిమితుడై యున్న వాడు పరమాత్మ.

88 సూ — శబ్దాదేవ ప్రమితః (1) 1-3-23

అర్థ—శబ్దాత్ ఏవః= "ఈశానో భూతభవ్యస్య" (కఠ-2-4-12) "త్రికాలవర్తిపదార్థములకును ఈశ్వరుడు" అను శ్రుతివలన, ప్రమితః= అంగుష్ఠమాత్రుడుగ కొలువబడినవాడు పరమాత్మ.

వివ— "అంగుష్ఠమాత్రః పురుషః మధ్య ఆత్మని తిష్ఠతి । ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః" (కఠ- 2-4-12) "హృదయ మధ్యమునందు అంగుష్ఠమాత్రుడైన పురుషుడు కలడు. అతడు త్రికాలవర్తిపదార్థములకును ఈశ్వరుడు. అతడే నేడు, రేపు అనగా సర్వ కాలములందు ఉండు నని భావము. ఈ మంత్రమున అంగుష్ఠమాత్రుడుగ చెప్పబడిన పురుషుడు జీవుడే కావలయును అని పూర్వపక్షము. కాని "ఈశానో భూతభవ్యస్య" అను తరువాతి వాక్యమునుబట్టి ఈ అంగుష్ఠపరిమాత్రపురుషుడు పరబ్రహ్మమే అని సిద్ధాంతము.

89 సూ—హృద్యపేక్షయా తు మనుష్యాధికారకత్వాత్ (2) 1-3-24

అర్థ — హృది = హృదయమునందు, అపేక్షయా తు = దాని వైశాల్యమునుబట్టి అందు ధ్యానింపదగిన పరమాత్మ అంగుష్ఠపరిమితుడని చెప్పబడినది. మనుష్య + అధికారత్వాత్=ఉపాసనము మనుష్యులను ఉద్దేశించి ప్రవర్తించుటవలన.

వివ — ఉపాసన చేయు మానవుల హృదయముయొక్క లోపలిభాగము అంగుష్ఠపరిమితమై యుండును. అందుచే అందు ధ్యానింపబడు పరమాత్మయు అంగుష్ఠమాత్రుడని "అంగుష్ఠమాత్రః పురుషః" అనుమంత్రమున వర్ణింపబడినాడు. మానవుల హృదయా

కాలపరిమాణమునే ఏల తీసికొనవలయును. అనినచో ముఖ్యముగ వారి నుద్దేశించియేగదా వేదాన్తశాస్త్రము ప్రవర్తించుచున్నది. కావున వారి హృదయాన్తః పరిమాణమునుబట్టి అంగుష్ఠమాత్రుడుగ పరమాత్మ వర్ణింపబడుట దోషముకాదు.

## 24. దేవతాధికరణము 7 (5)

### దేవతలకును బ్రహ్మోపాసనాధికారముగలదు.

90 సూ — తదుపర్యపి బాదరాయణస్సంభవాత్ (1) 1-3-25

అర్థ — తత్ + ఉపరి + అపి = ఆ పైనకూడ అనగా మనుష్యులకే కాక వారిపై నుండు దేవతలకును ఉపాసనచేయుటకు అధికారముగలదని, బాదరాయణః = బాదరాయణమహర్షి తలంచు చున్నారు. సంభవాత్ = వారికిని ఉపాసనకు తగిన శరీరము, బ్రహ్మ మును దర్శింపవలె నను కోరిక మొదలగునవి సంభవించుటవలన.

91 సూ — విరోధః కర్మణీతిచేన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్ (2) 1-3-26

అర్థ — కర్మణి = యజ్ఞయాగాది కర్మలో, విరోధః + ఇతి చేత్ = దేవతలకు శరీరమును అంగీకరించుపక్షమున విరోధము కల్గును గదా! అనుచో, న = అట్లు గాదు. అనేకప్రతిపత్తేః = యోగమహిమచే అనేక శరీరములను దాల్చుటకు, దర్శనాత్ = చూచుచుండుటవలన.

వివ — బ్రహ్మోపాసనకొరకు మానవులకువలె దేవతలకును శరీరముగలదని అంగీకరించుపక్షమున ఏకకాలమున అనేకప్రదేశముల యందు అనేకులుచేయు యజ్ఞయాగాదులలో ఇంద్రాదిదేవతలు ఎట్లు ఉపస్థితు లగుదురు? కావున దేవతలకు శరీరముగలదనుట యుక్తము కాదు. కావుననే వారికి ఉపాసనమునందును అధికారము లేదు అని పూర్వపక్షము. కాని యోగశక్తిచే సౌభరి మొదలైనవారు ఏకకాలమున

ననే అనేక శరీరములను దాల్చినట్లు తెలియుచున్నది. కావున దేవత లకు శరీర మున్నను ఏకకాలమున అనేక శరీరములను దాల్చి, అనేక యజ్ఞయాగాదులయందు ఉపస్థితులై, వారు హవ్యములను స్వీకరింప గలరు. కావున దేవతలకును బ్రహ్మవిద్యాధికారము గలదని బాద రాయణమహర్షి సిద్ధాంతము. ఏకకాలమున అనేక శరీరములను దాల్చు టను కాయవ్యూహ మని అందురు. ఇది యోగమహిమచే లభించును.

92సూ — శబ్ద ఇతి చేన్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యామ్ (3) 1-3-27

అర్థ — శబ్దే = ఇంద్రాదిశబ్దములయందువిరోధము కల్గును, ఇతిచేత్ = అనినచో, న = అట్లు కాదు, ప్రత్యక్ష + అనుమానాభ్యాం= ప్రత్యక్షమునుబట్టియు, అనుమానమునుబట్టియు, అనగా శ్రుతినిబట్టియు స్మృతినిబట్టియు, అతఃప్రభవాత్ = ఇంద్రాదిదేవతలు సృష్టింపబడు చున్నట్లు తెలియుటవలన.

వివ — బ్రహ్మోపాసనముకొఱకు ఇంద్రాదిదేవతలకు శరీరము ఉన్నట్లు అంగీకరించు పక్షమున ఆ శరీరములు ఉత్పత్తివినాశనము లను కలిగియుండవలయును. అపుడు ఇంద్రాదిశబ్దములు ఇంద్రాది దేవతలను నిత్యముగ చెప్పజాలవు గదా. కావున దేవతలకు శరీరము లుండవు అని పూర్వమీమాంసకుని ఆశయము. కాని, ఇది యుక్తము కాదు. ఇంద్రాదిదేవతలనుబట్టి ఇంద్రాదిశబ్దములు ఏర్పడలేదు. వేదము నందలి ఇంద్రాదిశబ్దములనుబట్టియే ఇంద్రాదిదేవతలు సృజింపబడిరి. ఈ విషయమును వేదము "ధాతా యథాపూర్వమకల్పయత్" (పు సూ. 16) "ధాత పూర్వకల్పమునందు వలెనే ఈ కల్పమునందును సూర్యచంద్రాదులను సృజించెను" అనియు "స భూరితి వ్యాహ రత్, స భూమి మసృజత" (తై– అష్ట– 2 ప్ర–2)" ఆ బ్రహ్మ భూః అని ఉచ్చరించెను, భూమినిస ృజించెను"అనియుచెప్పుటచే ఇంద్రాది

వైదికశబ్దములనుబట్టి ప్రస్తుతకల్పమున ఇంద్రాదులు సృజింపబడి నట్లు తెలియుచున్నది. ఇట్లే

శ్లో॥ సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథక్ పృథక్ ।
వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చ నిర్మమే ॥
(మను. స్మృ 1-21)

"ఆ బ్రహ్మ అన్నింటియొక్కనామధేయములను, కార్యములను, రూప సన్నివేశములను వేరువేరుగ వేదములయందలి శబ్దములనుబట్టియే తొలుత సృజించెను" అని స్మృతియు చెప్పుచున్నది. కావున ఇంద్రాది శబ్దములు పదవులనుబట్టి వచ్చినవి కాని, వ్యక్తులనుబట్టి వచ్చినవి కావని స్పష్టమగుచున్నది. కావున దేవతలకును శరీరము కలదు.

93 — అత ఏవ చ నిత్యత్వమ్ (4) 1-3-28

అర్థ — అత ఏవ = ఈ కారణమువలననే, నిత్యత్వం చ = వేదములకు నిత్యత్వమును సిద్ధించుచున్నది.

వివ—వేదమునందలి ఇంద్రాది శబ్దములనుబట్టి బ్రహ్మ ప్రపంచ సృష్టి గావించుచున్నాడనుటచేత వేదములు నిత్యము లనియు, ఆ వేదములను స్మరించుచు, బ్రహ్మాదులు జగత్సృష్ట్యాదికము గావింతు రనియు స్పష్టమగుచున్నది.

94 సూ — సమాననామరూపత్వాచ్చావృత్తావప్యవిరోధో దర్శ నాత్ స్మృతేశ్చ (5) 1-3-29

పద — సమాననామరూపత్వాత్, చ, ఆవృత్తౌ, అపి, అవిరో ధః, దర్శనాత్, స్మృతేః చ.

అర్థ — ఆవృత్తౌ + అపి = కల్పములు మారునప్పుడును, సమాననామరూపత్వాత్ = సమానములైన నామరూపములను కలిగి యుండుటవలన, అవిరోధః = వేదములు నిత్యములు అనుటలో విరో

ధములేదు. దర్శనాత్=వేదవచనములవలనను, స్మృతేశ్చ = స్మృతి వచనములవలనను (ఈ విషయము తెలియుచున్నది.)

వివ — నిత్యములైన వేదములయందలి శబ్దములనుబట్టి ప్రతికల్పమునందును సృష్టి జరుగునెడల అన్ని కల్పములయందును ఒకేవిధమైన సృష్టి జరుగవలయును గదా! అనినచో సృష్టి అన్ని కల్పములయందును ఒకే విధముగ జరుగు నని శ్రుతిస్మృతులు చెప్పు చున్నవి. శ్రుతి-"ధాతా యథాపూర్వ మకల్పయత్"(పు.సూ.) "బ్రహ్మ పూర్వకల్పమునందువలె ప్రపంచమును సృష్టించెను." స్మృతి-

శ్లో॥ యథర్తుష్వృతులింగాని నానారూపాణి పర్యయే ।
దృశ్యన్తే తాని తాన్యేవ తథా భావా యుగాదిషు ॥
(వి. పు. 1-5-65)

" ఆయా ఋతువులలో అనేకవిధములైన ఆయా ఋతుచిహ్నములు ఎట్లు కనిపించుచుండునో అట్లే కల్పములు మారినపుడును సృష్టి యథా పూర్వముగ చూపట్టుచుండును. కావున వేదములునిత్యములు. ఇంద్రాది దేవతలకు శరీరము, ఉపాసనార్హత గలవు.

## 25. మధ్వధికరణము 8 (3)

మధువిద్యాది - ఉపాసనలకుఆదిత్యాదులును అర్హులే.

౭౫ సూ— మధ్వాదిష్వసంభవాదనధికారం జైమినిః (1)1-3-30

అర్థ — మధు + ఆదిషు = మధువిద్య మొదలగు బ్రహ్మవిద్య లలో, అసంభవాత్ = దేవతలు అన్వయించుట సంభవింపనందున, అనధికారం = దేవతలకు ఉపాసనలో అధికారము లేదని, జైమినిః = జైమినిమహర్షి తలంచుచున్నారు.

వివ — మధురూపమున ఆదిత్యుని ఉపాసించుటకు మధువిద్య అని పేరు. ఇది "అసౌ వా ఆదిత్యో దేవమధు" (ఛా- 3-1-1) " ఈ

ఆదిత్యుడు దేవతలకు మధువు- అనగా ప్రియమైనవాడు" అని ప్రారంభించి వివరింపబడినది. "ఈ ఆదిత్యునియొక్క నలువైపుల గల భాగములను వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు సేవింతరని, ఊర్ధ్వభాగమును సాధ్యులు సేవింత రని తెలిపి, ఈ విధముగ ఉపాసించువారు వసురుద్రాదులలో ఒకరుగా చేరి, తామును ఆ దేవ మధువును దర్శించి తృప్తి చెందుదురు." "స య ఏత దేవమమృతం వేద వసూనామేవైకో భూత్వాగ్నినైవ ముఖేనైతదేవామృతం దృష్ట్వా తృప్యతి" (ఛా-3-6-3) అని చెప్పుటచే ఇచట ఒక సందేహము కలుగుచున్నది. దేవతలును ఉపాసకులగు పక్షమున ఈ దేవమధువును వసురుద్రాదులు ఎట్లు ఉపాసింతురు? వసుత్వమును కోరి కదా వసువులు ఉపాసింపవలయును! ఇది అసంగతము. కావున దేవతలకు ఉపాసనలయందు అధికారము లేదు అని జైమినిమతము.

86 సూ — జ్యోతిషి భావాచ్చ (2) 1-3-31

అర్థ — జ్యోతిషి = పరమాత్మ విషయమున, భావాత్ + చ = ఈ ఉపాసనము సంభవ మగుటవలనను దేవతలకు మధువిద్య మొదలగు విద్యలలో అధికారము లేదు.

వివ — "తందేవాః జ్యోతిషాం జ్యోతిః ఆయుర్హోపాసతేఽమృతమ్" (బృ- 6-4-14) "జ్యోతులకును జ్యోతి, ఆయువు, అమృతము అయిన ఆ బ్రహ్మమును దేవతలు ఉపాసింతురు" అనుటచే కేవలము బ్రహ్మవిద్యయందు మాత్రమే దేవతలకు అధికారము కలదని, మధ్వాదివిద్యలలో అధికారము లేదని స్పష్టమగుచున్నది.

87 సూ — భావం తు బాదరాయణోఽస్తి హి (3) 1-3-32

అర్థ — బాదరాయణః + తు = బాదరాయణమహర్షి, భావం = ఆదిత్యాదులకును మధువిద్యాదులయందు ప్రవేశముండుటను అంగి

కరించుచున్నారు. అస్తి హి = ఆదిత్యాదులకు తామే ఉపాసకులుగను, ఉపాస్యులుగను ఉండవచ్చును గదా.

వివ — మధువిద్యాదులయందు ఆదిత్యాది దేవతలకును ప్రవేశము కలదని బాదరాయణమహర్షి భావించుచున్నారు. ఆదిత్యాది దేవతలు మధువిద్యోపాసనచేసి, పైకల్పమునను ఆదిత్యాదులుగానే ఉండి, ఉపాసనాబలముచే పరబ్రహ్మమును పొందవచ్చును. మరియు "య ఏతామేవం బ్రహ్మోపనిషదం వేద" (ఛా- 3-2-1) "ఎవడు ఈ మధువిద్యారూపమైన బ్రహ్మోపాసనమును కావించునో" అనుటచే ఈ మధువిద్యయు బ్రహ్మవిద్యయే అని స్పష్టమగుచున్నది. కావున ఈ మధువిద్యాదులయందు కూడ ఆదిత్యాదిదేవతలకు అధికారము కలదని బాదరాయణసిద్ధాంతము. కావున దేవతలకు ఉపాసనాధికారము, తదనుకూలమైన శరీరము కలదని సిద్ధించినది.

## 26 అపశూద్రాధికరణము 9 (7)

### ఉపనయనార్హత లేనివారికి వైదికబ్రహ్మోపాసనలయందు అధికారము లేదు.

98 సూ — శుగస్య తదనాదరశ్రవణాత్తదాద్రవణాత్సూచ్యతే హి (1) 1-3-33

పద — శుక్ + అస్య, తత్ + అనాదరశ్రవణాత్, తదా, ఆద్రవణాత్, సూచ్యతే, హి.

అర్థ— తత్ + అనాదరశ్రవణాత్ = హంసలరూపమున ఎగురుచున్న ఆ ఋషుల అనాదరవాక్యములను వినుటవలన, తదా=అప్పుడే, ఆద్రవణాత్ = రైక్వమహర్షిసన్నిధికి పరిగెత్తుటవలనను, అస్య = జానశ్రుతియొక్క, శుక్ = శోకము, సూచ్యతే హి = రైక్వమహర్షి చేసిన "శూద్ర" అను సంబోధనముచేత సూచింపబడుచున్నదిగదా!

వివ — జానశ్రుతి అను రాజు మార్గమున పోవుచుండగ అతని పై భాగమున భల్లాక్షుడు, కంవరుడు అను ఇద్దరు ఋషులు హంసల రూపమున ఆకాశమున నెగురుచు జానశ్రుతిని చూచిరి. వారిలో కంవరుడు "భల్లాక్ష, నీ నీడను జానశ్రుతిమీద పడనీయకుము" అని హెచ్చరించెను. అందులకు భల్లాక్షుడు "కంవర! నీ వితనిని బ్రహ్మజ్ఞానియైన రైక్వునితో సమానునిగ జేసి పలుకుచున్నావేమి" అని ప్రశ్నించెను. ఆ మాటలు జానశ్రుతి చెవినపడినవి. వెంటనే అతడు బ్రహ్మజ్ఞానియైని రైక్వుని వెదకికొనుచు వెళ్ళి, ఆ ఋషి కోరిన విధముగ ధనకనకవస్తువాహనాదులను సమర్పించి బ్రహ్మవిద్యను తనకు ఉపదేశింపు మని ప్రార్థించెను. ఆ సందర్భమున "అహహ అరే త్వా శూద్ర తవైవ సహ గోభిరస్తు" (ఛా—4-2-3) "అహహ! ఓరీ శూద్రా! ఇవి యన్నియు నీవద్దనే ఉండుగాక" అనుచు రైక్వమహర్షి జానశ్రుతిని "శూద్రా!" అని సంబోధించెను. దీనినిబట్టి జానశ్రుతి శూద్రుడని తెలియుచున్నది. కావున శూద్రులకును బ్రహ్మవిద్యయందు అధికారము కలదు అను పూర్వపక్షమును సూత్రకారుడు ఖండించుచున్నాడు. ఇచటి శూద్రశబ్దము శూద్రజాతి పురుషవాచకము కాదు. జానశ్రుతి తనకు బ్రహ్మజ్ఞానము లేదను శోకముతో బాధపడుచున్నందువలన అతనిని రైక్వమహర్షి శూద్ర అని సంబోధించినాడు. శూద్రుడు అనగా అజ్ఞానమువలన శోకముతో ఉన్నవాడని అర్థము. "శోచనాత్ శూద్రః" అని వ్యుత్పత్తి.

## 33 సూ — క్షత్రియత్వ గతేశ్చ (2) 1-3-34

అర్థ — క్షత్రియత్వ గతేః + చ = జానశ్రుతి క్షత్రియుడని "బహుదాయీ" (ఛా— 4-1-1) "ఎక్కువ దానము చేయువాడు" అను విశేషణమునుబట్టి తెలియుటవలనను, ఇచటి "శూద్ర" అను సంబోధనపదము జాతివాచకముకాదు.

100 సూ — ఉత్తరత్ర చైత్రరథేన లిఙ్గాత్ (3) 1-3-35

అర్థ — ఉత్తరత్ర = తరువాత వచ్చు భాగములలో బ్రాహ్మణ క్షత్రియులకు మాత్రమే బ్రహ్మవిద్యలో అధికారముచెప్పబడియున్నది. చైత్రరథేన = చైత్రరథుడను క్షత్రియునితో, లిఙ్గాత్ = కాపేయుడను బ్రాహ్మణునకు గల సాహచర్యము అను హేతువువలన.

వివ — జానశ్రుతి జాతిశూద్రుడు కాడు. బ్రహ్మవిద్య బ్రాహ్మణ క్షత్రియులకే ఉపదేశింపబడుచుండినట్లు తెలియుచున్నది. "ఏతేన చైత్రరథం కాపేయాః అయాజయన్" (తాండ్య బ్రాహ్మణము 7-5) "కాపేయులు చైత్రరథుని యజ్ఞము చేయించిరి" అనుటచే కాపేయులు బ్రాహ్మణు లని తెలియుచున్నది. ఇట్లే యజ్ఞము చేసిన చైత్రరథుడును "తస్మాత్ చైత్రరథోనామ ఏకః క్షత్రపతి అజాయత" (శతపథ బ్రా 11-5-3-13) "వానినుండి చైత్రరథుడను ఒక క్షత్రియుడు జన్మించెను" అనువాక్యమునుబట్టి క్షత్రియు డని స్పష్టమగుచున్నది. ఇదే విధముగ ఇచట ఆచార్యుడైన రైక్వమహర్షి బ్రాహ్మణుడు కాగా శిష్యుడైన జానశ్రుతి క్షత్రియుడు అగుచున్నాడు.

శ్రీశంకరులభాష్యమున 34వ, 35వ సూత్రములు రెండును ఒకే సూత్రముగ గైకొనబడినవి.

101 సూ — సంస్కారపరామర్శాత్తదభావాభిలాపాచ్చ (4) 1-3-36

అర్థ — సంస్కారపరామర్శాత్ = విద్య నుపదేశించునపుడు ఉపనయనసంస్కారమును ప్రస్తావించుటవలనను, తత్ + అభావ + అభిలాపాత్ + చ = శూద్రునకు అట్టి ఉపనయన సంస్కారము లేదని స్మృతి చెప్పుటవలనను జానశ్రుతి శూద్రుడు కాడని స్పష్టమగుచున్నది

వివ — జబాలకుమారుడు సత్యకాముడు గౌతమ మహర్షి

యొద్దకు వచ్చి బ్రహ్మవిద్యను ఉపదేశింపు మని ప్రార్థించెను, అతనికి బ్రహ్మవిద్యను ఉపదేశించుటకై ఆచార్యుడు " ఉప త్వా నేష్యే" (ఛా- 4-4-5) " నిన్ను ఉపనీతుని గావింతును " అని చెప్పి నందున ఉపనయనసంస్కారము జరిగిన తరువాతనే విద్యోపదేశము చేయవలయునని తెలియుచున్నది. " న శూద్రే పాతకం కించిత్ న చ సంస్కారమర్హతి" (మను-10-126) "శూద్రునియందు ఎట్టి పాపము లేదు. అతడు ఉపనయనాది సంస్కారములకు అర్హుడు కాడు" అనుటచే శూద్రునకు ఉపనయనార్హతయే లేదు. కావున శూద్రుడు బ్రహ్మ విద్యకు అర్హుడు కాడు. కాని జానశ్రుతి రైక్వునివలన బ్రహ్మవిద్యోపదేశమును పొందుటచే అతడు జాతిశూద్రుడు కాడు అని స్పష్టమగుచున్నది.

102 సూ — తదభావనిర్ధారణే చ ప్రవృత్తేః (5) 1-3-37

అర్థ — తత్ + అభావనిర్ధారణే = అతడు శూద్రుడు కాడు. అని నిర్ధారణ చేసుకొనుటయందు, ప్రవృత్తేః + చ = ఆచార్యుడు ప్రవర్తించుటవలనను శూద్రునకు బ్రహ్మవిద్యాధికారము లేదు.

వివ — జబల కుమారుడు జాబాలుడు గౌతమునియొద్దకు వెళ్ళి బ్రహ్మవిద్యను ఉపదేశింపుమని ప్రార్థింపగా గౌతముడు అతని గోత్రమును తెలిసికొన గోరెను. వెంటనే జాబాలుడు తల్లియెద్దకు వెళ్ళి తన గోత్రమును తెలుపుమని అడిగెను. అందులకు ఆమె తనకు తమ గోత్రము తెలియ దని పలికినది. జాబాలుడు తల్లి చెప్పిన మాటలను అట్లే గౌతమునకు నివేదించెను. గౌతముడు అతని సత్యవాక్యమునకు సంతోషించి " నైతత్ అబ్రాహ్మణః వివక్తు మర్హతి- సమిధం సౌమ్యాహర ఉపత్వానేష్యే " (ఛా- 4-4-5) " ఓ సౌమ్యుడా!

ఇట్టి సత్యవాక్యమును బ్రాహ్మణుడు కానివాడు చెప్పజాలడు. సమిధను తీసికొని రమ్ము. ఉపనయనము గావింతును ” అని పల్కెను. దీనిని బట్టి జాబాలుడు శూద్రుడు కాడని నిర్ధారణ చేసికొనిన తరువాతనే అతనికి గౌతముడు బ్రహ్మవిద్యను ఉపదేశించెనని స్పష్టమగుచున్నది కావున శూద్రునకు వైదికబ్రహ్మవిద్యయందు అధికారము లేదు.

103 సూ — శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్ (6) 1–3–38

అర్థ — శ్రవణ + అధ్యయన + అర్థప్రతిషేధాత్ = వేదము లను వినుట, చదువుట, దానియందు చెప్పిన కర్మలను ఆచరించుట, ఇవి యన్నియు శూద్రునకు నిషేధింపబడియుండుటవలనను అతనికి వైదికబ్రహ్మాధికారము లేదు.

104 సూ — స్మృతేశ్చ (7) 1–3–39

అర్థ — స్మృతేః + చ = స్మృతివచనములవలను శూద్రునకు వేదాధికారము లేదని తెలియుచున్నది. “ న చాస్యోపదిశేద్ధర్మం నచాస్య వ్రతమాదిశేత్” “శూద్రునకు ధర్మములను ఉపదేశింపరాదు, వ్రతము నాదేశింపరాదు ” అని స్మృతివచనము.

## ప్రమితాధికరణశేషము (2)

105 సూ — కమ్పనాత్ (8) 1–3–40

అర్థ — కమ్పనాత్ = కఠోపనిషత్తునందు “యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతమ్ ” (కఠ– 2–6–2) “ ఈ కనిపించు ప్రపంచ మంతయు ప్రాణమునుండి వెలువడి ఆ ప్రాణమునందే గజ గజ వణకుచున్నది ” అనుటవలన హృదయమున అంగుష్ఠపరిమిత పురుషుడు పరమాత్మయే. ఇచట ప్రాణశబ్దము పరమాత్మవాచకము. అతనివలని భయముచేత గదా వాయువు, సూర్యుడు, ఇంద్రుడు,

మొదలగువారు గజగజ వణకుచు తమ తమ కర్తవ్యములను నిర్వర్తించునది.

106 సూ — జ్యోతిర్దర్శనాత్ (9) 1-3-41

అర్థ — జ్యోతిః + దర్శనాత్ = జ్యోతిస్సుయొక్క దర్శనము వలనను అంగుష్ఠపరిమితుడు పరమాత్మ.

వివ — " తస్య భాసా సర్వమిదం విభాతి " (కఠ- 2-5-15) " అతని కాంతితో ఈ చంద్రసూర్యాదులందరు కాంతిమంతులై ప్రకాశించుచున్నారు " అనుచు ఆ అంగుష్ఠపరిమితుని జ్యోతిషాం జ్యోతిగా దర్శించుటవలనను అతడు పరమాత్మ.

ప్రమితాధికరణమున (బ్ర. సూ. 1-3-6 అధి) మొత్తము నాల్గు సూత్రములు కలవు. వానిలో రెండు సూత్రములు అచటనే వివరింబడినవి. తక్కిన రెండు సూత్రములును ఈ 16వ అధికరణమున వివరింపబడినవి. కావుననే ఈ అధికరణమునకు ప్రమితాధికరణశేషము అని పేరు. ఈ మధ్యలో వచ్చిన దేవతాధికరణము, మధ్వధికరణ అపశూద్రాధికరణములు ప్రాసంగికముగ ఏర్పడినవి.

శ్రీ శంకరులభాష్యమున 40వ, 41వ సూత్రములు రెండును వేరు వేరు అధికరణములుగా గ్రహింపబడినవి

## 27 అర్థాన్తరత్వాదివ్యపదేశాధికరణము 10 (3)

జగత్తుయొక్క నామరూపములను నిర్వహించు ఆకాశము పరమాత్మ

107 సూ — ఆకాశోఽర్థాన్తరత్వాదివ్యపదేశాత్ (1) 1-3-42

అర్థ — ఆకాశః = ఆకాశో హవై నామరూపయోర్నిర్వహితా " (ఛా- 8-14-1) " ఆకాశము గదా నామరూపములను నిర్వహించు

## ప్రథమాధ్యాయ తృతీయపాద సంగ్రహశ్లోకము

శ్లో॥ విశ్వాత్మానంతభూమా నియమనధృతికృన్ముక్తభోగ్యస్వభావో
దభ్రహస్స్వాధారసర్వో హృదయపరిమితావస్థయా సర్వయన్తా।
దేవాదీనాముపాస్యో వసుముఖవిబుధైస్స్వాత్మభావేన సౌమ్యః,
శూద్రాద్యోపాస్త్యనర్హః ప్రభురిహ బుబుధే నామరూపైకకర్తా॥

తా — ద్యుభ్వాద్యధికరణమునందు సర్వేశ్వరునియొక్క విశ్వాత్మత్వము, భూమాధికరణమునందు అనన్తభూమత్వము, అక్షరాధికరణమునందు జగన్నియామకత్వధారకత్వములు, ఈక్షతికర్మాధికరణమున ముక్తభోగ్యత్వము, దహరాధికరణమున సర్వాధారత్వమును ప్రమితాధికరణమునందు ఉపాసనానుగ్రహార్థము అంగుష్ఠపరిమితత్వము, దేవతాధికరణమున దేవాద్యుపాస్యత్వము, మధ్వధికరణమున వసురుద్రాదులచే స్వాత్మత్వేన సేవ్యత్వమును, అపశూద్రాధికరణమున శూద్రాద్యనుపాస్యత్వము, అర్థాంతరత్వాధికరణమున నామరూపనిర్వాహకత్వము అను ఈ కళ్యాణగుణములు సర్వేశ్వరునియందు వివరింపబడనవి.

—O—

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# ప్రథమాధ్యాయ చతుర్థపాదము

## అస్పష్టతర జీవాదిలింగకపాదము

## 28 ఆనుమానికాధికరణము 1 (7)

అవ్యక్త శబ్దవాచ్యము శరీరము - ప్రధానముకాదు.

110 సూ — అనుమానికమప్యేకేషామితిచేన్న శరీరరూప।విన్యస్తగృహీతేర్దర్శయతి చ (1) 1-4-1

పద — అనుమానికం, అపి, ఏకేషాం, ఇతిచేత్, న, శరీర రూపకవిన్యస్తగృహీతేః, దర్శయతి, చ.

అర్థ — ఏకేషాం = కొందరి మతమున, అనుమానికం + అపి = ప్రకృతియు జగత్కారణ మగుచున్నది. ఇతిచేత్ = అనుచో, న = అట్లుకాదు. శరీరరూపకవిన్యస్తగృహీతేః = శరీరమును రథముగను, ఆత్మను రథస్వామిగను రూపణచేసినదానిలో శరీరమును అవ్యక్త శబ్దముచే గ్రహింపవలసియున్నందున, అచటి అవ్యక్తశబ్దము ప్రకృతి వాచకము కాదు. దర్శయతి చ = "యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః" (కఠ- 1-3-13) "ప్రాజ్ఞుడు వాక్కును, మనస్సును వశము చేసికొన వలయును" అను కఠశ్రుతి అట్లు వశము చేసికొనువాని శరీరమును అవ్యక్తశబ్దముచే పేర్కొనినది.

వివ —

"ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః అర్థేభ్యశ్చ పరం మనః।
మనసశ్చ పరాబుద్ధిః బుద్ధేరాత్మా మహాన్ పరః॥
మహతః పరమవ్యక్తః అవ్యక్తాత్ పురుషః పరః।
పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః॥
(కఠ- 1-3-10)

" ఇంద్రియములకంటె అర్థములు, వానికంటె మనస్సు, మనస్సు కంటె బుద్ధి, బుద్ధికంటె గొప్పవాడైన ఆత్మ, అతనికంటె అవ్యక్తము, అవ్యక్తముకంటె పురుషుడు ప్రధానమైనవాడు. ఆ పురుషునికంటె పరమైనది ఇంకేదియులేదు " అను కఠోపనిషద్వాక్యమున గల అవ్యక్తశబ్దము జగత్కారణముగ సాంఖ్యులు చెప్పు ప్రకృతిని, ఆత్మశబ్దము పరమాత్మను బోధించుచున్నది. కావున వేదాంత మతమునను ప్రకృతియే జగత్కారణము కావలయును అను పూర్వపక్షమునకు సమాధానము ఈ సూత్రము.

కఠోపనిషత్తునందలి ఈ అవ్యక్తశబ్దము ప్రకృతిని బోధింపదు. ఆ ప్రకరణమున

" ఆత్మాన రథినం విద్ధి శరీరం రథమేవ తు ।
బుద్ధిం తు సారథిం విద్ధి, మనః ప్రగ్రహమేవ చ ॥
ఇంద్రియాణి హయానాహుః విషయాన్ తేషు గోచరాన్॥"
(కఠ– 1-3-3)

" ఆత్మ రథస్వామి, శరీరము రథము, బుద్ధి సారథి, మనస్సుకళ్ళెము, ఇంద్రియములు గుఱ్ఱములు. శబ్దాదివిషయములు ఆగుఱ్ఱములు సంచరించుప్రదేశములు " అను కఠోపనిషద్వాక్యములయందు రూపకాలంకారమునాశ్రయించి జీవుని గమ్యస్థానయాత్రవర్ణింపబడినది. దీనిలో ఒకదానికంటె మరియొకటి ప్రధానమైనదని చెప్పుచు, ఇంద్రియ, విషయ మనోబుద్ధి, ఆత్మ, శరీరరూపములైన ఆరింటిలో ఇంద్రియాదులు తమ తమశబ్దములచే (ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః అర్థేభ్యశ్చ పరం మనః,) పేర్కొనబడినవి. కాని రథముగ నిరూపింపబడిన శరీరము మాత్రము శరీరశబ్దముచే పేర్కొనబడక " అవ్యక్త " శబ్దముచే పేర్కొనబడినది. కావున ఈ అవ్యక్తశబ్దము ప్రకృతిని బోధింపదు. శరీరమునే బోధిం

చును. ఇట్లే ఇచటి పురుషశబ్దము పరమాత్మవాచకము. జీవవాచకము కాదు.

111 సూ — సూక్ష్మం తు తదర్హత్వాత్ (2) 1-4-2

అర్థ — సూక్ష్మంతు = సూక్ష్మమైన ప్రకృతి తత్త్వమే శరీర ముగ ఏర్పడుచున్నది. తత్ + అర్హత్వాత్ = ఆ అవ్యక్తమైన ప్రకృతియే శరీరముగ ఏర్పడి పురుషార్థములను సాధించుటకు తగి యుండుటవలన.

112 సూ — తదధీనత్వాత్ అర్థవత్ (3) 1-4-3

అర్థ — తత్ + అధీనత్వాత్ = శరీరాదులు ఆ పరమపురుషుని యొక్క అధీనమునందు ఉండుటవలన, అర్థవత్ = ప్రయోజనవంత ముగుచున్నవి.

113 సూ — జ్ఞేయత్వావచనాచ్చ (4) 1-4-4

అర్థ — జ్ఞేయత్వ + అవచనాత్ + చ = ఇచట అవ్యక్త శబ్దవాచ్యమైన దానిని తెలిసికొనదగిన దానినిగ చెప్పనందువలనను ఈ అవ్యక్తము ప్రకృతి కాదు.

వివ — సాంఖ్యులు "వ్యక్తావ్యక్తజ్ఞవిజ్ఞానాత్" (సాంఖ్య కారిక 2) "ప్రకృతి పురుషులను తెలియుటవలన" అనుచు ప్రకృతి కూడ జ్ఞేయ మని యందురు. ఇచటి అవ్యక్తము జ్ఞేయముగ వర్ణింప బడలేదు. కావున ఇది ప్రకృతి కాదు.

114 సూ — వదతీతిచేన్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్ (5) 1-4-5

అర్థ — వదతి + ఇతిచేత్ = "అశబ్దమస్పర్శం" (కఠ-1-3-15) "శబ్దము లేనిది, స్పర్శలేనిది" అని ప్రారంభించి "నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే" (కఠ-1-3-15) "దానిని ధ్యానించి,

మృత్యుముఖము నుండి విడువబడుచున్నాడు " అని చెప్పుటచేత అవ్యక్తము జ్ఞేయముగను బోధింపబడినది గదా. కావున అవ్యక్తము ప్రకృతియే అనుచో, న = అట్లుకాదు. ప్రకరణాత్ = ప్రకరణమును బట్టి, ప్రాజ్ఞః + హి = పరమాత్మయే గదా శబ్దస్పర్శాదిరహితుడు గను, ధ్యానింపదగినవాడుగను అచట బోధింపబడుచున్నాడు.

వివ— "సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్" (కఠ– 3-9) " అట్టి ఉపాసకుడు మార్గముయొక్క లక్ష్యమైన విష్ణువు యొక్క పరమపదమును పొందుచున్నాడు " అనుటచేత ఈ ప్రకరణ మంతయు పరబ్రహ్మమునకు సంబంధించిన దని తెలియుచున్నది. కావున ఈ ప్రకరణమున ధ్యానింపుమని చెప్పినది పరబ్రహ్మమునే గాని ప్రకృతిని గాదు.

115 సూ — త్రయాణామేవ చైవముపన్యాసః ప్రశ్నశ్చ (6) 1-4-6

అర్థ — త్రయాణాం + ఏవ + చ = ఉపాస్యుడు, ఉపాసకుడు, ఉపాసన అను ఈ మూడింటికే, ఏవం = ఈ విధముగ ఉపన్యాసః = యమునిచే ఉపన్యాసము కావింపబడినది. ప్రశ్నః + చ = నచికేతుడు అడిగిన ప్రశ్నయు ఈ మూడింటిని గురించియే. కావున ప్రకృతికి సంబంధించిన ప్రస్తావన ఇందు లేదని భావము.

116 సూ — మహద్వచ్చ (7) 1-4-7

అర్థ — మహద్వత్ + చ = "బుద్ధిరాత్మా మహాన్ పరః" (కఠ– 1-3-10) అనువాక్యమున " మహాన్ " అను పదము " ఆత్మ " అను పదమునకు విశేషణమే గాని మహత్తత్త్వవాచకము ఎట్లు కాదో, అట్లే అవ్యక్తశబ్దము సయితము ప్రకృతివాచకముకాదు. శరీరవాచకమే.

## 29 చమసాధికరణము 2 (3)

### కేవల ప్రకృతి జగత్కారణము కాజాలదు.

117 సూ — చమసవదవిశేషాత్ (1) 1-4-88

అర్థ — చమసవత్ = చమసశబ్దమువలె, అవిశేషాత్=ప్రత్యేక విశేషములను తెలుపనందువలన "అజామేకాం" అనుమంత్రమున గల "అజా" శబ్దము సాంఖ్యులు చెప్పునట్టి ప్రకృతిని బోధింపదు.

వివ —

"అజామేకాం లోహితశుక్ల కృష్ణాం
బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః।
అజో హ్యేకో జుషమాణోనుశేతే।
జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః" (శ్వేతాశ్వ 4-5)

"ఎఱ్ఱని, తెల్లని, నల్లని రంగులు కలిగి సమానమైన అనేకసంతానములను సృజించుచున్నట్టి అజను (ప్రకృతిని) సేవించుచు, ఒక అజము (జీవుడు) దానిని వెన్నంటి యుండును. మరియొక్క అజము (పరబ్రహ్మము) దానిని సేవింపకుండును" అను మంత్రమున "అజా" శబ్దముచేత ప్రకృతి బోధింపబడుచున్నది. అదియే జగత్తును సృజించుచున్నట్లు చెప్పుటచే కేవల ప్రకృతి జగత్కారణ మనుటలో వేదాన్తులకు విప్రతిపత్తి యుండ నవసరములేదు అని పూర్వపక్షము రాగా దానికి సమాధానము ఈ సూత్రము. ఇచట "అజా" శబ్దము ప్రకృతిని బోధించినను ఆ ప్రకృతి స్వతంత్రముగ జగత్కారణ మగుచున్నది అనుటకు ఎట్టి సూచనలు కన్పట్టుటలేదు. కర్మకాండమునందు ఆ చమసమునకు "చమసము" అను పాత్రవిశేషము ఉపయోగించబడుచున్నది. దాని స్వరూపమును నిర్వచించుచు "అర్వాగ్బిలః చమసః ఊర్ధ్వబుధ్నః (బృ-4-2-3) "పైన కాడగలిగి క్రింద రంధ్రము

గలది. చమసము" - అను దాని విశేషధర్మములు స్పష్టముగ వివరింపబడినవి. ఈ విధముగ అజాశబ్దముచేత పేర్కొనబడిన ప్రకృతి సాంఖ్యులు చెప్పిన రీతిని స్వతంత్రముగ జగత్కారణ మనుటకు తగిన ఆధారము ఇచట చూపట్టదు. కావున కేవల ప్రకృతి జగత్కారణము కాదు.

118 సూ — జ్యోతిరుపక్రమా తు తథాహ్యధీయత ఏకే (2) 1-4-9

అర్థ — జ్యోతిః + ఉపక్రమా + తు = జ్యోతిశ్శబ్దవాచ్యుడైన పరమాత్మద్వారా ప్రకృతి జగత్సృష్టికి ఉపక్రమించుచున్న దని "అజామేకాం" అను మంత్రమునకు అర్థము చెప్పవలెను. తథా = అట్లు, ఏకే = కొందఱు, అధీయతే + హి = అధ్యయనము చేయుచున్నారు గదా!

వివ — "అణోరణీయాన్ మహతో మహీయాన్" (తై. ఉ. నారాయణ 4-10-1) "అణువుకంటె అణువైనవాడు, మహత్తుకంటె మహత్తైనవాడు" అనుచు బ్రహ్మమును ప్రస్తుతించి "అతస్సముద్రా గిరయశ్చ సర్వే" (తై. నారాయణ 4-10-3) "ఈ బ్రహ్మమునుండి సముద్రములు, పర్వతములు అన్నియు పుట్టుచున్నది" అని చెప్పుచు ఆ ప్రకరణమున "అజామేకాం" అను ఈ మంత్రమునే తైత్తిరీయశాఖవారును పఠించుచున్నారు. అచట బ్రహ్మాత్మకమైన ప్రకృతి జగత్కారణ మని తెలుపబడినది. ఇట్లే శ్వేతాశ్వతరోపనిషత్తు నందలి "అజామేకాం" అను మంత్రము కూడ బ్రహ్మాత్మకమైన ప్రకృతియే జగత్కారణ మని బోధించుచున్నది.

119 సూ — కల్పనోపదేశాచ్చ మధ్వాదివదవిరోధః (3) 1-4-10

అర్థ— కల్పన + ఉపదేశాత్+చ= బ్రహ్మాత్మక మైన ప్రకృతియే జగత్కారణ మని చెప్పుటవలనను, మధు + ఆ దివత్ = సూర్యుడు కార్యదశలో దేవతలకు మధువుగ కారణదశలో సూక్ష్మరూపమునఉండు నట్లుగను, అవిరోధః = ప్రకృతియు సృష్టికాలమున వ్యక్తముగను, ప్రళయకాలమున అవ్యక్తముగను, బ్రహ్మనాశ్రయించుకొని ఉండుట వలన దానిని "అజా" "పుట్టుక లేనిది" అనియు, జ్యోతిరుపక్రమాత్ = బ్రహ్మమును కారణముగా గలది—అనగా బ్రహ్మమునుండి జనించునది అనియు చెప్పుటలో విరోధములేదు.

వివ — " అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్ " (శ్వేత— 4-9) " మాయను (ప్రకృతిని) తన వశమున నుంచుకొని పరబ్రహ్మము దానినుండి ఈ విశ్వమును సృజించుచున్నది " అని స్పష్టముగ చెప్పుటచేత బ్రహ్మముయొక్క సంకల్పము లేనిదే ప్రకృతి స్వతంత్రముగ జగత్సృష్టి కావింపలేదని తెలియుచున్నది. ఇట్లే ఈ ప్రకృతి పరబ్రహ్మముయొక్క కార్యమే అయినను "అజా" అనగా పుట్టుక లేనిది. పరబ్రహ్మము నాశ్రయించుకొని యున్న ఈ ప్రకృతి ప్రళయ కాలమున సూక్ష్మరూపమునను, సృష్టికాలమున స్థూలరూపమునను ఉండుటవలన ఇది పరబ్రహ్మమునకు కార్యముగను, పుట్టుక లేనిది గను ఉండుటలో బాధలేదు.

## 30 సంఖ్యోపసంగ్రహాధికరణము 3

" పంచపంచజనాః" అనగా ఇరువదియైదు తత్త్వములు అని అర్థము కాదు. పంచేంద్రియములు " అని యర్థము.

128 సూ — న సంఖ్యోపసంగ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ

(1) 1-4-11

అర్థ — సంఖ్యా + ఉపసంగ్రహాత్ + అపి = "యస్మిన్ పంచ పంచజనాః ఆకాశశ్చ ప్రతిష్ఠితః తమేవం మన్య ఆత్మానం విద్వాన్ బ్రహ్మోఽమృతోఽమృతమ్" (బృ- 4-4-27) "దేనియందు ప్రకాశస్వరూపుడైన 5 × 5=25 తత్త్వములు ప్రతిష్ఠింపబడియున్నవో అట్టి పరబ్రహ్మమును తెలిసికొనినవాడు మరణరహితుడై మోక్షమును పొందుచున్నాడు" అనుచు సాంఖ్యులు చెప్పు ఇరువదియైదు తత్త్వము లను సంగ్రహించి చెప్పుటవలనను, న = కేవల ప్రకృతి జగత్కారణము కాజాలదు, నానాభావాత్ = పై మంత్రమున, యస్మిన్ = దేనియందు అనుటచే ఈ ఇరువదియైదు తత్త్వములకును ఆధారముగ మరియొక తత్త్వమున్నట్లు తెలియుటవలనను, అతిరేకాత్ + చ = ఆకాశమును వీనిలో చేర్పక ప్రత్యేకించి చెప్పుటవలనను "పంచ పంచజనాః" అను పదమునకు సాంఖ్యులు చెప్పు ఇరువదియైదు తత్త్వము లని అర్థము చెప్పుట పొసగదు. కావున "పంచసంఖ్యా విశిష్టాః పంచజనాః = పంచపంచజనా" అని కాక "పంచజనసంజ్ఞితాః పంచైవ" అని సమాసమును చెప్పుకొనవలయును.

121 సూ — ప్రాణాదయోవాక్యశేషాత్ (2) 1-4-12

అర్థ— ప్రాణ+ఆదయః = పంచపంచజనాః అను పదముచేత ప్రాణాదులు బోధింపబడుచున్నవి. అనగా ఇంద్రియములు బోధింపబడుచున్నవి. పంచజనము లనగా జ్ఞానప్రకాశమును గల్గించు ఐదు ఇంద్రియము లని అర్థము. సృష్టియందు జనించుటచే ఇవి "జనాః" అని పేర్కొనబడినవి. "సప్తసప్తర్షయః" అను రీతిని "పంచపంచజనాః" అను ప్రయోగమును సమన్వయింపవలెను. వాక్యశేషాత్ = "ప్రాణస్య ప్రాణముత చక్షుషశ్చక్షుః శ్రోత్రస్య శ్రోత్ర

మన్నస్యాన్నం మనసో యే మనోవిదుః ” (మాధ్యందినశాఖ) అను తరువాతి వాక్యమువలన ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, అన్నము మనస్సు అను ఈ ఐదును పంచజనశబ్దముచే బోధింపబడునని వని తెలియుచున్నది.

122 సూ — జ్యోతిషైకేషామసత్యన్నే (3) 1-4-13

అర్థ — ఏకేషాం = కొందఱి పాఠమున, అన్నే = అన్న శబ్దము, అసతి = లేకున్నను, జ్యోతిషా = జ్యోతిశ్శబ్దముచేత, పంచ జనము లనగా పంచేంద్రియము లని స్పష్టము కాగలదు.

వివ — “ యస్మిన్ పంచపంచజనాః ” అను మంత్రమున సాంఖ్యులు చెప్పు ఇరువదిఐదు తత్త్వములను బోధించుచున్నది గదా! కావున సాంఖ్యులు చెప్పినట్లు ప్రకృతియే జగత్కారణ మని వేదాంత లును అంగీకరింపవలయును అని పూర్వపక్షము.

కాని “పంచపంచజనాః ” అనుపదముచే బోధింపబడిన ఇరువది యైదు తత్త్వములు, వానికిఆధారముగ చెప్పబడిన పరబ్రహ్మతత్త్వము, వానికంటె భిన్నముగ పేర్కొనబడిన ఆకాశము కలిసి ఇరువదియేడు తత్త్వములు కావలసివచ్చును. సాంఖ్యులు దీనిని అంగీకరింపరుగదా కావున పై మంత్రమున గల పంచపంచజనాః అనుపదమునకు ఇరువది యైదు తత్త్వములు అని అర్థము కాదు. పంచేంద్రియములు లని అర్థము “ ప్రాణస్య ప్రాణం ” ఇత్యాది మంత్రము ప్రాణ చక్షు శ్రోత్రాన మనస్సులను పేర్కొని పంచపంచజనాః అనుపదమునకు పై అర్థమును నిర్ణయించుచున్నది. మాధ్యందినశాఖీయులు “ తందేవాః జ్యోతిషాం జ్యోతిః ” “ దేవతలు జ్యోతిస్సులకును జ్యోతిస్సైన ఆ తత్త్వమును అను మంత్రమున జ్యోతిశ్శబ్దముచే ఇంద్రియములను పేర్కొని, వాని కిని ప్రకాశకత్వశక్తిని కల్గించు జ్యోతిస్సు పరమాత్మయని ప్రస్తుతించి

నారు. కావున "పంచపంచజనాః" అను పదమునకు పంచేంద్రియ ములనియే అర్థము. ఇరువదియైదు తత్త్వము లని కాదు.

## 31 కారణత్వాధికరణము 4 (2)

ఆకాశాది శరీరకమైన పరబ్రహ్మమే జగత్కారణము.

123 సూ — కారణత్వేన చాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః (1) 1-4-14

అర్థ— ఆకాశ + ఆదిషు= ఆకాశము మొదలుగా గల కార్యముల యందు, కారణత్వేన= వానికి కారణముగ, యథావ్యపదిష్ట+ఉక్తేః + చ = మరియొకచోట చెప్పబడినట్లు సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాది గుణ విశిష్టమైన బ్రహ్మమే బోధింపబడుటవలన "తద్ధేదం తర్హి అవ్యాకృతమాసీత్" (బృ- 3-4-7) "ఇది అంతయు ప్రళయకాలమున అవ్యాకృతమైయుండినది" అను వాక్యమునగల అవ్యాకృతశబ్దము కేవల ప్రకృతిని బోధింపజాలదు.

వివ — "ఆత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః" (తై బ్ర. 1) "ఆ పరబ్రహ్మమునుండి ఆకాశము పుట్టినది. ఆకాశమునుండి వాయువు పుట్టినది." "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి, తత్తేజోఽసృజత" (ఛా- 6-2-3) "ఆ సత్తత్త్వము తాను బహురూపముల జనింపవలయునని తలంచినది. అది తేజస్సును సృజించినది" ఈ మొదలైన వాక్యములయందు, ఆ పరమాత్మయే ఆకాశాదుల నధిష్ఠించి జగత్సృష్టి గావించుచున్నట్లు స్పష్టమగుచున్నది. కావున బ్రహ్మాధిష్ఠితముగాని ప్రకృతి జగత్కారణము కానందున "అవ్యాకృత" శబ్దము ప్రధానవాచకము కాదు.

124 సూ — సమాకర్షాత్ (2) 1-4-15

అర్థ— సమాకర్షాత్ = ఇట్లే "సోఽకామయత బహుస్యాం ప్రజా

యేయేతి ” (తై . బ్ర) “ఆ బ్రహ్మము తాను బహురూపముల జనింప వలయునని సంకల్పించినది” అను వాక్యమున ప్రస్తుతమైన పరబ్రహ్మ మును ఆకర్షించుటవలన- అనగా పైకి దీసికొనివచ్చి అన్వయించుట వలన “అసద్వా ఇద మగ్ర ఆసీత్ (తై. బ్ర.) “ఇది తొలుత అసత్తుగా నుండినది ” అను వాక్యమున గల “ అసత్”, శబ్దము ప్రకృతిని బోధింపదు. కారణదశయందు సూక్ష్మచిదచిద్విశిష్టమై యున్న బ్రహ్మమునే ఈ “అసత్”, శబ్దము బోధించుచున్నది కార్య రూపమున లేసి దని అర్థము.

## 32 జగద్వాచిత్వాధికరణము 5 (3)

ఈ జగత్తు ఏ పరమాత్మయొక్క కార్యమో అతడు ఉపాస్యుడు.

125 సూ — జగద్వాచిత్వాత్ (1) 1-4-16

అర్థ — జగత్ + వాచిత్వాత్ = “యో వై బాలాక ఏతేషాం పురుషాణాం కర్తా యస్య వై తత్కర్మ స వై వేదితవ్యః” (కౌ- 4-18)“ఓ బాలాకి! ఈ పురుషులంటరికి ఎవడుకర్తయో, ఇదియంతయు ఎవని కార్యమో అతడు ఉపాసింపదగినవాడు ” అను అజాతశత్రుని ఉపదేశవాక్యమునందు గల “ కర్మశబ్దము” జీవుల పుణ్యపాపకర్మలను బోధింపక జగత్తును బోధించుట వలన జగత్తు బ్రహ్మముయొక్క కార్య మని తెలియుచున్నది. కావున జగత్కారణమైనపరబ్రహ్మ మును ఉపాసింపుమని ఉపదేశసారము.

126 సూ — జీవముఖ్యప్రాణలింగా న్నేతిచేత్తద్వ్యాఖ్యాతమ్ (2) 1-4-17

అర్థ — జీవముఖ్యప్రాణలింగాత్ = “ఏతై రాత్మభిర్భుఙ్క్తే” (కౌ- 4-18) “ ఈ ఆత్మలతో కలసి భుజించుచున్నాడు ” అను వాక్యమున తెలుపబడిన భోక్తృత్వమును బట్టియు “అథాస్మిన్ ప్రాణ

ఏవైకధా భవతి ” (కౌ- 4-19) “ ఈ ప్రాణమునందే ఏకత్వమును పొందుచున్నది ” అనుటవలనను ముఖ్యప్రాణముయొక్క ధర్మము చెప్పబడుటవలనను, నేతి చేత్ = బాలాకికి ఉపాస్యుడుగ ఉపదేశింప బడినవాడు పరమాత్మ కాజాలడు అనుచో అది యుక్తము కాదు. తత్ + వ్యాఖ్యాతమ్=ఆ విషయము ఇంతకు ముందే వివరింపబడినది.

వివ — “ జీవముఖ్యలింగాన్నేతి చేన్నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్ ” (బ్ర.సూ. 1-1-32) అను ఇంద్రప్రాణాధికరణసూత్రమున జీవవాచకశబ్దములు, ప్రాణాద్య చేతనవాచకశబ్దములు ఉపాస్యాదితత్త్వవాచకములుగ పేర్కొనబడినపుడు ఆ జీవ ప్రాణాదులలో అంతర్యామిగ ఉన్న పరబ్రహ్మమే ఆ శబ్దములచే బోధింపబడు నని సిద్ధాంతీకరింపబడినది. అట్లే ఈ కౌషీతక్యుపనిషత్తు నందలి అజాతశత్రుని ఉపదేశమున ఉపాస్యతత్త్వమునందు జీవలక్షణములుగోచరించినను ప్రాణాదిశబ్దములు ప్రయోగింపబడినను వానిలో అంతర్యామిగనున్న బ్రహ్మమునే గ్రహింపవలయు నని భావము.

127 సూ — అన్యార్థం తు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానామపి-చైవమేకే. (3) 1-4-18

అర్థ — జైమినిః = జైమినిః మహర్షి, ప్రశ్నవ్యాఖ్యానామపి ప్రశ్నసమాధానములవలన అన్యార్థం = ఇచట జీవుల ప్రస్తావన జీవ భిన్నుడైన పరమాత్మను బోధించుటకొరకే అని తలంచుచున్నాడు. అపిచ = మరియు, ఏవం = ఇట్లు, ఏకే = కొందరు (వాజసనేయ శాఖీయులు) స్పష్టముగ చెప్పుచున్నారు.

వివ— “క్వైష ఏతద్బాలాకే పురుషోఽశయిష్ట” (కౌ- 4-1-18) “ఓ బాలాకి! “ఈ పురుషుడు ఏచట విశ్రమించినాడు” అను ప్రశ్నకు “ అథాస్మిన్ ప్రాణ ఏవైకధా భవతి ” (కౌ. 4-19) “ఈ ప్రాణము

నందే కలిసియుండును అనిసమాధానము." ఇవి రెండును పరమాత్మనే బోధించుచున్నవి. "సతా సోమ్య తదా సంపన్నో భవతి" (ఛా- 6-8-1) ఓ సౌమ్యుడా! సుషుప్తిదశలో జీవుడు సచ్ఛబ్దవాచ్యమైన పరమాత్మతో కలిసియుండును" అనుచు ఛాందోగ్యము సుషుప్తజీవాశ్రయుడు పరమాత్మ యని బోధించుచున్నది గదా! ఇట్లే "య ఏష విజ్ఞానమయః పురుషః క్వైష తదాభూత్ కుత ఏతదాగాత్" (బృ- 4-1-16) "ఈ విజ్ఞానమయుడైన పురుషుడు సుషుప్తిదశలో ఎక్కడ నుండి నాడు? ఎక్కడనుండి జాగ్రదవస్థకు వచ్చినాడు?" అని ప్రశ్నించుకొని, "య ఏష అంతర్హృదయ ఆకాశః తస్మిన్ శేతే" (బృ-4-1-17) "హృదయమునందు గల ఆకాశమున అనగ పరమాత్మయందు శయనించినాడు "అని బృహదారణ్యకమునందును జీవబ్రహ్మములను వేరువేరుగ పేర్కొనియున్నాడు. కావున అజాతశత్రువు పేర్కొనిన ఉపాస్యతత్త్వము పరమాత్మయే అని జైమిని మహర్షి ఆశయము.

## 33 వాక్యాన్వయాధికరణము 6 (4)

"ఆత్మా వా అరే ద్రష్టవ్యః" (బృ- 4-5-6) అను వాక్యమున ద్రష్టవ్యుడుగ ఉపదేశింపబడినవాడు పరమాత్మ.

128 సూ — వాక్యాన్వయాత్ (1) 1-4-19

అర్థ — వాక్య + అన్వయాత్ = "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యోమన్తవ్యోనిదిధ్యాసితవ్యః" (బృ-6-5-6) "ఓయీ! ఆత్మను (గురించి) వినవలయును, మననము చేయవలయును, ధ్యానింపవలయును, దర్శింపవలయును" అను వాక్యమున దర్శింపదగినవాడుగ పేర్కొనబడిన ఆత్మ పరమాత్మయే. ఈ ప్రకరణమున గల వాక్యము లన్నియు పరబ్రహ్మమునందే చక్కగ సమన్వయించుటవలన.

వివ — "ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాతే ఇదం సర్వం విదితమ్" (బృ- 6-5-6) "ఓయీ! ఆత్మను గురించి విని మననము చేసి, ధ్యానించి, దర్శించినచో ఇది యంతయు తెలియ బడగలదు" అనుటచేత కారణస్వరూపము తెలియుటతోడనే కారణస్వరూపము తెలియబడగలదు అను న్యాయము ననుసరించి జగత్కారణమైన పరబ్రహ్మమే ఇచట "ఆత్మ" శబ్దముచే బోధింపబడుచున్నది. అట్లు కాని పక్షమున "ఆత్మని ఖల్వరే దృష్టే........ ఇదం సర్వం విదితమ్" ఈ మొదలైన వాక్యములు అన్వయించవు. కావుననే "నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి"(బృ-6-5-6)"పతియొక్క కోరికకై పతి ప్రియుడు అగుట లేదు. పరమాత్మయొక్క సంకల్పమునుబట్టి పతిప్రియు డగు చున్నాడు" అను వాక్యమునందును ఆత్మశబ్దము సర్వజ్ఞుడు, సత్య సంకల్పుడు నైన పరమాత్మనే బోధించుచున్నది. మనకు ప్రియులు అప్రియులు ఏర్పడుట అతని సంకల్పమువలననే గదా అని భావము.

129 సూ — ప్రతిజ్ఞాసిద్ధేర్లింగమాశ్మరథ్యః (2) 1-4-20

అర్థ — ప్రతిజ్ఞాసిద్ధేః = "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం" (ఒక దానిని తెలియుటచే సమస్తమును తెలియుట) అను ప్రతిజ్ఞ సిద్ధించుటకు, లింగం = సూచకముగ జీవాత్మవాచక మగు ఆత్మశబ్దము ఇచట పరమాత్మను బోధించుచున్నదని, ఆశ్మరథ్యః = ఆశ్మరథ్యుడను ఆచార్యుడు తలంచుచున్నాడు.

వివ — జీవుడు పరమాత్మకార్యమగుటచే పరమాత్మకంటె అనన్యుడు కావున జీవవాచకమైన ఆత్మశబ్దముచే ఇచట పరమాత్మను బోధించినా డని భావము.

130 సూ — ఉత్క్రమిష్యత ఏవంభావాదిత్యౌడులోమిః (3) 1-4-21

అర్థ — ఉత్క్రమిష్యతః = ఉత్క్రాన్తి నొందిన అనగా ముక్తుడైన జీవుడు, ఏవంభావాత్ = బ్రహ్మ మగుటవలన జీవవాచకమైన ఆత్మశబ్దముచే ఇచట పరబ్రహ్మము బోధింపబడుచున్నది. ఇతి = అని, ఔడులోమిః = ఔడులోమి అను ఆచార్యులు తలంచుచున్నారు.

వివ — జీవుడు ముక్తిదశయందు బ్రహ్మభావమును పొందుచున్నందువలన జీవవాచకమైన ఆత్మశబ్దముచే ఇచట బ్రహ్మము బోధింపబడిన దని భావము.

131 సూ — అవస్థితేరితి కాశకృత్స్నః (4) 1-4-22

అర్థ — అవస్థితేః = జీవునియందు పరమాత్మ అంతర్యామిగా ఉండుటవలన జీవవాచక మగు ఆత్మశబ్దముచే పరమాత్మ ఇచట బోధింపబడుచున్నాడు. ఇతి = అని, కాశకృత్స్నః = కాశకృత్స్నుడు అనుఆచార్యులు తలంచుచున్నారు.

వివ — "య ఆత్మని తిష్ఠన్" (బృ- 5-7-22) "ఎవడు ఆత్మయందు ఉన్నవాడై" అను శ్రుతివాక్యము జీవాత్మయందు పరమాత్మ అంతర్యామిగ నుండి అతనిని నియమించుచున్నాడు అని తెలియజేయుచున్నది. కావున జీవునియందున్న పరమాత్మను జీవవాచకమగు ఆత్మశబ్దము బోధించుచున్న దని కాశకృత్స్నమహర్షి ఆశయము. ఇదియే బాదరాయణుని సిద్ధాంతము.

## 34 ప్రకృత్యధికరణము 7 (6)

ప్రపంచోపాదానకారణము సయితము పరమాత్మయే

132 సూ — ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తానుపరోధాత్ (1) 1-4-23

అర్థ — ప్రకృతిః + చ = ఈ జగత్తునకు ఉపాదానకారణము సయితము పరబ్రహ్మయే. ప్రతిజ్ఞాదృష్టాన్త + అనుపరోధాత్ = "ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞాన" ప్రతిజ్ఞచేమృత్తికాదృష్టాన్తము బాధింపకుండుట వలన.

వివ — ఆరుణి గురుకులమునుండి వచ్చిన తనకుమారుడు శ్వేతకేతువును చూచి " స్తబ్ధోస్యుత తమాదేశమ ప్రాక్ష్యః. యేనా శ్రుతం శ్రుతం భవతి అమతం మతం అవిజ్ఞాతం విజ్ఞాతం" (ఛా- 6-1-3) "ఓ శ్వేతకేతూ! నిశ్చలముగ నున్నావు. దేనిని విన్నంత మాత్రమున అన్నింటిని వినినట్లగునో, దేనిని మననముచేసిన అన్నిం టిని మననము చేసినట్లగునో, దేనిని తెలిసికొనిన అన్నింటిని తెలిసి నట్లగునో, ఆ తత్త్వమును అడిగి తెలిసికొంటివా?" అనిప్రశ్నించినాడు శ్వేతకేతువు ఆ తత్త్వమునుగూర్చి మా గురువులు నాకు బోధింప లేదు. నీవు బోధింపు మని తండ్రిని ప్రార్థింపగా ఆరుణి అతనికి ఇట్లు బోధించుచున్నాడు. "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మ యం విజ్ఞాతం స్యాత్" (ఛా- 6-1-4) "మట్టిముద్దను తెలిసికొనినచో దానితో తయారైన వస్తువు అన్నియు మట్టి అని తెలిసినట్లు, ఈ జగత్తునకు కారణమైన సత్తత్వమును తెలిసికొనినచో ఈ ప్రపంచ మంతయు " సత్ " అనబడు పరమాత్మయొక్క కార్య మని తెలియ గలదు. " ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వ మసి శ్వేతకేతో " (ఛా- 6-1-14) "ఇది యంతయు బ్రహ్మాత్మకము బ్రహ్మము దీనికంతటికి ఆత్మ. శ్వేతకేతూ! నీవును అదియే అయి ఉన్నావు" అని ఉపదేశించినాడు. దీని భావమేమనగ చిదచిత్తులలో అంతర్యామి, పరమాత్మ అతనికి చిదచిత్తులు శరీరము. ఇట్లు చిద చిద్విశిష్టమైన పరమాత్మయే సూక్ష్మదశయందు కారణ మని, స్థూల దశయందు కార్య మని వ్యవహరింపబడుచున్నాడు. ఈ విషయము

శాస్త్రముచేతనే తెలియదగియున్నది. పరబ్రహ్మము నిర్వికారముగదా!
అది జగద్రూపమున ఎట్లు పరిణమించును? పరిణమించిన గాని అది
ఉపాదానకారణము కాజాలదు. కావున నిర్వికారమైన బ్రహ్మమును
జగత్తునకు ఉపాదానకారణముగ చెప్పుట అసంగతము అనినచో
వాస్తవమున బ్రహ్మము నిర్వికారమే. కాని, అది అన్నిదశలయందును
చిదచిచ్ఛరీరకముగ నుండుటచే ఆ బ్రహ్మమునకు శరీరభూతము
లైన చిదచిత్తులు వికారాస్పదము అగుచున్నవి. కావున బ్రహ్మము
యొక్క నిర్వికారత్వమునకు ఎట్టి బాధయు లేదు. ఈ రీతిగ జగత్తు
నకు ఉపాదానకారణము సయితము పరబ్రహ్మమే.

133 సూ — అభిధ్యోపదేశాచ్చ (2) 1-4-24

అర్థ— అభిధ్యా + ఉపదేశాత్ + చ = "తదైక్షత బహుస్యాం
ప్రజాయేయేతి" (ఛా- 6-2-3) "సచ్ఛబ్దవాచ్యమైన ఆ పరబ్రహ్మము
తాను బహురూపముల జనింపవలయునని సంకల్పించినది"అని చెప్పుట
వలనను ఈజగత్తునకు నిమిత్తకారణము, ఉపాదానకారణము రెండును
పరబ్రహ్మమే యని స్పష్టమగుచున్నది.

134 — సాక్షాచ్చోభయామ్నానాత్ (3) 1-4-25

అర్థ — సాక్షాత్ = సాక్షాత్తుగ (స్పష్టముగ) ఉభయ + ఆమ్నా
నాత్ + చ = ప్రపంచమునకు నిమిత్తకారణము, ఉపాదానకారణము
బ్రహ్మమే యని వేదము చెప్పుటవలనను ఈ విషయము సిద్ధించు
చున్నది.

వివ — "బ్రహ్మ వనం బ్రహ్మ స వృక్ష ఆసీత్ యతో ద్యావా
పృథివీ నిష్టతక్షుః బ్రహ్మాధ్యతిష్ఠత్ భువనాని ధారయన్ (తై. బ్రా-
2 అష్ట. 8 ప్ర. 9 అను) "బ్రహ్మమే వనము. బ్రహ్మమే వృక్షము.
దానినుండియే ఈ ద్యావాపృథువులు చెక్కబడినవి"అనుటచే బ్రహ్మము

ఉపాదానకారణమనియు, "ఈ భువనములను బ్రహ్మము ధరించి యున్నది" అనుటచే అది నిమిత్తకారణ మనియు స్పష్టమగుచున్నది.

135 సూ — ఆత్మకృతేః (4) 1-4-26

అర్థ — ఆత్మకృతేః = "తదాత్మానం స్వయమకురుత" (తై. ఆ- 7-1) "ఆ బ్రహ్మము తనను స్వయముగ జగత్తుగ చేసి కొనినది" అను శ్రుతి పరబ్రహ్మమే జగద్రూపమును పొందినట్లు చెప్పుటవలన ప్రపంచమునకు నిమిత్తోపాదాన కారణములు రెండును పరబ్రహ్మమే అని స్పష్టమగుచున్నది.

136 సూ — పరిణామాత్ (5) 1-4-27

అర్థ — పరిణామాత్ = బ్రహ్మము జగద్రూపమున పరిణమించు చున్నదని శ్రుతులవలన తెలియుటచేతను బ్రహ్మము జగదుపాదాన కారణము.

వివ — అవిభక్తనామరూపములైన అతిసూక్ష్మ చిదచిద్వస్తువు లను శరీరమున గలిగియుండి కారణదశలో నున్న పరమాత్మ "సోఽ కామయత బహుస్యాం ప్రజాయేయ" (తై. ఆ- 6-2) "విభక్తనామ చిదచిద్వస్తు శరీరకుడను కావలయు" నని సంకల్పించి, "ఇదం సర్వ మసృజత యదిదం కించ." "దీనినంతటిని సృజించెను." అనగ తనకు శరీరభూతములైన సూక్ష్మచిదచిత్తులను విభజించి "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్." ఇట్లు విభజింపబడిన చిదచిత్తులయందు తాను అంతరాత్మగా ప్రవేశించి, చేతనాచేతనాత్మక ప్రపంచముగ పర బ్రహ్మము పరిణమించినది. (సచ్చత్యచ్చాభవత్) అను శ్రుతి బ్రహ్మము జగద్రూపమున పరిణమించుచు, జగత్తునకు ఉపాదాన కారణ మగుచున్నదని స్పష్టము చేయుచున్నది.

శ్రీ శంకరుల భాష్యమున 26వ 27 వసూత్రములు రెండును ఒకే సూత్రముగ చూపబడినవి.

187 సూ — యోనిశ్చ హి గీయతే (6) 1-4-28

అర్థ — యోనిః + చ = బ్రహ్మము జగత్తునకు యోనిగను (ఉపాదాన కారణముగను) గీయతే హి = కీర్తింపబడుచున్నది గదా!

వివ — "యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" (ము-1-1-6) "భూతయోనియైన బ్రహ్మమును ధీరులు దర్శింతురు" అనుచు పరబ్రహ్మము జగదుపాదాన కారణముగ కీర్తింపబడుచున్నది. ఈ కారణములచేత ప్రపంచమునకు నిమిత్తోపాదాన కారణములు రెండును పరబ్రహ్మమే అని వేదాన్త సిద్ధాంతము.

## 35 సర్వవ్యాఖ్యానాధికరణము 8

188 సూ — ఏతేన సర్వే వ్యాఖ్యాతాః వ్యాఖ్యాతాః 1-4-29

అర్థ — ఏతేన = "జన్మాద్యస్య యతః" (బ్ర.సూ. 1-1-2) అను సూత్రమునుండి క్రిందటి సూత్రమువరకు శ్రుతివాక్యములకు కావించిన వ్యాఖ్యానముచే, సర్వే = తక్కిన రుద్రహిరణ్యగర్భాదిపద ఘటితములై, కారణత్వబోధకములైన వేదాంత వాక్యములన్నియు వ్యాఖ్యాతాః = పరబ్రహ్మపరములుగ వ్యాఖ్యానింపబడినవి.

ఈ సూత్రమున "వ్యాఖ్యాతాః" అను పదమును అభ్యసించుట (అనగ రెండుమార్లు ఉచ్చరించుట) అధ్యాయసమాప్తిని తెలియజేయుచున్నది.

ప్రథమాధ్యాయ చతుర్థపాదము సమాప్తము.

ప్రథమాధ్యాయము సంపూర్ణము.

## ప్రథమాధ్యాయ చతుర్థపాదార్థ సంగ్రహశ్లోకము

శ్లో॥ సాంఖ్యోక్త ప్రక్రియోక్తే స్తదభిమతసృజేస్తత్త్వసంఖ్యానక్లప్తేః
తత్రోక్త్వావ్యాకృతైక్యాత్స్వవృజినవచనాత్తత్ఫలావద్యయోగాత్।
భేదాత్కర్త్రుప్రకృత్యోర్ద్రుహిణశివముఖానేకహేతుశ్రుతేశ్చ,
క్షిప్తం పాదత్రయోక్తం శ్రుతిహృదయసముద్ఘాటనాదవ్యరక్షత్ ॥

తా — అనుమానికాధికరణమునందు "మహతః పరమవ్యక్తం" (కఠ– 1-3-10) అను వాక్యమున గల అవ్యక్తశబ్దము ప్రకృతిని బోధించుటచే ప్రధానమే జగత్కారణము అను పక్షమును– చమసాధికరణమునందు "అజామేకాం" (శ్వేత– 4-5) అను వాక్యమున గల "అజా" శబ్దము కేవలప్రకృతియే జగత్కారణము అని బోధించుచున్నది అను పక్షమును– సంఖ్యోపసంగ్రహాధికరణమునందు "పంచ పంచజనాః" (బృ– 4-4-2) అను పదము సాంఖ్యుల ఇరువదియైదు తత్త్వములను బోధించుచున్నది అను పక్షమున– కారణత్వాధికరణమునందు– "తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్" (బృ- 3-4-7) అను వాక్యమున గల "అవ్యాకృత" శబ్దము ప్రకృతివాచకము అను పక్షమును– జగద్వాచిత్వాధికరణమునందు "యో వై బాలక ఏతేషాం పురుషాణాం కర్తా యస్య వై తత్కర్మ" (కౌషీత- 4-1-8) అను వాక్యమున గల కర్మ శబ్దము జీవుల పుణ్యపాపరూప కర్మవాచకము అనుటచేత అచట ఉపాస్యుడుగ పేర్కొనబడిన పురుషుడు సాంఖ్యుల ఇరువదియైదవతత్త్వమైన పురుషుడు అనుపక్షమును– వాక్యాన్వయాధికరణమునందు పరబ్రహ్మ జగత్కారణ మను పక్షమున "నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియోభవతి........ ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియంభవతి" (బృ– 6-5-6) ఇత్యాది వాక్యముచే తెలుప

బడు "పతిపుత్రాది" రూపకర్మఫలదోషసంబంధము అతనికి ఏర్పడును అను పక్షమును– ప్రకృత్యధికరణమునందు ప్రపంచసృష్ట్యాదులకు నిమిత్త, ఉపాదానకారణములు భిన్నములు అను పక్షమును– నరపి వ్యాఖ్యానాధికరణము నందు "హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే" (తై.నా.రా), "నసన్న చాసత్ శివ ఏవ కేవలః" (శ్వేతా) ఇత్యాది శ్రుతివాక్యములు బ్రహ్మరుద్రాదులను జగత్కారణ మని బోధించు చున్నవి అనుపక్షమును– సయుక్తికముగ ఖండించి ఈ అధ్యాయము నందలి మొదటి మూడుపాదములచే స్థాపించబడిన "పరబ్రహ్మ శ్రీమన్నారాయణుడే, జగత్కారణమును" అను వేదాన్తసిద్ధాంతమును స్థిరీకరించిరి.



శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# ద్వితీయాధ్యాయము (అవిరోధాధ్యాయము)

## ప్రథమపాదము — స్మృతిపాదము

### 36 స్మృత్యధికరణము 1 (2)

సాంఖ్యస్మృతి అవైదిక మగుటచే ప్రమాణము కాదు.

139 సూ— స్మృత్యనవకాశదోషప్రసంగ ఇతిచేన్నాన్యస్మృత్య నవకాశదోషప్రసంగాత్ (1) 2-1-1

పద — స్మృతి + అనవకాశదోషప్రసంగః, ఇతిచేత్, న, అన్య స్మృతి + అనవకాశదోష ప్రసంగాత్.

అర్థ — స్మృతి + అనవకాశదోషప్రసంగః ఇతిచేత్ = తత్త్వ ప్రతిపాదక మగు సాంఖ్యసిద్ధాంతమును అంగీకరింపని యెడల అది నిరుపయోగము కావలసివచ్చును గదా! అనినచో, న = అట్లు కాదు. అన్యస్మృతి + అనవకాశదోషప్రసంగాత్ = బ్రహ్మము జగత్కారణము అను సాంఖ్యేతరములైన మన్వాదిస్మృతులు నిరుపయోగములు కావలసివచ్చును. కావున మన్వాది స్మృతులకు విరుద్ధమైన సాంఖ్య స్మృతిని అంగీకరింపరాదు.

వివ— కపిలమహర్షి సాంఖ్యమతమునకు ప్రవర్తకుడు. అతడు ప్రధానము జగత్కారణము అని చెప్పినాడు. అతని సాంఖ్యస్మృతి కేవల తత్త్వప్రతిపాదకపరము. కావున ఆ సిద్ధాంతమును అంగీకరిం పని యెడల అది నిరవకాశమగును గదా! అని పూర్వపక్షి ఆశయము. కాని, సాంఖ్యస్మృతి మన్వాదిస్మృతులకు విరుద్ధమైనది. సాంఖ్యస్మృతిని ప్రమాణముగ అంగీకరించినచో మన్వాదిస్మృతులు నిరవకాశములగును

మన్వాదిస్మృతులు ఉపనిషత్సిద్ధాంతమునకు అనుకూలము లైనవి. ఉపనిషత్తులు, మన్వాదిస్మృతులు, సర్వజ్ఞము, సర్వశక్తము నైన పర బ్రహ్మము జగత్కారణము అని బోధించుచున్నవి మఱియు "యద్వై కిఞ్చ మనురవదత్ తద్భేషజమ్" "మనువు ఏది పల్కిన అది ఔషధము" అని మనుస్మృతి ప్రశంసింపబడియున్నది. కావున మన్వాదిస్మృతుల ననుసరించి బ్రహ్మకారణతావాదమునే అంగీకరింపవలయును.

140 సూ — ఇతరేషాం చానుపలబ్ధేః (2) 2-1-2

అర్థ — ఇతరేషాం = కపిలమహర్షికంటె ఇతరులైన మన్వాదుల మతములలో, అనుపలబ్ధేః + చ = కేవలప్రధానమే జగత్కారణము అను సిద్ధాంతము చూపట్టకపోవుటవలనను సాంఖ్యసిద్ధాంతము ప్రమాణము కాదు.

## 37 యోగప్రత్యుక్త్యధికరణము 2

యోగమతము సయితము ప్రమాణము కాదు.

141 సూ — ఏతేన యోగః ప్రత్యుక్తః 2-1-3

అర్థ — ఏతేన = ఈ సాంఖ్యస్మృతి నిరాసముచేత స యోగః = యోగస్మృతియు, ప్రత్యుక్తః = నిరాకరింపబడినది.

వివ — సాంఖ్యులు ఈశ్వరుని అంగీకరింపరు. యోగమతస్థులు ఈశ్వరుని అంగీకరించినను, అతడు ప్రపంచమునకు నిమిత్తకారణమని అందురు. ఇది వేదాంతసిద్ధాంతమతమునకు విరుద్ధ మగుటచే యోగమతము సయితము అప్రామాణిక మగుచున్నది. జగత్తునకు నిమిత్తోపాదానకారణములు రెండును పరబ్రహ్మమే యని వేదాంత సిద్ధాంతము.

## 38 విలక్షణత్వాధికరణము 3 (9)

### బ్రహ్మకారణతావాదమున ఆక్షేపపరిహారములు

142 సూ— న విలక్షణత్వాదస్య తథాత్వం చ శబ్దాత్ (2) 2-1-4

అర్థ — విలక్షణత్వాత్ = కారణమైన పరబ్రహ్మముకంటె కార్యమైన జగత్తు విలక్షణమైనందువలన, న = జగత్తు బ్రహ్మకార్యము కాదు. అస్య = ఈ జగత్తునకు, తథాత్వమ్ = బ్రహ్మముకంటె వైలక్షణ్యము, శబ్దాత్ + చ = "విజ్ఞానం చ అవిజ్ఞానం చ" (తై. ఆ. 6) "విజ్ఞానము నయి అవిజ్ఞానము నయి" మొదలైన వేదవాక్యముల వలనను తెలియుచున్నది.

వివ — సుఖదుఃఖసమ్మిశ్రమై, చిదచిన్మిశ్రమైన ఈ జగత్తు బ్రహ్మమునకు విరుద్ధమైన స్వభావము కలిగియున్నది. కావున కార్యకారణములకు ఉండవలసిన సారూప్యము బ్రహ్మమునకును, జగత్తునకును లేనందువలన బ్రహ్మము జగత్కారణము కాజాలదు.

143 సూ — అభిమానివ్యపదేశస్తు విశేషానుగతిభ్యామ్ (2) 2-1-5

అర్థ — అభిమానివ్యపదేశః + తు = "తం పృథివ్యబ్రవీత్" (యజు. వే. 5 కాం. 5-2) "అతనిని గురించి పృథివి పలికినది" ఈ మొదలైన వేదవాక్యములు పృథివ్యాద్యభిమానిదేవతలను పురస్కరించుకొని ప్రయుక్తములైనవి. విశేష + అనుగతిభ్యామ్ = "హన్తాహమిమాస్తిస్రో దేవతాః" (ఛా-6-3-2) "తేజస్సు, జలము, భూమి అను ఈ ముగ్గురుదేవతలను అనుప్రవేశించి" అను వాక్యమున దేవతాశబ్దమును పృథివ్యాదులకు విశేషముగ ప్రయోగించుటవలనను, "అగ్నిర్వాగ్భూత్వాముఖం ప్రావిశత్" (ఐత- 2-4) "అగ్ని వాక్కు

అయి ముఖమును ప్రవేశించును." ఈ మొదలైన వేదవాక్యములు అగ్న్యాదులకు వాగాదులయందు అనుప్రవేశమును చెప్పుటవలవను కేవల పృథివ్యాదులు అచేతనములే. అచేతనములైన అట్టి పృథివ్యాదులు జ్ఞానస్వరూపమైన బ్రహ్మముయొక్క కార్యము కాజాలవు. కావున బ్రహ్మము జగదుపాదానకారణము కాదు అని పూర్వపక్షము.

144 సూ — దృశ్యతే తు (3) 2-1-6

అర్థ — దృశ్యతే + తు = పరస్పరము విలక్షణములైన కార్య కారణములు లోకమున చూపట్టుచున్నవి. కావున తనకంటె విలక్షణమైన జగత్తునకు బ్రహ్మము కారణమగుటలో విప్రతిపత్తి లేదు. భ్రమరమునుండి కీటకము పుట్టుట ఇందులకు ఉదాహరణము.

145 సూ — అసదితిచేన్న ప్రతిషేదమాత్రత్వాత్ (4) 2-1-7

అర్థ — అసత్ + ఇతిచేత్ = కార్యకారణములు పరస్పరము విలక్షణము అగు పక్షమున కారణమునందు కార్యము ఉండదు అను అసత్కార్యవాదులను అంగీకరింపవలసి వచ్చును గదా! అనినచో, న = అట్టి అవసరము లేదు. ప్రతిషేధమాత్రత్వాత్ = కార్య కారణములకు సారూప్య నియమములను మాత్రమే ప్రతిషేధించుటవలన.

వివ — కారణమునందు కార్యము సూక్ష్మరూపమున నుండునని సత్కార్యవాదులమతము. వేదాంతులు సత్కార్యవాదులు. కార్య కారణములు విలక్షణములై యుండుపక్షమున కారణమునందు కార్యము లేనట్లేగదా! అనిపూర్వపక్షము. కార్యకారణములలో వైలక్షణ్యమున్నంత మాత్రమున వాని కార్యకారణభావమునకు విరోధములేదు. కారణ దశలో నున్న వస్తువే విలక్షణమగు మరియొకరూపముతో కార్య మగు

చున్నది. కావున సత్కార్యవాదమునకు గాని, జగత్తు బ్రహ్మ కార్య మనుటలో గాని విప్రతిపత్తి లేదు.

146 సూ — అపీతౌ తద్వత్ప్రసంగాదసమంజసమ్ (5)2-1-8

అర్థ— అపీతౌ = ప్రత్యయమునందు, తద్వత్ + ప్రసంగాత్= జగత్తునందలి దోషములు బ్రహ్మమునందు ఏర్పడవలసియుండుట వలన, అసమంజసమ్ = బ్రహ్మము జగత్కారణ మను వాదము సమంజసము కాదు.

వివ—జగత్తునకు బ్రహ్మము కారణమగు పక్షమున ప్రళయము నందు జగత్తునందలి దోషము లన్నియు బ్రహ్మమునందు సంక్రమిం చును. కావున బ్రహ్మకారణతావాదము అసమంజసము అని పూర్వపక్షము.

147 సూ — నతు దృష్టాన్త భావాత్ (6) 2-1-9

అర్థ — నతు = పై వాదము సరికాదు. దృష్టాన్తభావాత్ = జగత్తుయొక్క దోషములు బ్రహ్మమున కంటవనుటకు దృష్టాన్త ముండుటవలన.

వివ — చిదచిదాత్మకమైన ఈ ప్రపంచము పరబ్రహ్మము నకు శరీరము. పరబ్రహ్మము దీనికి అంతర్యామి. కారణదశయ దును ఈ శరీరాత్మకభావము జగద్బ్రహ్మములకు అనువర్తించును. బాల్య యౌవనాదిదశలవలన కలుగు పరిణామములు శరీరమాత్రనిష్ఠములై, ఆత్మకు ఏ విధముగ అంటవో, అటే విధముగ బ్రహ్మకు శరీరములైన చేతనాచేతనముల దోషములు ఏ దశయందును బ్రహ్మమునకు అంటవు అని భావము.

148 — స్వపక్షదోషాచ్చ (7) 2-1-10

అర్థ — స్వపక్షదోషాత్ + చ = సాంఖ్యునకే తన పక్షమైన ప్రధానకారణతావాదమునందు ఈ అసామంజస్యము ఉండుటవలనను ప్రధాన కారణతావాదము గ్రాహ్యము కాదు,

వివ — నిర్వికారుడైన పురుషుడు ప్రకృతి సాన్నిధ్యమునందు దాని కర్తృత్వాది ధర్మములను తనయందు అధ్యవసించుకొనుటచేత జగత్ప్రవృత్తి ఏర్పడుచున్నదని సాంఖ్యుని మతము. ప్రకృతియు పురుషసాన్నిధ్యమున ఆతని చైతన్యధర్మమును తనయందు అధ్యవసించుకొని, జగత్ప్రవృత్తికి కారణమగుచున్నదని సాంఖ్యుడుతలంచును. కాని, అచేతనమైన ప్రకృతియందు చైతన్యాధ్యాస కాని, నిర్వికారుడైన పురుషునియందు వికృతిధ్యాస కాని అనంగతము. ప్రకృతి పురుషుల పరస్పరసాన్నిధ్యము ఎప్పుడును ఉండుటచేత ముక్తపురుషునియందును ఈ అధ్యాసనను అంగీకరింపవలసివచ్చును. అప్పుడిక అతనికి ముక్తి ఎక్కడిది? కవున సాంఖ్యుని ప్రధానకారణవాదము అసంమజసము. బ్రహ్మకారణవాదమే సమంజసము,

149 సూ — తర్కాప్రతిష్ఠానాదపి (8) 2-1-11

అర్థ — తర్క + అప్రతిష్ఠానాత్ + అపి = తర్కము స్వతంత్రముగ నిలవజాలక పోవుటవలనను కేవలతర్కమూలకమైన సాంఖ్యమతము ప్రమాణము కాదు.

వివ — తర్కమునకు స్థిరత్వము లేదు. బలవత్తరములైన యుక్తులచే తర్కము క్షణక్షణమునను బలహీనమగును. ఇట్టి కేవల తర్కముతో ప్రధానవాదమును సాంఖ్యులు ప్రవచించిరి. దీనిని బౌద్ధులు తమ తర్కబలముతో నిరసించిరి. బౌద్ధతర్కమును వైదికులు ఖండించిరి. కావున కేవల తర్కము ఏ అంశమును నిర్ధారణ

చేయజాలదు. కావున వైదికులు, వేదానుకూల తర్కమునే గ్రహించి, బ్రహ్మకారణవాదమును అంగీకరించిరి.

150 సూ — అన్యథానుమేయమితిచేదేవమప్యనిర్మోక్షప్రసంగః (?) 2-1-12

అర్థ — అన్యథా = మరియొక విధముగ. అనుమేయం = ప్రధానకారణవాదమును అనుమాన ప్రమాణము ద్వారా తెలిసికొనవల వలయును. ఇతిచేత్ = అనినచో, ఏవమపి = ఇట్లైనను, అనిర్మోక్ష ప్రసంగః = విముక్తి లేదు.

వివ — అనుమానము ద్వారా సాంఖ్యుని ప్రధానకారణవాదమును సాధింతుమన్నను తర్కసహకారము లేనిదే అనుమానము సిద్ధింపదు. కావునను కేవల తర్కము నిలకడ లేని దగుటవలనను ప్రధానకారణవాదము సమంజసము కాదు.

శ్రీ శంకరులు ఈ పాదమునందలి 11వ, 12వ సూత్రములను రెండింటిని కలిపి ఒక్కటిగా గైకొనిరి. మరియు, 12వ సూత్రమున "అనిర్మోక్ష" పదమునకు మారుగా "అవిమోక్ష" అను పదమును ఆదరించిరి.

## 39 శిష్టపరిగ్రహాధికరణము 4

శిష్టులు పరిగ్రహింపని కణాదాది మతములు అప్రామాణికములు.

151 — ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః 2-1-13

అర్థ — ఏతేన = ఈ సాంఖ్యమతనిరాకరణముచేత, శిష్ట + అపరిగ్రహాః + అపి = వైదికులచే పరిగ్రహింపబడని కణాదగౌతమ మతములు కూడ, వ్యాఖ్యాతాః = కేవల తర్కమూలము లగుటచే నిరసనీయములుగ వ్యాఖ్యానింపబడినది.

శ్రీశంకరులు ఈసూత్రమునగల శిష్టాపరిగ్రహాః అను అసమాస పదమును శిష్టాః అపరిగ్రహాః అనురెండువ్యస్తపదములుగ స్వీకరించిరి.

## 40 భోక్త్రాపత్త్యధికరణము 5

పరమాత్మ జగచ్ఛరీరకుడైనను జీవునివలె సుఖదుఃఖభోక్త కావవసరము లేదు.

152 సూ — భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్ 2-1-14

అర్థ— భోక్త్ర + ఆపత్తేః = " బ్రహ్మము చేతనాచేతనశరీరక మైనచో సుఖదుఃఖాదిభోక్త కావలసియున్నందువలన, అవిభాగః + చేత్ = జీవులకును, బ్రహ్మమునకును భేదము లేకపోవును అనినచో, స్యాత్ = ఆ భేదము ఉండును. లోకవత్ = లోకమునందువలె.

వివ — లోకమున దండించువాడు దండింపబడువాడు ఇద్దరు సశరీరులైనంతమాత్రమున దండింపబడువానికిగల్గు బాధలు దండించు వానికి ఎట్లు కలుగవో అట్లే పరమాత్మ చేతనాచేతన శరీరకుడైనను చేతనాచేతన గతదోషములు అతనికి సంక్రమింపవు. కర్మవశ్యమైన శరీరమునుబట్టియే జీవునికిని సుఖదుఃఖాది భోగము సంభవించు చున్నది. ముక్తపురుషుడు అకర్మవశ్యశరీరము గల్గి (స ఏకధా భవతి త్రిధా భవంతి (ఛా- 7-26-2) యున్నను అతనికి దుఃఖాను భవము లేదు గదా! కావున జీవపరభేదము నిరాబాధము.

## 41 ఆరంభణాధికరణము 6

కార్యకారణములు అభిన్నములు.

153 సూ — తదనన్యత్వమారంభణశబ్దాదిభ్యః (1) 2-1-1

అర్థ — తత్ + అనన్యత్వం = ఈ జగత్తు తనకు కారణమైన పరబ్రహ్మముతో అభిన్నమైనదను విషయము, ఆరంభణ శబ్ద + ఆదిభ్యః = "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" (ఛా- 6-1-5) ఈ మొదలైన "ఆరంభణ, శబ్దముతో ప్రారంభమగు శ్రుతివాక్యములవలన తెలియుచున్నది.

వివ — "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" (ఛా- 6-1-5) ఆరభ్యతే ఇతి ఆరంభణం = ఆలంభనం, అనగా స్పృశింపబడునది అని అర్థము. వికారమనగా ఉపాదాన కారణమైన మృత్తికాదులు ఘటాదిరూపమున పరిణమించుట. నామ ధేయ మనగా ఘటము పటము మొదలగు నామములు అని అర్థము. ఇట్లు ఘటాదిరూపవికారము, ఘటము పటము మొదలగు నామ ధేయము "నీళ్ళు తీసికొని రమ్ము" మొదలైన వాగ్వ్యవహారము సిద్ధించుటకై మృత్తికనే స్పృశించుచున్నవి అని భావము. లోకమున ఒకడు నీళ్లు తెమ్మని ఆదేశింపగ మరియొకడు కుండతో నీళ్ళను తెచ్చును. ఇచట కుండ అనునది నీళ్లు తెచ్చుటకు అనువైన ఆకారము గల మట్టియే గదా! మట్టియే కుండగ రూపొందింపబడినది. ఆ రూపమునుబట్టియే ఆ మట్టికి "కుండ" అను పేరు పెట్టబడినది. కావున ఆ మట్టికి వికారనామధేయములు వ్యవహారసిద్ధికై ఏర్పడినవి. ఇచట కుండ మట్టికంటె భిన్నమైనదికాదు గదా! కుండ కార్యము కాగా మట్టి దానికి ఉపాదానకారణ మగుచున్నది. ఇదే విధముగ పరబ్రహ్మమే జగద్రూపమున పరిణమించుటచే పరబ్రహ్మము జగత్తు అభిన్నములు. కాని కొందఱు కార్యకారణములు భిన్నములని అందురు. ఉదాహరణమునకు మట్టి-కుండ అనువానిని తీసికొందము. మట్టిని మట్టి అని అందుము. కుండని కుండ అనిఅందుము. శబ్దములు మారినవిగదా!

ఇట్లే కుండ ఉన్నదా యని అడిగినచో అచట దానికి ఉపాదానకారణమైన మట్టియున్నను కుండ లేదు అనియే సమాధానము చెప్పుదుము. కుండవలన కలుగు ఉపయోగములు మట్టివలన కలుగవు గదా! అని వీరి ఆశయము. కాని వేదాంతులు కార్యకారణములలో నామరూపాది భేదమున్నను అవి అభిన్నములని భావింతురు. ఇదియే యుక్తము.

154 సూ — భావే చోపలబ్ధేః (2) 2-1-16

అర్థ — భావే చ = కార్యదశయందును ఉపలబ్ధేః = కారణ ద్రవ్యము చూపట్టుచున్నందువలన కార్యకారణములు అభిన్నములు.

వివ — ఘటరూపకార్యముగ పరిణమించిన దశయందును మట్టి చూపట్టుచునే యున్నది గదా! కావున కార్యమైన ఘటము తనకు కారణమైన మట్టికంటె ఎట్లు భిన్నమగును? కావున కార్యకారణములు అభిన్నములు. అందుచేతనే బ్రహ్మకార్యమైన జగత్తు బ్రహ్మముకంటె భిన్నము కాదు.

155 సూ — సత్త్వాచ్చావరస్య (3) 2-1-17

అర్థ — అవరస్య = కార్యము, సత్త్వాత్ + చ = తన కారణమునందు ఉండుటవలనను కార్యకారణములు అభిన్నములు.

వివ — కారణమునందు అవ్యక్తముగ కార్యము ఉండును. కారణమునందు లేనిచో అది దాని కార్యమెట్లగును? వ్యక్తదశను కార్యమనియు అవ్యక్తదశను కారణమనియు అందురు. అంతమాత్రమున కార్యకారణములు భిన్నములు కావు.

156 సూ — అసద్వ్యపదేశాన్నేతిచేన్న ధర్మాన్తరేణ వాక్యశేషాద్యుక్తేశ్శబ్దాన్తరాచ్చ (4) 2-1-18

పద — అసత్ + వ్యపదేశాత్, న, ఇతి చేత్, ధర్మ + అన్త రేణ, వాక్యశేషాత్, యుక్తేః, శబ్ద + అన్తరాత్, చ

అర్థ— అసత్ + వ్యపదేశాత్ = "అసదేవేదమగ్ర ఆసీత్ (ఛా- 6-2-1) ఈ ప్రపంచము సృష్టికి పూర్వము అసత్తుగ (లేనిదిగ) ఉండినది. మొదలైన వాక్యములందు జగత్తు సృష్టికి పూర్వము లేదని చెప్పుటవలన, న + ఇతిచేత్ = కారణమునందు కార్యముండును అని చెప్పుట యుక్తము కాదు. అనచో, న = అట్లు కాదు. ధర్మ + అన్త రేణ = సృష్టికి పూర్వము ఈ ప్రపంచము స్పష్టముగ గోచరింపక పోయినను సూక్ష్మావస్థయను రూపాంతరముతో నుండుటచేతను. వాక్యశేషాత్ = "తదస దేవ సన్మనో కురుత స్యామితి" (యజు. 2 అష్ట- 2-8) ఆ అసత్తైనదే సత్తు కావలయు నని సంకల్పించినది. అను తరువాతి వాక్యమువలన ఆ అసత్తే సంకల్పించినట్లు తెలియుట వలనను, యుక్తేః = ఘటము ఉన్నది, ఘటము లేదు అను వ్యవహారము అట్టి నామరూపములు గల మృత్తికనుబట్టియే గాని కేవల మృత్తికనుబట్టి కాదు అను యుక్తివలనను శబ్ద + అన్తరాత్ + చ= "స దేవ సోమ్యేదమగ్ర ఆసీత్" (ఛా- 6-2-1) ఈ ప్రపంచము సృష్టికి పూర్వము సత్తుగ ("సత్" అని మాత్రమే చెప్పదగినదశలో) ఉండినది అను మరియొక వేదవాక్యమువలన జగత్కారణవస్తువు "సత్తు, అని తెలియుటవలనను జగద్రూపకార్యము బ్రహ్మరూప కారణమునందు ప్రళయకాలమున అస్పష్టముగ సూక్ష్మరూపముతో ఉన్నదని అంగీకరింపవలయును.

వివ — "అసదేవేదమగ్ర ఆసీత్ (ఛా- 6-2-1) ఇదం వా అగ్రే నైవ కించనాసీత్ (యజు. 2. అష్ట- 2-8) మొదలైన వేద

వాక్యములు జగద్రూపకార్యము సృష్టికి పూర్వము లేదని స్పష్టముగ చెప్పుటచేత వేదాంతులును అసత్కార్యవాదములను అంగీకరింపవల యును అని పూర్వపక్షము. దీనికి సమాధానము పై వేదవాక్యముల యందుగల అసత్తనుపదమునకు పూర్తిగా లేనిది అని అర్థము కాదు. ఆ అసత్తే జగద్రూపమును తల్పవలయునని సంకల్పించిన దని తరువాతి వాక్యము చెప్పుచున్నదిగదా! కావున "అసత్తుఅనగ దర్శించు టకు సాధ్యము కానంతటి సూక్ష్మదశలో నున్న దనియే అర్థము. ఇట్లే ఘటము లేదు అను నపుడు దాని ఉపాదానకారణమైన మృత్తిక లేదు అని అర్థము కాదుగదా! ఆ మృత్తికయందు ఘటము సూక్ష్మా వస్థలోనున్నది. స్థూలావస్థలో లేనందువలన ఘటము లేదని అను చున్నాము. కావున ప్రపంచము ప్రళయకాలమున సూక్ష్మావస్థయను మరియొక రూపముతో పరబ్రహ్మమునందు లీనమై యున్నదని గ్రహింపవలయును. "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్"అను వేదవాక్యము సృష్టికి పూర్వము ఈ ప్రపంచము సద్రూపమున నున్నట్లు చెప్పుట వలన పై "అసత్"అను పదమునకు స్పష్టముగ గోచరింపనిది అనియే అర్థము. కావున ప్రపంచము తనకు కారణమైన బ్రహ్మమునందు ఏదో ఒకరూపముతో సర్వదా ఉండుటచేత కార్యకారణములు అభిన్నములు.

శ్రీ శంకరుల భాష్యమున ఈ సూత్రము రెండు సూత్రములుగ చూపబడినది. "అసద్వ్యపదేశాత్.... వాక్యశేషాత్" అనునది ఒక సూత్రముగను "యుక్తేః శబ్దాంతరాచ్చ" అనునది వేరొక సూత్రము గను వ్యాఖ్యానింపబడినది.

157 సూ — పటవచ్చ (రే) 2-1-19

అర్థ— పటవత్ + చ= వస్త్రమువలెను జగత్తు బ్రహ్మాభిన్నము

వివ — నూలు పడుగుపేకలుగా నేయబడి వస్త్ర మగుచున్న ది

నూలుకు మించి వస్త్రమునందు వేరొక వస్తువు ఏదియు లేదు. వస్త్రము తయారగుటకు ముందు వస్త్రము లేదు, అనినచో దానికి కావలసిన నూలు కూడ లేదని అర్థము కాదు గదా! కావున నూలు వస్త్రము ఎట్లు అనన్యములో అట్లే బ్రహ్మము జగత్తు అనన్యములు. నూలు ఉన్నను వస్త్రము లేదు అని చెప్పినట్లే బ్రహ్మమున్నను ప్రపంచము లేదు (అసత్) అని చెప్పుట సంగతమే.

158 సూ — యథా చ ప్రాణాదిః (6) 2-1-20

అర్థ — యథా = ఎట్లు, ప్రాణ + అదిః = ఒకే వాయువు శరీరమునందు వివిధములైన భాగములలో సంచరించుచు ప్రాణము అపానము మొదలైన పేరను కలిగియున్నదో అట్లే ఒకే బ్రహ్మము నామరూపభేదములతో భాసించుచు జగద్రూప కార్యమగుచున్నది. కావున కార్యకారణములు అభిన్నములని సిద్ధాంతము.

## 42 ఇతరవ్యపదేశాధికరణము 7

### పరమాత్మ జీవులు భిన్నతత్త్వములు.

159 సూ — ఇతరవ్యపదేశాద్ధితాకరణాదిదోషప్రసక్తిః (1) 2-2-21

అర్థ — ఇతరవ్యపదేశాత్ = "అయమాత్మా బ్రహ్మ" (బృ-6-4-5) "ఈ ఆత్మ బ్రహ్మము" మొదలైన ఉపనిషద్వాక్యములు బ్రహ్మమే జీవుడు అని చెప్పుటవలన, హిత + అకరణ + ఆది దోషప్రసక్తిః = తనకు హితమును చేసికొనకపోవుట ఈ మొదలైన దోషములు సంభవించును. కావున బ్రహ్మము జగత్కారణము కాదు అని పూర్వపక్షము.

వివ — జగత్కారణమైన బ్రహ్మము జీవులు అభిన్నులు అని

కొన్ని ఉపనిషద్వాక్యములు బోధించుచున్నవి. జీవాభిన్నుడైన పరబ్రహ్మమే జగత్కారణమగు పక్షమున ప్రపంచసృష్టి జీవునికి హితముగనే ఉండవలయును. అహితమును ఎవడును తనకుతానుగా చేసికొనడు గదా! కావున బ్రహ్మము జగత్కారణము కాదని పూర్వ పక్షము.

సూ160 — అధికం తు భేదనిర్దేశాత్ (2) 2-1-22

అర్థ— అధికం + తు = బ్రహ్మము జీవునికంటె వేరైనది, భేద నిర్దేశాత్ = స్పష్టముగ భేదమును చెప్పియున్నందువలన.

వివ — "ప్రధానక్షేత్రజ్ఞపతిః గుణేశః" (శ్వేతా- 6-16) ప్రకృతికి జీవునకు అధిపతియైనవాడు గుణములతో శోభిల్లువాడు పరమాత్మ. ఈ మున్నగు వేదవాక్యములు జీవాత్మ పరమాత్మలకు భేదమును చెప్పుచున్నవి. కావున హితాకరణాదిదోషప్రసక్తి లేదు.

161 సూ — అశ్మాదివచ్చ తదనుపపత్తిః (3) 2-1-23

అశ్మ + ఆదివత్= రాయి రప్ప మొదలగు అచేతనములకు వలెనే జీవునికిని, తత్+అనుపపత్తిః= ఆ బ్రహ్మముతో అభేదము ఉపపన్నము కాదు. కావున హితాకరణాదిదోషప్రసక్తి కలుగదు.

## 43 ఉపసంహారదర్శనాధికరణము 8

జగత్తునకు త్రివిధకారణములు బ్రహ్మమే.

162 సూ— ఉపసంహారదర్శనాన్నేతిచేన్న క్షీరవద్ధి (1)2-1-2

అర్థ—ఉపసంహారదర్శనాత్= ఒక కార్యమును నెరవేర్చునపుడు అనేక సాధనములను కూర్చుకొనుటను చూచుచున్నందువలన, న +

ఇతిచేత్ = అట్టి సాధనసంపద లేని కేవలబ్రహ్మము జగత్కారణము కాజాలదు అనినచో, న = అట్లు కాదు క్షీరవత్ + హి = పాలవలె.

వివ — పాలు పెరుగుగా మారునపుడు ఎట్టి సాధనసంపదను ఎట్లు అపేక్షింపదో అట్లే పరబ్రహ్మము జగత్తును సృజించునపుడు సాధన సంపద లేకయే సృజించుచున్నది. కావున బ్రహ్మము జగత్కారణ మగుటలో బాధలేదు.

163 సూ — దేవాదివదపి లోకే (2) 2-1-25

అర్థ — లోకే= తమ తమ లోకములో, దేవాదివత్+ అపి= దేవతా దులు తమ విచిత్రశక్తిచే సంకల్పమాత్రమున అనేక రూపములను ధరించునట్లు బ్రహ్మము విచిత్రశక్తికలది కనుక సంకల్పమాత్రమున జగత్సృష్టి గావింపగల్గుచున్నది. కావున బ్రహ్మము జగత్కారణము.

## 44 కృత్స్నప్రసక్త్యధికరణము 9

బ్రహ్మము విచిత్రశక్తులు గలది.

164 సూ — కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వశబ్దకోపో వా (1) 2-1-26

అర్థ — కృత్స్నప్రసక్తిః = బ్రహ్మము జగత్కారణ మగుచో అది అవయవములు లేనిది కావున ఆ బ్రహ్మమంతయు జగత్తుగా పరిణ మింపవలయును, నిరవయవత్వశబ్దకోపః + వా = అట్లు కానిపక్షమున బ్రహ్మము నిరవయము అనగా అవయవములు లేనిది అను వైదిక సిద్ధాంతమునకు ప్రకోపము (భంగము) కలుగును. కావున పరబ్రహ్మము జగత్కారణము కాదు అని పూర్వపక్షము.

165 సూ — శ్రుతేస్తు శబ్దమూలత్వాత్ (2) 2-1-27

అర్థ — శ్రుతేః + తు = వేదప్రమాణమువలన బ్రహ్మము జగ త్కారణ మను వాదమునకు పై దోషములు సంభవింపవు. శబ్ద

మూలత్వాత్ = విచిత్రశక్తియుక్తమైన బ్రహ్మము జగత్కారణ మని
వేదవాక్యములద్వారా తెలియుటవలన.

వివ — బ్రహ్మము ఈ జగత్తున చూపట్టు సకలపదార్థముల
కంటెను విలక్షణమైన దని విచిత్రశక్తియుక్త మని వేదమే బోధించుట
వలన కార్యదశయందును, కారణదశయందును బ్రహ్మముపరిపూర్ణతను
కలిగియుండును. గోత్వజాతిని అంగీకరించువారి మతమున గోత్వ
రూపజాతి ప్రతి పశువునందును పరిపూర్ణముగనే ఉండునుగదా
కావున కృత్స్నప్రసక్త్యాదిదోషప్రసక్తి యేర్పడదు.



166 సూ — ఆత్మని చైవం విచిత్రాశ్చ హి (3) 2-1-28

అర్థ — ఆత్మని చ= జీవాత్మయందును, ఏవం= ఇట్లు అచిద్వి
లక్షణములైన ధర్మములు చూపట్టుచున్నవి, విచిత్రాః + చ హి =
అచేతనములైన అగ్ని, జలము మున్నగువానియందును పరస్పర
విలక్షణములైన అనేకవిచిత్రశక్తులు చూపట్టుచున్నవి గదా! కావున
బ్రహ్మము విచిత్రశక్తియుక్తమై జగత్కారణమగుటలో బాధకములేదు.



167 సూ — స్వపక్షదోషాచ్చ (4) 2-1-29

అర్థ — స్వపక్షదోషాత్ + చ = సాంఖ్యమతమునను ఈ
దోషములు సంభవించుటవలన బ్రహ్మకారణవాదము శ్రేయస్కరము

వివ — వేదాంతుల మతమున బ్రహ్మము ఎట్లు నిరవయవమో
అట్లే సాంఖ్యుల మతమున ప్రకృతియు నిరవయవము. కావున
సాంఖ్యులు చెప్పిన కృత్స్నప్రసక్తి, నిరవయవత్వహాని అనుదోషములు
వారి మతముననే అనివార్యములు. బ్రహ్మము విచిత్రశక్తి విశిష్ట
మగుటవలన ఈ దోషములు వేదాన్తమతమున సంభవింపవు.

168 సూ — సర్వోపేతా చ తద్దర్శనాత్ (5) 2-1-30

అర్థ — సర్వ + ఉపేతా చ= పరదేవత (పరబ్రహ్మము) జగ
త్సృష్టికి కావలసిన సకలశక్తులతో కూడియున్నది. తత్+ దర్శనాత్=

ఆ విధముగా వేదమువ చూపట్టుటవలన.

వివ—"పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే" (శ్వేత.2-16) "ఈ బ్రహ్మముయొక్క ఉత్తమమైన శక్తి వివిధముగ వినబడుచున్నది." ఈ మొదలైన వేదవాక్యములవలన పరబ్రహ్మము జగత్సృష్టికి కావలసిన సకల శక్తులను కలిగియున్నదని తెలియుచున్నది. కావున పరబ్రహ్మమే జగత్కారణము.

169 సూ — వికరణత్వాన్నేతి చేత్తదుక్తమ్ (6) 2-1-31

అర్థ— వికరణత్వాత్ = శరీరేంద్రియాదిసాధనములు లేనందువలవ, న+ ఇతిచేత్=బ్రహ్మము జగత్కారణము కాదు అనినచో తత్= దానికి సమాధానము, ఉక్తమ్ = చెప్పబడినది.

వివ — "న తస్య కార్యం కరణం చ విద్యతే" (శ్వేత- 6-16 "ఆ బ్రహ్మమునకు శరీరేంద్రియాదులు గాని వానివలన కలుగు కార్యములు కాని లేవు" అను శ్రుతివాక్యమునుబట్టి బ్రహ్మమునకు శరీరేంద్రియాదులు లేవని తెలియుచున్నది. అట్టి బ్రహ్మము జగత్సృష్టి ఎట్లు గావించును" అని పూర్వపక్షము. దీనికి సమాధానము? "శ్రుతేస్తు శబ్దమూలత్వాత్" (బ్ర. సూ. 2-1-27) "ఆత్మని చైవం విచిత్రాశ్చ హి" (బ్ర. సూ. 2-1-28) అను సూత్రములచేత ముందే చెప్పబడినది. "పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః" (శ్వేత-3-19) "ఆ పరమాత్మ కన్నులు లేకయే చూచును. చెవులు లేకయే వినును. కాళ్లు, చేతులు లేకయే పరుగెత్తి పట్టుకొనును" ఈ మొదలైన వేదవాక్యములవలన పరమాత్మ విచిత్రశక్తియుక్తుడనితెలియుటచేత అతడు జగత్కారణమగుటలో బాధలేదు.

## 45 ప్రయోజనవత్త్వాధికరణము 10 (5)

బ్రహ్మములీలకై జగత్సృష్ట్యాదికము గావించుచున్నది.

170 సూ — న ప్రయోజనవత్త్వాత్ (1) 2-1-32

అర్థ— ప్రయోజనవత్త్వాత్ = ప్రతికార్యము ఏదో ఒక ప్రయోజనమును అపేక్షించి యుండుటవలన, న = అవాప్తసమస్తకాముడైన పరమాత్మకు జగత్కర్తృత్వము పొసగదు అని పూర్వపక్షము.

171 సూ — లోకవత్తు లీలాకైవల్యమ్ (2) 2-1-33

అర్థ — లోకవత్ + తు = లోకమునందువలె, లీలా కైవల్యం= బ్రహ్మము జగత్తును సృష్టించుటలో కేవలము లీలయే ప్రయోజనము.

వివ — మనము చేయు ప్రతిపనికి ఏదో ఒక ప్రయోజనముండును. ప్రయోజనము లేనిదే ఏ పనిని ఎవ్వడును చేయడు. మరి బ్రహ్మము ఏ ప్రయోజనమును ఆశించి జగత్సృష్టి చేయుచున్నది? అది అవాప్తసమస్తకామము కదా! అని పూర్వపక్షము. దీనికి సమాధానము- లోకమునందు రాజాధిరాజులు ఏ ప్రయోజనమును ఆశింపకయే లీలకై కందుకక్రీడాదులను గావించునట్లు, బ్రహ్మము కూడా ఏ ప్రయోజనమును ఆశింపకయే కేవలము లీలకై జగత్సృష్ట్యాదికము చేయుచుండును.

172 సూ — వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్తథా హి దర్శయతి (3) 2-1-34

అర్థ— వైషమ్యనైర్ఘృణ్యే= పక్షపాతము, నిర్దయత్వము, న= బ్రహ్మమునకు కలుగవు, సాపేక్షత్వాత్ = జగత్సృష్టి జీవుల కర్మమును బట్టి యుండుటవలన, తథా= ఆ విధముగా దర్శయతి, హి= "సాధుకారీ సాధుర్భవతి, పాపకారీ పాపో భవతి"(బృహ-6-4-5) "మంచిపని చేసినవాడు మంచివాడుగా జన్మించును. పాపకార్యములను చేసినవాడు పాపిగా జన్మించును" ఇత్యాది శ్రుతివాక్యములు యీ విషయమును తెలుపుచున్నవి గదా!

వివ— సర్వజ్ఞము, సర్వశక్తి సంపన్నము అయిన బ్రహ్మము జగత్కారణ మగు పక్షమున కొందరిని దేవతలనుగా, కొందరిని మానవులుగా మరి కొందరిని నరకలోకవాసులనుగా పక్షపాతబుద్ధితో ఏల సృజించుచున్నది? ఇట్లే కొందరిని రూపవంతులనుగా, సంపన్నులనుగా సృజించుచు మరికొందరిని వికలాంగులనుగా, దరిద్రులనుగా, సృజించుండుటచే ఆ బ్రహ్మము దయావిహీనము కాదా! అని ప్రశ్న. ఇందులకు సమాధానము- జీవులు చేసికొనిన కర్మలనుబట్టి ఉత్తమలోకవాసులనుగనో, లేక అధమలోకవాసులనుగనో సృజించుచుండుటచే బ్రహ్మము పక్షపాతముకలది అనిగాని నిర్దయము, అనిగాని తలంచుటకు అవకాశము లేదు అని.

173సూ—న కర్మావిభాగాదితిచేన్నానాదిత్వాదుపపద్యతే చాప్యుపలభ్యతే చ (4) 2-1-35

అర్థ— కర్మ+అవిభాగాత్= "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయం" (ఛా- 6-2-1) " సృష్టికి పూర్వము ఈ జగత్తు సద్రూపమున మాత్రమే ఉండినది, రెండవది లేదు" అను ఉపనిషద్వాక్యములవలన సృష్టికి పూర్వదశయందు జీవులు గాని వారి పుణ్య పాపరూపకర్మముల విభాగము గాని ఉన్నట్లు తెలియనందువలన, న= జీవుల పుణ్యపాపకర్మలనుబట్టి దేవాదిసృష్టి జరిగినదని అనరాదు, ఇతిచేత్ = అనుచో, న= అట్లుకాదు అనాదిత్వాత్ = జీవులు వారి పుణ్య పాపరూపకర్మములు అనాదులైనందువలన, ఉపపద్యతే చ = జీవులు పాపరూపకర్మములు సృష్టికి పూర్వదశయందు ఉన్నను అవి స్పష్టముగా గోచరింపకుండుటచేత, "స దేవ సోమ్యేదమగ్ర ఆసీత్" అని శ్రుతిచెప్పుట ఉపపన్నము కాగలదు. ఉపలభ్యతే చ = శ్రుతియందును ఈ విషయము స్పష్టముగా చూపట్టుచున్నది.

వివ — జీవులు ఎట్లు అనాదులో అట్లే వారి పుణ్యపాపములను అనాదులు. కావుననే శ్రుతి "నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం"(శ్వేత. 6-13) "నిత్యులైన చేతనులయొక్క కోరికలను నిత్యుడు పరమ చేతనుడు అయిన పరమాత్మ తీర్చును" అనుచున్నది. ఇట్లే స్మృతియు "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి" (భ. గీ. 13-19)"ప్రకృతి పురుషులు ఇద్దరు ఆదిరహితులు" అని తెలుపుచున్నది. సృష్టికి పూర్వదశయందు నామరూప విభాగము లేనందువలన "సదేవ" అని చెప్పబడినది. కాని వాస్తవమున ఆ దశయందును జీవులు, వారి కర్మములు, ప్రకృతి ఇవి- అన్నియు, సూక్ష్మరూపమున ఉన్నవని ఉపనిషత్తులు బోధించుచున్నవి.

శ్రీ శంకరభాష్యమ్మున "న కర్మావిభాగాదితిచేన్నానాదిత్వాత్" అనునది ఒక సూత్రముగను, "ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ" అను నది వేరొక సూత్రముగను చూపబడినది.

174 సూ — సర్వధర్మోపపత్తేశ్చ (5) 2-1-36

అర్థ — సర్వధర్మ + ఉపపత్తేః + చ = జగత్సృష్టికి అవసరములైన సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాది ధర్మములు బ్రహ్మమునందు ఉపపన్నములై ఉండుటవలన బ్రహ్మమే జగత్కారణము ప్రధానము' పరమాణువులు మొదలగు వానియందు జగత్కారణత్వోపయుక్తము లగు ఈ సర్వజ్ఞత్వాదిధర్మములు అసంభావ్యము లగుటవలనే అవి జగత్కారణములు కాజాలవు.

ద్వితీయాధ్యాయ ప్రథమపాదము సమాప్తము.

ద్వితీయాధ్యాయ ప్రథమపాదార్థ సంగ్రహశ్లోకము.

శ్లో॥ సాంఖ్యస్మృత్యావిరోధాద్విధిమతవిహతేః కార్యవైజాత్యతోస్మిన్
ఏకార్థానేకతన్త్రోదితవిహతతయా దేహభోగా వియుక్త్యా।

కార్యోపాదానభేదాత్ స్వహితవిహతితః కారకస్తోమహానేః
కృత్స్నాంశాద్యాపహా ధాతృకృతవిఫలతయో స్సృష్టితం ప్రత్య
విద్యాత్ ।

తా — బ్రహ్మకారణవాదమును అంగీకరించినచో సాంఖ్య దర్శనము విరోధింపదా? అను శంకను స్మృత్యధికరణమున - యోగ దర్శనవిరోధశంకను యోగప్రత్యుక్త్యధికరణమున - కార్యకారణ వైరూప్యశంకను విలక్షణత్వాధికరణమున - కణాదగౌతమాది దర్శన విరోధశంకను శిష్టాపరిగ్రహాధికరణమున - చిదచిచ్ఛరీరకమైన బ్రహ్మము కారణమగు పక్షమున అది సుఖదుఃఖభోక్త కావలయును కదా! అను శంకను భోక్త్రాపత్త్యధికరణమున - కార్యకారణములుభిన్నములు అను వాదమును ఆరంభణాధికరణమున - జీవాభిన్నమగు పరబ్రహ్మము జగత్కారణమగు పక్షమున జీవునికి హితము గాని దుఃఖమయమైన జగత్తును ఏల సృజించును? అను శంకను ఇతర వ్యపదేశాధికరణమున - ఉపకరణసామగ్రి లేని పరబ్రహ్మము జగత్కారణ మెట్లగును? అను శంకను ఉపసంహారదర్శనాధికరణమున - బ్రహ్మము నిరవయవమగుటచే అది యంతయు జగద్రూపమున పరిణమింపవలయును కదా! అను శంకను కృత్స్నప్రసక్త్యధికరణమున - అవాప్తసమస్తకామమగు పరబ్రహ్మము ఏ ప్రయోజనము నుద్దేశించి జగత్సృష్టి గావించుచున్నది? అను శంకను ప్రయోజనవత్త్వాధికరణమున - సయుక్తికముగా నిరసించి సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్త్వాది గుణవిశిష్టమైన పరబ్రహ్మము జగత్కారణమని ఈ ద్వితీయాధ్యాయ ప్రథమపాదమునందు చక్కగా నిరూపింపబడినది.

—0—

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# ద్వితీయాధ్యాయ ద్వితీయపాదము
# తర్కపాదము

## 46 రచనానుపపత్త్యధికరణము 1 (9)

**సాంఖ్యుల అచేతనప్రకృతి జగత్కారణము కాజాలదు.**

175 సూ — రచనానుపపత్తేశ్చ నానుమానంప్రవృత్తేశ్చ (1) 2-2-1

అర్థ — రచనా + అనుపపత్తేః + చ = అచేతనమైనది జగద్రచనగావించుట ఉపపన్నము కాదు కావున, అనుమానం = కేవల ప్రకృతి, న = జగత్కారణము కాదు. ప్రవృత్తేః + చ = చేతనుని సహాయమునపొందిరియే అచేతనము కార్యమున ప్రవర్తించుటవలనను కేవలప్రకృతిజగత్కారణము కాదు.

వివ — లోకమున అచేతనములైన కొయ్య మొదలగునవి ప్రాజ్ఞుడైన వడ్రంగి మొదలగు వారి సహాయముతోనే రథాది రూపములను పొందగలుగుచున్నవి. అట్టి చేతనసహాయము లేనపుడు అవి రథాదిరూపములను పొందుటలేదు. ఈ విధముగనే సర్వజ్ఞము, సర్వశక్తివంతము అయిన పరబ్రహ్మముచే అధిష్ఠితముగాని కేవలప్రకృతి జగత్సృష్ట్యాదికము గావింపలేదు.

176 సూ — పయోంబువచ్చేత్తత్రాఽపి (2) 2-2-2

అర్థ — పయః + అంబువత్ + చేత్ = పాలు, నీరుల వలె అనగా పాలు పెరుగుగను, నీరు కొబ్బరి, మామిడి మొదలగు ఫలము యందు ఆయా రసములు కలదిగను పరిణమించు రీతిని అచేతనమైన

ప్రకృతియు జగద్రూపమునపరిణమింపవచ్చునుగదా! అనుచో, తత్ర+అపి=ఆ పాలు, నీరు మున్నగు వానియందును పరబ్రహ్మసంబంధము ఉండుటవలననే అవి అట్లు పరిణమింపగలుగుచున్నవి. ఇందులకు శ్రుతి ప్రమాణము "యోఽప్సుతిష్ఠన్" (బృ-5-7-4) "ఎవడు నీటియందున్నవాడై నీటిని ప్రవర్తింపచేయుచున్నాడో" మొదలగునవి. కావున కేవలప్రకృతి జగత్కారణము కాదు.

177 సూ — వ్యతిరేకాఽనవస్థితేశ్చాఽనపేక్షత్వాత్ (3) 2-2-3

అర్థ — వ్యతిరేక + అనవస్థితేః + చ = సృష్టికి వ్యతిరేకమైన ప్రళయము లేకపోవలసివచ్చుటవలనను ప్రకృతి జగత్కారణముకాదు. అనపేక్షత్వాత్ = సర్వజ్ఞమైన బ్రహ్మముయొక్క అధిష్ఠానమును అపేక్షింపనందువలన.

వివ | కేవలప్రకృతి జగత్కారణమగు పక్షమున ఎల్లప్పుడా సృష్టి జరుగుచునేయుండవలయును. జగిపోరాదు; అనగా ప్రళయము కలుగరాదు. సర్వజ్ఞమగు బ్రహ్మము జగత్కారణము అని అంగీకరించు పక్షమున బ్రహ్మముయొక్క సంకల్పమునుబట్టి సృష్టిసంహారములు యథాక్రమముగా జరుగుట సంభవము.

178 సూ — అన్యత్రాఽభావాచ్చ న తృణాదివత్ (4) 2-2-4

అర్థ — అన్యత్ర = ఎద్దు మొదలగు పురుష పశువులయందు, అభావాత్ = అవి మేసిన గడ్డీ పాలుగా మారనందున తృణ+ఆదివత్ = పశువులు మేసినగడ్డి పాలుగామారుచున్నరీతిని అచేతనమైన ప్రకృతియే జగద్రూపమున పరిణమించును అనుట, న=యుక్తముకాదు.

వివ — ఆవు మేసిన గడ్డి పాలుగా మారుచున్నరీతిని అచేతనమైన ప్రకృతి జగద్రూపమున పరిణమించునుగదా! అని పూర్వపక్షము. దీనికి సమాధానము- ఎద్దు మేసిన గడ్డి పాలుగా పరిణమించుటలేదు. ఆవు మేసిన గడ్డి మాత్రమే అట్లు పరిణమించుచున్నది. కావున ఆ

తృణాదులయందును పరబ్రహ్మసంబంధము కలదని అంగీకరింప వలయును. ఈ విధముగనే ప్రకృతియు పరబ్రహ్మాధిష్ఠితమైనపుడే జగద్రూపమున పరిణమింపగలదు.

179 సూ — పురుషాశ్మవదితిచేత్తథాపి (౫) 2-2-5

అర్థ — పురుషః+అశ్మవత్+ఇతిచేత్ = కుంటి, గ్రుడ్డి పురుషుల ప్రయాణమువలె, అయస్కాంతముయొక్క సమీపమున ఇనుము కదలునట్లు ప్రధానము పురుష సన్నిధిని జగత్సృష్టి గావింపగలదు అనుచో, తథా+అపి = ఆ పక్షమునను కేవలప్రకృతి జగత్కారణము కాజాలదు.

వివ — కుంటివాడు గ్రుడ్డివాని భుజముమీద కూర్చొని త్రోవను నిర్దేశించుచుండగా, గ్రుడ్డివాడు ఆ మార్గమున ముందుకు సాగిపోవు చుండును. చివరికి ఇద్దఱు పరస్పర సహాయముతో, గమ్యస్థానమును చేరుదురు. స్వతః చలింపని ఇనుము అయస్కాంతము సమీపమున చలింపగలుగుచున్నది. ఇదే విధముగా ప్రధానము జ్ఞానరహితమైనను చైతన్య[illegible]రూపుడైన పురుషునిసన్నిధిని జగత్సృష్టి గావించుచున్నది అని సాంఖ్యులు తలంతురు. కాని ఈ వాదము సరికాదు. కుంటివాడు, గ్రుడ్డివాడు పరస్పర సహాయముతో గమ్యస్థానము చేరుచుండుట వాస్తవమే. జ్ఞానవంతుడు ఒకడు మార్గమును చూపింపగా మఱి యొకడు ఆ మార్గమున పయనించును. కాని ప్రధానము ఇట్టి చైతన్యముగలది కాదు కదా!

ఇక అయస్కాంత దృష్టాంతమును సహితము ఇచట సరిపడదు. ఏలయన అయస్కాంతసాన్నిధ్యమున ఇనుము చలించుచునే యుండును. ఇట్లే ప్రధానమునకు పురుషసాన్నిధ్యము ఎల్లపుడు నుండును. గనుక సృష్టి నిర్విరామముగా జరుగుచుండవలసివచ్చును.

ప్రళయమునకు అవకాశమే ఉండదు. ఇక మోక్ష మెక్కడిది? కావున ప్రధానము జగత్కారణము అను సాంఖ్యునివాదము యుక్తముకాదు.

శ్రీ శంకరభాష్యమున ఇది 7 వ సూత్రము.

180 సూ — అంగిత్వానుపపత్తేశ్చ (6) 2-2-6

అర్థ — అంగిత్వ + అనుపత్తేః + చ = సత్వరజస్తమో గుణములలో ఒకటి అంగిగా (అతిశయించినదిగా) ఏర్పడుట అనుప పన్నమగుటవలనను ప్రధానమువలన జగత్సృష్టి సంభవింపదు.

వివ — సత్వరజస్తమోగుణములు సమానములై యున్న ప్పుడు ప్రళయమనియు, రజోగుణ మధికమైనపుడు సృష్టియనియు, సాంఖ్యుల మతము. కాని ప్రళయకాలమున సమానముగ నున్న ఈ మూడు గుణములలో రజోగుణము ఇతరుల ప్రమేయము లేక స్వయ ముగా ఎట్లు ప్రాధాన్యమును వహింపగలుగును. ప్రాధాన్యమును వహింపనిదే జగత్సృష్టి సంభవింపదు గదా! కావున ఈ వాదము సరికాదు.

శ్రీ శంకరభాష్యమున ఇది 8 వ సూత్రము.

181 సూ— అన్యథాఽనుమితౌ చ జ్ఞశక్తివియోగాత్ (7) 2-2-8

అర్థ — అన్యథా = మరియొక విధముగా (ప్రధానమే తన గుణములైన సత్వరజస్తమస్సులకు హెచ్చుతగ్గులు కల్పించునని) అనుమితౌ చ = అనుమాన ప్రమాణము ద్వారా సాధించినను, జ్ఞశక్తి వియోగాత్ = ప్రకృతికి తెలిసికొనగల (జ్ఞాతృత్వ) శక్తి లేనందువలన అది గుణములలో మార్పును కలిగింపజాలదు.

శ్రీ శంకరభాష్యమున ఇది 9 వ సూత్రము.

182 సూ — అభ్యుపగమేఽప్యర్థాఽభావాత్ (8) 2-2-8

అర్థ — అభుపగమే + అపి= అట్టి ప్రకృతిని అంగీకరించినను అర్థ + అభావాత్ = ప్రయోజనము లేనందువలన ప్రధానకారణ వాదము యుక్తము కాదు.

వివ — నిత్యనిర్వికారుడు, నిష్క్రియుడు, చైతన్యమాత్ర స్వరూపుడు అయిన పురుషునకు ప్రకృతిధర్మాధ్యాసచేత సాంసారిక భోగము, ప్రకృతిపురుషుల స్వరూపస్వభావవివేకముచే మోక్షము కలుగునని సాంఖ్యులు తలంతురు. ఇది అసంగతము. నిత్యనిర్వికారుడైన పురుషునికి ప్రకృతి సాన్నిధ్యమున సాంసారికభోగము ఎట్లు కలుగును? ఎట్లో కలుగునని అంగీకరించినను ప్రకృతి పురుషుల సాన్నిహితము సార్వత్రికము, సార్వకాలికమ నగుటచేత అతనికి సర్వదా భోగమే కలుగవలయును. మోక్షము కలుగుటకు అవకాశమే ఉండదు కావున ప్రధానకారణవాదము నంగీకరించుట నిరర్థకము.

శ్రీ శంకరభాష్యానుసారము ఇది 6 వ సూత్రము.

163 సూ — విప్రతిషేధాచ్చాఽసమంజసమ్ (9) 2-2-9

అర్థ — విప్రతిషేధాత్ + చ = పరస్పరము విరుద్ధములైన విషయములను చెప్పుటవలనను, అసమంజసం = సాంఖ్యమతము సమంజసము కాదు.

వివ — సాంఖ్యులు ప్రకృతి భోగ్యము అని, పురుషుడు భోక్త అని చెప్పుచునే, ఆ పురుషుడు నిత్యనిర్వికారుడు, చైతన్యమాత్రస్వరూపుడు, కర్తృత్వాదిధర్మములు లేనివాడు అని అందురు. పురుషుడు ఇట్టివాడు అగుటచేతనే బంధమోక్షములు ప్రకృతికి గాని, పురుషునకు కాదని యందురు. ఈ అంశములు వేదాన్తశాస్త్రవిరుద్ధము అగుటయే గాక పరస్పరవిరుద్ధములునై యున్నవి. కావున సాంఖ్యసిద్ధాంతము సమీచీనమైనది కాదు.

## 47 మహద్దీర్ఘాధికరణము 2 (7)

కేవలపరమాణువులు జగత్కారణము అను కణాదుని సిద్ధాంతము సరికాదు.

184 సూ — మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమండలాభ్యామ్ (1) 2-2-11

అర్థ— హ్రస్వపరిమండలాభ్యాం = హ్రస్వము, పరిమండలము (అవయవరహితము) అయిన పరమాణువునుండి, మహత్ + దీర్ఘవత్ = మహత్తు (పెద్దది) దీర్ఘము అయిన ద్వ్యణుకము, త్ర్యణుకము (ద్వి + అణుకః, త్రి + అణుక) మొదలైనవి ఏర్పడుననుట ఎట్లు అసంజసమో, అట్లే కణాదుని ఇతరసిద్ధాంతములుకూడ అసమంజసములు.

వివ — కణాదుని మతమున పరమాణువులు జగత్కారణములు అవి అవయవరహితములు. అట్టి రెండు అణువులు కలిసి ద్వ్యణుకమగుచున్నవి. ద్వ్యణుకముల కలయికచే త్ర్యణుకమేర్పడుచున్నది. ఈ విధముగ పరమాణువులు జగత్కారణములు అగుచున్నవి. పృథివ్యాదిభూతచతుష్టయమునకు సంబంధించి ఇవి నాలుగు విధములు. పరమేశ్వరాధిష్ఠితములైన వీనియందు చలనక్రియ జీవుల అదృష్టమునుబట్టి ఏర్పడును. కపాలాద్యవయవములచే అవయవియైన ఘటాదికము ఏర్పడుటను చూచుచున్నాము గదా! అవయవముల అల్పత్వ, బహుత్వములనుబట్టి చిన్న పెద్ద వస్తువులు ఏర్పడుటయు ప్రత్యక్షసిద్ధమే. ఇట్లు అవయవములకు పర్యవసానము పరమాణువు. కావున అదియే జగత్కారణము అనివార్యసిద్ధాంతము. కాని అవయవరహితములైన పరమాణువులు ద్వ్యణుకములు అగుటకు పరస్పరము అవి ఎట్లు కలియగలవు? రెండు వస్తువులు కలియవలయునన్నచో వానికి అనేక పార్శ్వములు ఉండవలయును. అవయవములున్నచోనే పార్శ్వములు

186 సూ — సమవాయాఽభ్యుపగమాచ్చ సామ్యా దనవస్థితేః (౩) ౨-౨-౧౩

అర్థ — సమవాయ + అభ్యుపగమాత్ + చ = సమవాయము అను సంబంధమును అంగీకరించుటవలనను (కణాదమతము అసమంజసము) సామ్యాత్ = జాతిగుణములవలె సమవాయ సంబంధము సైతము "వస్తువును విడువక ఆశ్రయించియుండుట" అను సాదృశ్యమువలన సమవాయ సంబంధమునకు, దానికి ఆశ్రయమైన వస్తువునకు మధ్య మరియొక సంబంధమును అంగీకరింపవలయును. అనవస్థితేః = అట్లు అంగీకరించినచో ఆ సంబంధమునకు, దానికి ఆశ్రయమైన వస్తువునకు మధ్య మరియొక సంబంధమును అంగీకరింపవలసి వచ్చును. ఇట్లు సంబంధపరంపరను అంగీకరించుటచే అనవస్థాదోషము ఏర్పడును. ఇందువలనను కణాదమతము అసమంజసము.

విశ — జాతి - గుణ - క్రియలు ద్రవ్యమునందు సమవాయః సంబంధముతో ఉండునని కణాదసిద్ధాంతము. జాతిగుణక్రియలవలె సమవాయము సైతము ద్రవ్యమునందు ఉన్నది కదా ? అది ఆ ద్రవ్యమునందు ఏ సంబంధముతో ఉన్నది ? వాని మధ్య ఒక సంబంధమును కల్పించినచో ఆ సంబంధము ఆ ద్రవ్యమునందు ఏ సంబంధముతో నున్నది ? అను ప్రశ్న ఉదయించుచునే ఉండును. ఇట్లు సంబంధపరంపరాకల్పనచే అనవస్థ యను దోషము ఏర్పడును. కావున కణాదుని "సమవాయ సంబంధము" అసంగతము. జాత్యాదులు ద్రవ్యము నాశ్రయించియుండుట స్వభావము. దీనికై ఒక సంబంధము అంగీకరింప నవసరములేదు.

187 సూ — నిత్య మేవ చ భావాత్ (౪) ౨-౨-౧౪

అర్థ— నిత్యం+ఏవ=సర్వదా, భావాత్+చ = అవయవములు, అవయవి ఉండవలసినవచ్చుటవలనను (ఈ మతము అసంగతము.)

వివ— కణాదమతమున సమవాయ సంబంధము నిత్యమైనది. అవియవతో అవయవములు సమవాయ సంబంధమును కలిగియుండును. జగత్తు, అవయవి - అణువులు అవయవములు. వీని మధ్య గల సంబంధము నిత్యమైనపుడు జగత్తు సైతము నిత్యమై యుండవలయును గదా! కావున నిత్యమైన సమవాయ సంబంధమును అంగీకరించినచో కార్యకారణభావమే సిద్ధింపదు.

188సూ— రూపాదిమత్త్వాచ్చ విపర్యయో దర్శనాత్ (5)2-2-14

అర్థ — రూప + ఆదిమత్త్వాత్+ చ = పార్థివ- ఆప్య- తైజస- వాయవీయములు అను నాలుగు విధములైన పరమాణువులు రూపాది గుణములను ( గంధరసరూపస్పర్శలు ) కలిగియుండుటవలనను, విపర్యయః = పరమాణువులు నిత్యములు, నిరవయవములు అను వాదమునకు వ్యతిరేకత కల్గును. దర్శనాత్ = రూపాది గుణములు గల ఘటపటాదులు అనిత్యములు, సావయవములునై చూపట్టుచున్నందువలన.

వివ — పార్థివాది పరమాణువులు గంధాది గుణములతో ఉండునని కణాదపక్షము. అపుడు అవి సావయవములు, అనిత్యములు కావలయును. లోకమున ఘటాదులను అట్లే చూచుచున్నాము గదా!

189 సూ — ఉభయథా చ దోషాత్ (6) 2-2-15

అర్థ — ఉభయథా చ = పరమాణువులయందు రూపాది గుణములను అంగీకరించినను, అంగీకరింపకున్నను రెండు విధములు

గను, దోషాత్ = దోషము సంభవించుటవలన (ఈ సిద్ధాంతము అసంజసము)

వివ — పరమాణువులయందు రూపాదిగుణములను అంగీకరించినచో పరమాణువులు సావయవములు అనిత్యములు కావలసి వచ్చును. అంగీకరింపనిచో రూపాదిగుణరహితములైన పరమాణువుల నుండి రూపాది గుణరహితములైన ద్వ్యణుకాదులు ఎట్లు ఏర్పడుచున్నవి? కారణమున లేని గుణములు కార్యమున సంక్రమింపవు కదా! కావున పరమాణువులు రూపాదిగుణసహితము లన్నను, రూపాది గుణరహితము లన్నను బాధతప్పదు.

శ్రీ శంకరభాష్యమున ఇది 16 వ సూత్రము.

190 సూ — అపరిగ్రహాచ్చాఽత్యంత మనపేక్షా (7) 2-2-16

అర్థ — అపరిగ్రహాత్ + చ = వైదికులు పరిగ్రహింపనందువలనను, అత్యంతం = పూర్తిగా, అనపేక్షా = ఈ కణాదమతము ఉపేక్షింపదగినది.

వివ — సాంఖ్యమతమునగల సత్కార్యవాదాదులు కొన్ని వైదికులకు అభిమతము లగుటచే అది కొంతవరకు ప్రామాణికము కావచ్చును. కాని కణాదమతము ఏ అంశమునను వైదికులకు అభిమతము కానందున ఇది సర్వథా ఉపేక్షణీయము.

## 48 సముదాయాధికరణము 3 (10)

### వైభాషికసౌత్రాంతికుల క్షణికవాదనిరాసము.

191 సూ — సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః 2-2-17

అర్థ — ఉభయహేతుకే = (బౌద్ధమతమున) రెండువిధములుగ

ఏర్పడు—అనగా అణువులవలనను ఏర్పడువృథివ్యాది సముదాయము, పృథివ్యాదులనుండి ఏర్పడు శరీరేంద్రియసముదాయము అను, సముదాయే + అపి = సముదాయమునందును, తత్ + అప్రాప్తిః = ఆ సముదాయస్వరూపము సిద్ధింపదు.

వివ— వైభాషికులు, సౌత్రాంతికులు, యోగాచారులు, మాధ్యమికులు అని బౌద్ధులు నాలుగు శాఖలుగ నున్నారు. 1. వైభాషికులు - అణువులద్వారా జగత్సృష్టి జరుగుచున్నదని అంగీకరించుచు, ప్రత్యక్షసిద్ధములైన పృథివ్యాదిస్థూలద్రవ్యములను అంగీకరింతురు. 2. సౌత్రాంతికులు- పృథివ్యాది ద్రవ్యములు విజ్ఞానానుమేయములు అని యందురు. 3. యోగాచారులు - పృథివ్యాదిబాహ్యపదార్థములు వాస్తవమున లేవనియు, కేవలము విజ్ఞానము మాత్రమే సత్యమనియు అంగీకరింతురు. ఈ మూడుశాఖలవారును తాము అంగీకరించిన అణువులను లేక విజ్ఞానమును క్షణిక మని అందురు. 4. మాధ్యమికుడు - సర్వశూన్యవాది. అతని మతమున పృథివ్యాదిబాహ్యపదార్థములు, దాని అంతరమైన విజ్ఞానము గాని వాస్తవమున లేనేలేవు

పై నలుగురిలో మొదటి రెండుశాఖల వారు (వైభాషికులు, సౌత్రాంతికులు) బాహ్యపదార్థములను అంగీకరించినను, అవి క్షణికములు అనుటచే వానినుండి పృథివ్యాదిసముదాయము, గాని శరీరేంద్రియ సముదాయముగాని ఎట్లు ఏర్పడును? క్షణికము అనగా పుట్టిన క్షణముననే నశించునట్టిది అనికదా అర్థము! అట్టిదానినుండి మరియొక పదార్థము ఏర్పడుట అసంభవము. కావున క్షణికములైన అణువులనుండి పృథివ్యాది సముదాయము గాని, దానినుండి శరీరేంద్రియాది సముదాయము గాని ఏర్పడజాలదు.

192 — ఇతరేతరప్రత్యయత్వా దుపపన్నమితచేన్న, సంఘాత భావాఽనిమిత్తత్వాత్. (2) 2-2-18

అర్థ — ఇతర + ప్రత్యయత్వాత్ = పదార్థములు క్షణికము లైనను, అట్టివానియందు స్థిరత్వబుద్ధిని కలిగించు అవిద్యచే రాగద్వేషములు ఏర్పడి, వానినుండి మరల పృథివ్యాదులు, వానివలన అవిద్య ఏర్పడుచు, ఒకదాని కొకటి కారణమగుటవలన, ఉపపన్నం + ఇతిచేత్ = క్షణికములైన అణువులనుండి పృథివ్యాది సముదాయసిద్ధి, దీనినుండి శరీరేంద్రియాదిసముదాయసిద్ధి, యుక్తమే అనుచో, న = అట్లు కాదు. సంఘాతభావ + అనిమిత్తత్వాత్ = అవిద్య పృథివ్యాది సముదాయము ఏర్పడుటకు కారణము కాజాలనందువలన.

వివ — అస్థిరములైనవానిని స్థిరములనుగ స్ఫురింపజేయు అవిద్య వాస్తవమున స్థిరమైన కార్యమును జనింపజేయలేదు. అవిద్యావంతుడైన ఆత్మయు వీరి మతమున క్షణికుడే అగుటవలన రాగ ద్వేషాదులు ఎవరిలో కలుగును? కావున సర్వము క్షణికము అను ఈ మతము అసమంజసము.

193 సూ — ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్ (3) 2-2-19

అర్థ — ఉత్తర + ఉత్పాదే = ఉత్తరక్షణము ఏర్పడునంతలో పూర్వనిరోధాత్ + చ = పూర్వక్షణము నశించుటవలనను ఈ క్షణిక వాదము అసంగతము.

వివ — కారణవస్తువు నశించినను కార్యవస్తువు ఏర్పడుపక్షమున, అభావము నుండి కార్య మేర్పడు నని అంగీకరింపవలయును. అట్లైనచో సర్వకాలములయందు సర్వపదార్థములు ఏర్పడవలయును. ఇది అసంగతము.

194సూ— అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్యమన్యథా (4)2-2-20

అర్థ — అసతి = కారణము లేకున్నను కార్యము ఏర్పడును అని అంగీకరించు పక్షమున, ప్రతిజ్ఞా + ఉపరోధః = తమ ప్రతిజ్ఞకు భంగమేర్పడును, అన్యథా = అట్లుకాక అవి స్థిరములని అంగీకరించు పక్షమున, యౌగపద్యం = కార్యకారణములు రెండును ఒకక్షణముననే భాసింపవలసివచ్చును.

వివ — బౌద్ధమతమున " ఇది ఘటము, ఇది పటము " అను జ్ఞానము ఏర్పడుటకు నాలుగుఅంశములు ముఖ్యములు. 1. ఇంద్రియములు (అధిపతి) 2. వెలుతురు మొదలైన సహకారి 3. ఆలంబనము (ఘటాదిపదార్థము) 4. సమనంతర ప్రత్యయము (ఘటజ్ఞానమునకు ముందు వెనుక ఉండు క్షణముల జ్ఞానము) క్షణికవాదమున పైన చెప్పిన నాలుగు అంశములు క్షణికములై నశించుటవలన జ్ఞానము ఏర్పడుటకు అవకాశము లేదు. అట్లుకాక ఘటజ్ఞానపూర్వక్షణము తాను ఉండగనే ఉత్తరఘటక్షణమును కలిగించునుఅనినచో కార్యకారణములు ఏకకాలమున గోచరింపవలసివచ్చును. అట్లు కార్యకారణములు ఏక కాలమున గోచరించుటలేదుకదా! కావున ఈ క్షణికవాదము అపంగతము

195సూ— ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధాఽప్రాప్తి విచ్ఛేదాత్ (5) 2-2-21

అర్థ — ప్రతిసంఖ్యా + అప్రతిసంఖ్యా నిరోధ+అప్రాప్తిః = ప్రతిసంఖ్యానిరోధము (స్పష్టముగ గోచరించు వినాశనము) అప్రతి సంఖ్యానిరోధము (అస్పష్టముగ గోచరింపని వినాశము) అనునవి సంభవింపవు. అవిచ్ఛేదాత్ = ఉత్పత్తి వినాశ ధర్మములకు ఆశ్రయమైన ద్రవ్యమునకు విచ్ఛేదము లేనందువలన.

వివ — బౌద్ధులు "త్రయమభిన్నం క్షణికం" "మూడుతప్ప తక్కి

దంతయు క్షణికము" అని అందురు. 1. ప్రతిసంఖ్యానిరోధము 2. అప్రతిసంఖ్యానిరోధము 3. ఆకాశము— ఈ మూడు నిత్యములు. తక్కినవి క్షణికములు అని భావము. కాని ఈ వాదము సంగతము కాదు. ఘటాది కార్యము నశించినను, కారణమైన మృత్పిండాదికము అనువర్తించుచునే యుండును కదా! క్షణికవాదము నంగీకరించినచో సంపూర్ణవినాశమును (నిరన్వయవినాశమును) అంగీకరింపవలయును అది అనుభవవిరుద్ధము. నిత్యమైన ద్రవ్యము దశాభేదముచే కారణముగను, కార్యముగను వ్యవహరింపబడుచున్నది. గాని పూర్తిగా నశించుట లేదు. దీపము ఆరిపోయినపుడు అది పూర్తిగానశించినట్లు చూపట్టినను అందలి సూక్ష్మాంశములు రూపాంతరము నందియుండును. కావున నిరన్వయవినాశము సంభవింపదు.

196 సూ — ఉభయథా చ దోషాత్ (6) 2–2–22

అర్థ — ఉభయథా చ = రెండు విధములుగను, దోషాత్ = దోషము చూపట్టుచున్నందువలన. (క్షణికవాదము యుక్తముకాదు

వివ — ఏర్పడిన కార్యము తుచ్ఛము (అసత్తు) అనినను, తుచ్ఛమునుండి కార్యము ఏర్పడును అనినను దోషము తప్పదు ఏర్పడిన కార్యము తుచ్ఛమగు పక్షమున దానినుండి ఏర్పడిన జగత్తు సైతము తుచ్ఛమే కావలసివచ్చును. మట్టినుండి ఏర్పడు ఘటము మట్టియే గదా! కావున క్షణికవాదము నంగీకరించినచో తుచ్ఛము నుండి ఉత్పత్తిని, ఉత్పన్నమైన దానికి తుచ్ఛత్వమును అంగీకరింపవలసివచ్చును. ఇవి రెండును దుష్టములే అగుటచే నిరన్వయవినాశము సంభవింపదు.

197 సూ — ఆకాశే చావిశేషాత్ (7) 2–2–23

అర్థ — ఆకాశే చ = ఆకాశమునందును (తుచ్ఛత్వము లేదు.

అవిశేషాత్ = భాసించుటలో ఇతరపృథివ్యాది భూతములకంటె విశే షము లేనందువలన.

వివ — ఆకాశము శూన్యము అని క్షణికవాదుల మతము. కాని " ఇచట గ్రద్ద ఎగురుచున్నది. "(అత్ర గృధ్రః పతతి) ఈ మున్నగు వ్యవహారములవలన, పక్షి ఎగురుచున్న ప్రదేశమున ఆకాశము భాసించుచున్నది కదా ! కావున ఆకాశము శూన్యము కాదు.

198 సూ — అనుస్మృతేశ్చ (8) 2-2-24

అర్థ— అనుస్మృతేః+చ = పదార్థములను గుర్తించుచున్నందు వలనను (క్షణికవాదము సిద్ధింపదు.)

వివ — ఒక వ్యక్తిని మొదట చూచి తర్వాత కాలాంతరమున మరల చూచినపుడు "అతడే ఇతడు" అను జ్ఞానము కలుగుచున్నది దీనిని అనుస్మరణము అనియందురు. ఈఅనుస్మరణము భూతవర్తమాన కాలములయందు ఉండు ఒకేవ్యక్తియందే (జ్ఞాతయందే) కలుగు చున్నది క్షణికవాదము నంగీకరించినచో నేడు అనుసరించు జ్ఞాత నాటి (మొదటచూచినవాడు) వాడు కాడుగదా !

199 సూ — నాఽసతోఽదృష్టత్వాత్ (9) 2-2-25

అర్థ — అసతః=నశించిన వస్తువుయొక్క ధర్మములు జ్ఞానము నందు సంక్రమించును అనుట, న= యుక్తము కాదు, అదృష్టత్వాత్= ఆ విధముగ చూపట్టుచున్నందువలన.

వివ — వస్తువులు నశించుచున్నను వానిధర్మములైన రూప గుణక్రియాదులు జ్ఞానమునందు సంక్రమించుచున్నవి. దానివలన కాలాంతరమున వస్తువులను గుర్తుకు తెచ్చుకొనగలుగుచున్నాము- అని సౌత్రాంతికుని ఆశయము. కాని ఇదియు అసంగతము. వస్తువు నశించిన పిదప ధర్మములు మరియొకదానిపలన ఆశ్రయించుట అసంభవము కదా !

200 సూ — ఉదాసీనానామపి చైవం సిద్ధిః (19) 2-2-26

అర్థ — ఉదాసీనానాం + అపిచ = ఏ ప్రయత్నము చేయక ఉదాసీనముగ నున్న వారికిని, ఏవం సిద్ధిః = ప్రయత్నించినవారికి వలె ఫలము సిద్ధింపవలయును.

వివ — సర్వము క్షణికము అను పక్షమున, కృషి చేసినవానికి కృషి చేయనివానికి ఫలితము సమానముగ ఉండవలయును. కృషి చేసినవాడు, ఫలితమును పొందువాడు క్షణికులగుటచే భిన్నులగుచున్నారు. అనగా కృషిచేసినవాడే ఫలితమును పొందుటలేదు. కావున ఫలితమునకై కృషిని ఏల చేయవలయును? ఈ రీతిని బౌద్ధుల (వైభాషిక, సౌత్రాంతికుల) క్షణికవాదము యుక్తిసహముకాదు.

## 49 ఉపలబ్ధ్యధికరణము (4) 3

యోగాచారుల క్షణిక విజ్ఞానవాదము యుక్తముకాదు.

201 సూ — నాఽభావ ఉపలబ్ధేః (1) 2-2-27

అర్థ — అభావః = జ్ఞానముకంటె భిన్నముగ బాహ్యపదార్థములు లేవు అనుట న = యుక్తము కాదు. ఉపలబ్ధేః = బాహ్యపదార్థములు మన విజ్ఞానమునకు విషయములై భాసించుటవలన.

వివ — "యోగాచారులు" అను బౌద్ధశాఖవారు బాహ్యపదార్థములు (ఘటపటాదులు) లేవనియు క్షణికమైన తదాకారకవిజ్ఞానము మాత్రమే సత్యమనియు, తలంతురు. కాని ఈ వాదము అసంగతము "ఘటం అహం జానామి" = ఘటమును నేను ఎఱుంగుచున్నాను. అనునపుడు తాను జ్ఞాతగ, ఘటము జ్ఞానవిషయముగ(కర్మగ) భాసించుచుండుటచే జ్ఞాతృజ్ఞేయములు లేని జ్ఞానము ఎట్లు సిద్ధించును? కావున జ్ఞానమువలె జ్ఞాతృజ్ఞేయములును గలవని అంగీకరింపవలయును.

202 సూ — వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్ (2) 2-2-28

అర్థ — స్వప్న+ ఆదివత్=స్వప్నాది దశలయందలి జ్ఞానము వలె, న = జాగరితజ్ఞానము మిథ్యార్థవిషయకము గాదు. వైధర్మ్యాత్ + చ = ఆ రెంటికిగల వైలక్షణ్యమువలన.

వివ — స్వప్నము బాహ్యపదార్థములు లేకున్నను గోచరించుచున్నవి కదా! అట్లే జాగ్రద్దశయందును బాహ్యపదార్థములు లేకయే అవి జ్ఞానమున భాసించుచున్నవి అని అనుటయు తగదు. స్వప్నము గోచరించినను పదార్థములు మేల్కొనుటతోడనే మాయమగుచున్నవి. కావున అవి జ్ఞానకల్పితములు కాని, జాగ్రద్దశయందు అట్టి బాధలేదు కదా! కావున అవి సత్యములే అని అంగీకరింపవలయును. మరియు స్వప్నాదిజ్ఞానమునకు నిద్రాదిదోషము కారణము. జాగరితజ్ఞానమునకు అట్టి దోషములేదు. కావున అది నిర్దుష్టము, నిర్బాధమునై యున్నది. వాస్తవమున స్వాప్నికపదార్థములను సత్యములే అని సూత్రమునందలి చకారము సూచించుచున్నది.

203 సూ — న భావోఽనుపలబ్ధేః (3) 2-2-29

అర్థ — భావః = (పదార్థశూన్యమైన జ్ఞానమునకు) సద్భావము న = లేదు, అనుపలబ్ధేః = గోచరింపనందువలన.

వివ — జ్ఞానము పదార్థమునకు సంబంధించియే ఏర్పడును. "నాకు జ్ఞానము కలిగినది." అనగనే, దేనికి సంబంధించి? అని ప్రశ్నింతుము గదా! కావున అబాధితజ్ఞానసిద్ధమైన పదార్థము అసత్యమగుచో జ్ఞానము సైతము అసత్యమే యగును.

శ్రీ శంకరభాష్యమున " క్షణికత్వాచ్చ " అను సూత్రము ఒకటి ఇచట అధికముగా కన్పించుచున్నది.

## 50 సర్వథాఽనుపపత్త్యధికరణము 5

సర్వము (జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు) అసత్యము అను మాధ్యమికుని వాదము అప్రమాణము.

201 సూ — సర్వథాఽనుపపత్తేశ్చ 2-2-30

అర్థ — సర్వథా = అన్ని విధముల, అనుపపత్తేః + చ = "సర్వము శూన్యము" అనువాదము యుక్తియుక్తము కానందువలన (పరిగ్రాహ్యముకాదు.)

వివ — బౌద్ధులలో కొందరు "సర్వము శూన్యము" అని తలంతురు. మట్టిముద్దను చిదిపినపుడే అనగా ఆ ఆకారమును నశింపజేసినపుడే ఘటము ఏర్పడుచున్నది. కావున ఘటము అభావమునుండి (లేనిదశ) గదా ఏర్పడుచున్నది? ఇట్లు అభావమునుండి ఏర్పడిన ఘటము సైతము అభావమే కావలయును. ఈ రీతిని ఆదియందు, అంతమునందు లేక మధ్యలో మాత్రము గోచరించు పదార్థములు సత్యములు ఎట్లగును? అని వీరి వాదము. కాని ఈ వాదము అసాతరమణీయము. ఏలయనగా— లోకమున ప్రమాణసిద్ధమైన వస్తువునకే ఉన్నది లేక లేదు అనువ్యవహారము దేశకాలాదులనుబట్టి ఏర్పడుచున్నది. ఘటము ఇక్కడ ఉన్నది. అక్కడ లేదు. నిన్న ఉన్నది, ఈరోజు లేదు అని గదా? వ్యవహారము "లేదు" అనిఅనగనే ఏదిలేదు ఎప్పుడులేదు ఎక్కడలేదు" అను ప్రశ్నలు ఉదయించును. "లేదు"అని నిషేధించునపుడు నిషేధింపబడు వస్తువును ఒకదానిని అంగీకరింపవలయును. అంగీకరించినచో సర్వశూన్యవాదమునకు భంగము ఏర్పడును. అంగీకరింపనిచో నిషేధమే సిద్ధింపదు. సర్వశూన్యవాది తాను చెప్పిన ఈ వాక్యమునైనను సత్యమని అంగీకరింపవలయును గదా? అట్లుకాక సిడివాదముతో "సర్వము శూన్యము" అను తనవాక్యము

సైతము అసత్యమని వాదించినచో "సర్వము సత్యము" అని సిద్ధించును. కావున సర్వశూన్యవాదము అసంగతము.

శ్రీ శంకరులు ఈ సూత్రమును ప్రత్యేకమైన అధికరణముగా స్వీకరింపక, ముందు అధికరణమునందే వ్యాఖ్యానించిరి.

## 51 ఏకస్మిన్నసంభవాఽధికరణము 6 (4)

జగత్తు సత్యము-అసత్యము, నిత్యము-అనిత్యము, భిన్నము- అభిన్నము, అగుచు"అనైకాన్తికము"అను జైనమతము అసమంజసము.

205 సూ — నైకస్మిన్నసంభవాత్ (1) 2-2-31

అర్థ— ఏకస్మిన్-ఒకే వస్తువునందు, అసంభవాత్ = (నిత్యత్వ అనిత్యత్వాది పరస్పరవిరుద్ధధర్మములు ఏకకాలముననే ఉండుట) సంభవింపనందువలన, న = (జైనమతము) సమంజసము కాదు.

వివ — జైనులు పదార్థములయందు పరస్పరవిరుద్ధములైన "సత్త్వము-అసత్త్వము, నిత్యత్వము-అనిత్యత్వము, భేదము-అభేదము, మొదలైన ధర్మములు ఏకకాలముననే ఉండునని అంగీకరింతురు. కాని ఒకే పదార్థమునందు ఏకకాలమున పరస్పర విరుద్ధధర్మములుండుట అనుభవవిరుద్ధము. దేశకాలభేదములనుబట్టి ఒకే వస్తువునందు పరస్పరవిరుద్ధధర్మములు ఉండవచ్చును గాని, ఏకదేశమున, ఏక కాలమున, ఉండుట అసంభవము గదా! కావున జైనుల"అనైకాన్తిక" వాదము (పదార్థము ఏకరూపమునగాక భిన్నరూపములందును అను వాదము)అసంగతము.

206 సూ — ఏవంచాఽఽత్మాఽకార్త్స్న్యమ్. (2) 2-2-32

అర్థ — ఏవం = ఇట్లే, ఆత్మ+ అకార్త్స్న్యం చ = ఆత్మ (గజ

శరీరమును వీడి దోమ శరీరమున) సంపూర్ణముగ ప్రవేశింపలేకపోవు
అను దోషము కూడ గలదు.

వివ — జీవాత్మ అణువని కొందరు విభువని కొందరు తలంచు
చున్నారు. కాని జైనులు జీవాత్మ మధ్యమపరిమాణము గలవాడని
భావింతురు. అనగా ఆయా శరీరముల పరిమాణమును కలిగియుం
డును. దోమశరీరమునగల జీవుడు దాని శరీరమంతటివాడు కాగా.
గజశరీరమున నుండు జీవుడు దాని పరిమాణమును కలిగియుండును.
ఇది వారి వాదము. జీవుడు నిర్ణీతపరిమాణమును కలిగియుండని
పక్షమున గజశరీరమున నుండిన జీవుడు ఆ శరీరమును వీడిదోమ
శరీరమున ప్రవేశింపవలసివచ్చినపుడు సమగ్రముగ అందు ప్రవేశింప
లేదు కదా ! కావున జీవుడు మధ్యమపరిమాణము కలిగియుండును,
అను వాదము అసంగతము.

207సూ—న చ పర్యాయాదప్యవిరోధో వికారాదిభ్యః(బ్ర 2-2-33

అర్థ — పర్యాయాత్+ అపి = ఒకమారు అల్ప పరిమాణముగ,
మరియొకమారు అధికపరిమాణముగ ఆత్మ ఉండుటవలన, అవిరోధః =
పరస్పరవిరోధము లేకపోవుట, న = సంభవింపదు. వికార + ఆది
భ్యః =(ఆత్మకు) వికారమును అనగా మార్పును, దానివలన వినాశన
మును అంగీకరింపవలసివచ్చుటవలన.

వివ — " శరీరముల " అను " ఉపాధులను " బట్టి ఆత్మ
హెచ్చుచు తగ్గుచు, తన పరిమాణమును మార్చుకొనుచుండును అని
తలంచినచో, ఘటాపటాదులవలె ఆత్మయు నశించునని అంగీకరింపవలసి
వచ్చును. కాని జైనమతమునందును జీవుడు నిత్యుడే. కావున ఈ
వాదము సమంజసము కాదు.

208 సూ — అంత్యావస్థితేశ్చోభయనిత్యత్వా దవిశేషః (4) 2-2-34

అర్థ — అంత్య + అవస్థితేః = మోక్షదశయందలి ఆత్మ పరిమాణమే స్వాభావికమగుటవలన, ఉభయనిత్యత్వాత్ + చ = ఆత్మ, మోక్షదశయందలి అతని పరిమాణము రెండును నిత్యములగుటవలన, అవిశేషః= సంసారదశయందును ఆత్మ పరిమాణములో హెచ్చుతగ్గులు ఉండుటలో విశేషములేదు.

వివ — మోక్షదశయందలి ఆత్మ పరిమాణమే వాస్తవమైనది. కావున సంసారదశయందును దానినే అంగీకరించుటయుక్తము. నిత్యమైన ఆత్మకు పరిమాణము సైతము నిత్యమే గదా ! కావున ఈ పై హేతువులచే జైనసిద్ధాంతము అసమంజసమగుచున్నది.

## 52 పశుపత్యధికరణము 7 (4)

ఈశ్వరుడు జగత్తునకు కేవలనిమిత్తకారణము అను పాశుపత మతము అసమంజసము.

209 సూ — పత్యురసామంజస్యాత్ (1) 2-2-35

అర్థ — పత్యుః = పశుపతియొక్క మతము, (న= పరిగ్రహింపదగినది కాదు.) అసామంజస్యాత్ = అసమీచీనమగుటవలన.

వివ — పాశుపతులు పశువు (జీవుడు), పాశము (సంసారము), పతి (ఈశ్వరుడు) అను మూడు తత్త్వములను అంగీకరింతురు. వీరి మతమున ఈశ్వరుడు ప్రపంచమునకు నిమిత్తకారణమే కాని, ఉపాదానకారణము కాదు. ఈ వాదము వేదవిరుద్ధము. ప్రపంచమునకు త్రివిధకారణములు పరబ్రహ్మమే అని వైదికసిద్ధాంతము. ఇట్లే పాశుపతుల వ్రతములలోగల శ్మశానభస్మధారణ, కపాలభోజనాదికములును అవైదికములే అగుటవలన ఈ మతము పరిగ్రహము కాదు.

శ్రీ శంకరులభాష్యమున ఈ సూత్రము పిమ్మట "సంబంధానుపపత్తేశ్చ" అను సూత్రము అధికముగా కన్పించుచున్నది.

210 సూ — అధిష్ఠానాఽనుపపత్తేశ్చ (2) 2-2-36

అర్థ — అధిష్ఠాన + అనుపపత్తేః+చ = ఈశ్వరుడు ప్రకృతిని అధిష్ఠించుట సంభవింపదు. కావునను ఈ మతము అప్రామాణికము.

వివ — పాశుపతులు ఈశ్వరాఽస్తిత్వమును వేదప్రమాణము ద్వారాకాక, అనుమాన ప్రమాణముద్వారా అంగీకరించుచు, అతడు ప్రకృతిని అధిష్ఠించి, జగత్సృష్టి గావించునని యందురు. కాని శరీరములేని ఈశ్వరుడు ప్రకృతిని ఎట్లు అధిష్ఠించును? ఈశ్వరునకు శరీరము నంగీకరించు పక్షమున ఆ శరీరులయొక్క ఉత్పత్తికి కారణము దెలుపవలయును. శరీరము సాఽవయవము అగుటచే అది అనిత్యము కావలయును. సాఽవయవమైనను ఈశ్వరశరీరము నిత్యము అగుచో ఘటపటాదులును ఏల నిత్యములు కారాదు? కావున ఈ వాదము అసంగతము.

211 సూ — కరణవచ్చేన్న, భోగాఽఽదిభ్యః (3) 2-2-37

అర్థ — కరణవత్ + చేత్ = జీవుడు శరీరము లేని వాడయును శరీరమును, ఇంద్రియములను అధిష్ఠించియుండునట్లు శరీరము లేని ఈశ్వరుడును ప్రకృతిని అధిష్ఠింపవచ్చును అనుచో, న = అది యుక్తము కాదు.

వివ — జీవునకువలె ఈశ్వరునకు శరీరము నంగీకరించుపక్షమున జీవునివలె ఈశ్వరుడును శరీరముద్వారా సుఖదుఃఖములను అనుభవింపవలసివచ్చును.

212 సూ — అంతవత్త్వ మసర్వజ్ఞతా వా (4) 2-2-3

అర్థ — అంతవత్త్వం= సుఖదుఃఖభోగసాధనమైన శరీరమును ఈశ్వరునకు అంగీకరించినచో, దానికిమూలములైన పుణ్యపాపములను బట్టి వినాశమును సైతము అంగీకరింపవలయును. అసర్వజ్ఞతా వా = వారు చెప్పునట్టి సర్వజ్ఞతయు అతనికి సిద్ధింపదు. కావున పశుపతి మతము అసమంజసము. సూత్రమున "వాకారము" సముచ్చయార్థకము.

## 53 ఉత్పత్త్యసంభవాధికరణము 8 (4)

### పాంచరాత్రమతమున అప్రామాణ్యశంకానిరాసము.

213 సూ — ఉత్పత్త్యసంభవాత్ (1) 2-2-39

అర్థ — ఉత్పత్తి + అసంభవాత్ = జీవునికి ఉత్పత్తి సంభవింపదు కావున. (జీవోత్పత్తిని అంగీకరించు పాంచరాత్ర మతము అప్రామాణికము.)

వివ — పాంచరాత్రులు జగత్తునకు త్రివిధకారణము బ్రహ్మమే అని అంగీకరించినను, వైదికసిద్ధాంతమునకు విరుద్ధముగ "వాసుదేవాత్సంకర్షణో నామ జీవో జాయతే" "వాసుదేవునినుండి సంకర్షణుడు అను జీవుడు పుట్టును." అనుచు జీవోత్పత్తిని వర్ణించుటవలన ఈ మతము అసమంజసము.

214 సూ — న చ కర్తుః కరణమ్. (2) 2-2-40

అర్థ — కర్తుః = కర్తయైన జీవునినుండి, కరణంచ = జ్ఞానసాధనమైన మనస్సు పుట్టుట సైతము, న = సంభవింపదు.

వివ — "సంకర్షణాత్ ప్రద్యుమ్నసంజ్ఞం మన ఉత్పద్యతే" "సంకర్షణుడు అను జీవునినుండి ప్రద్యుమ్నుడు అను మనస్సు పుట్టుచున్నది." అను పాంచరాత్రసిద్ధాంతము అసంగతము. కర్తనుండి కరణము (సాధనము) ఎట్లు పుట్టును? "ఏతస్మాత్ జాయతే ప్రాణో

మనస్సర్వేంద్రియాణి చ” “ఈ పరమాత్మనుండి మనస్సు, ప్రాణము, సర్వేంద్రియములు పుట్టుచున్నవి” అనిగదా వేదము చెప్పుచున్నది. ఈ విధముగ పాంచరాత్రము వేదవిరుద్ధాఽర్థప్రతిపాదక మగుటచే అప్రమాణము అని పూర్వపక్షము.

215 సూ — విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః (3) 2-2-41

అర్థ — విజ్ఞాన + ఆదిభావే వా=(జ్ఞానస్వరూపము, జగత్కారణము అయిన వాసుదేవపరబ్రహ్మమే సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిద్ధుడును అని) సంకర్షణాదులకు పరబ్రహ్మత్వము అంగీకరింపబడు పక్షమున, తత్ + అప్రతిషేధః = ఆ పాంచరాత్ర ప్రామాణమునకు ప్రతిషేధములేదు.

వివ — విజ్ఞానం చ ఆదిచ = విజ్ఞానాఽఽది. అనగా బ్రహ్మము అని అర్థము. సంకర్షణుడు, అనిరుద్ధుడు, ప్రద్యుమ్నుడును ఆబ్రహ్మము నుండి జన్మించినను, ఆ బ్రహ్మముకంటె భిన్నులుకారు. వారియందును బ్రహ్మత్వము కలదు. “ అజాయమానో బహుధా విజాయతే ” “పుట్టుక లేని పరమాత్మ అనేక విధములుగ (రామకృష్ణాది రూపములు) జనించు చున్నాడు“ అనుచు శ్రుతియు పరమాత్మకు ఉత్పత్తిని చెప్పుచున్నది కదా! ఉత్పత్తి అతనికి కర్మమూలకముకాక స్వసంకల్ప మూలకము, దయామూలకము అగుటచే “అవతారము” అనబడుచున్నది. కావున వ్యూహములుగ కీర్తింపబడు సంర్షణాదులు భగవదవతారములు ఇట్లు సంకర్షణుడు జీవశరీరుడు, జీవాధిష్ఠాత అయిన పరమాత్మయే. “సంకర్షణోనామ జీవః ” “సంకర్షణుడు అను జీవుడు” అనుచు సంకర్షణుని జీవునిగా చెప్పుట అతడు జీవశరీరకుడగుటచేతనే (జీవునియందు అంతర్యామియై జీవాత్మను శరీరముగా కలిగియుండుటచేతనే) అని గుర్తింపవలయును. “ తత్తేజఐక్షత ” “ఆ తేజస్సు చూచెను. అనగా ఆ తేజస్సున అంతర్యామిగా ఉన్న పరమాత్మ సంకల్పించెను” అని

గదా అర్థము! ఈ రీతిగ పాంచరాత్రమునందు వర్ణింపబడిన జీవో త్పత్తి గౌణమే గాని ముఖ్యము కాదు కావున పాంచరాత్రము ప్రమాణము.

216 సూ — విప్రతిషేధాచ్చ (4) 2-2-42

అర్థ — విప్రతిషేధాత్ + చ = (జీవోత్పత్తి పాంచరాత్రమున) నిషేధింపబడుటవలనను పాంచరాత్రము ప్రమాణము.

వివ — "సహ్యనాదిరసన్తశ్చ వరమార్థేన నిశ్చితః" (పరమ సంహితా) "ఆ జీవుడు ఉత్పత్తి వినాశములు లేనివాడు" అని పాంచ రాత్రము జీవనిత్యత్వమును బోధించుటచే అందుచెప్పబడిన జీవోత్పత్తి గౌణమని తలంపవలయును. కావున పాంచరాత్రసిద్ధాంతము. సాంఖ్య, బౌద్ధ, జైన, పాశుపతాదిద్ధాంతములవలె అవైదికము కాక వేదమతా నుసారి యగుటచేత సర్వథా ప్రమాణము. శ్రీశంకరులవారును తమ భాష్యమునందు ఈ సందర్భమున— "జగత్తునకు నిమిత్తోపాదాన కారణములు రెండును సరబ్రహ్మమని, ఆ వరబ్రహ్మము శ్రీ మన్నా రాయణుడని, అతని ధ్యానార్చనకీర్తనాదులు చతుర్విధపురుషార్థ సాధకములని పాంచరాత్రము బోధించు విషయములను మేము అంగీ కరించుచున్నాము. ఈ విషయములను శ్రుతియు ఇట్లే ప్రతిపాదించి నది కదా!" అనుచు పాంచరాత్రప్రామాణ్యమును చాలవరకు అంగీ కరించిరి కాని, జీవోత్పత్త్యాదులు వేదవిరుద్ధము లగుటచే అట్టి విషయములయందు మాత్రము అది అప్రమాణము అని సిద్ధాంతీకరిం చిరి. విశిష్టాద్వైతప్రవర్తకులైన శ్రీ మద్యామునాచార్యులవారు. భగవద్రామానుజులు మొదలైనవారు జీవోత్పత్త్యాదులు పాంచరాత్రాభి మతములుకావని సోపపత్తికముగ నిరూపించి, పాంచరాత్రము సర్వథా ప్రమాణమని నిర్ధారించిరి.

ద్వితీయాధ్యాయ ద్వితీయపాదము సమాప్తము.

## ద్వితీయాఽధ్యాయ ద్వితీయపాదాఽర్థ సంగ్రహశ్లోకము

శ్లో॥ పాదేఽస్మిన్ కాపిలస్థైః కణభుగనుగతైః వృద్ధవైభాషికాద్యైః
యోగాచారాఽభిధానైః స్సుగతమతరహస్యాన్య వాదప్రసక్తైః,
అర్హత్సిద్ధాంతభక్తైః పశుపతిసమయస్థాయిభి శ్చాపరోధం
క్షిప్త్వాఽథో పాంచరాత్రం శ్రుతిపథ మవదత్పంచమా
మ్నాయాదర్శీ ॥

తా — ఈ ద్వితీయాధ్యాయ ద్వితీయపాదమునందు రచనాఽనుపపత్త్యధికరణమున కపిలసిద్ధాంతమును, మహద్దీర్ఘాఽధికరణమున కణాదసిద్ధాంతమును, సముదాయాఽధికరణమున వైభాషికసౌత్రాంతికుల క్షణికవాదమును ఉపలబ్ధ్యధికరణమున యోగాచారుల క్షణికవిజ్ఞానవాదమును, సర్వథానుపపత్త్యధికరణమున సర్వము శూన్యము అను మాధ్యమికుని సిద్ధాంతమున, ఏకస్మిన్నసంభవాధికరణమున పాశుపతసిద్ధాంతమును (వైదికసిద్ధాంతవిరుద్ధములగుటచేత) నిరసించి, పంచమవేద (మహాభారత) ద్రష్టయైన పారాశర్యవ్యాసభగవానుడు పాంచరాత్రసిద్ధాంతము సర్వథా శ్రుతిమార్గానుసారియగుటచే అది పరమప్రమాణ మని సిద్ధాంతీకరించిరి.



శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# ద్వితీయాఽధ్యాయ తృతీయపాదము

## వియత్పాదము

## 54 వియదధికరణము 1 (9)

ఆకాశము సృష్టింపబడుచున్నది.

217 సూ — న వియదశ్రుతేః (1) 2-3-1

అర్థ — వియత్ = ఆకాశము, న = పుట్టదు, అశ్రుతేః = అట్లు వినబడనందువలన.

వివ— ఆకాశము అంతట వ్యాపించి, నిరవయమై యుండునది గదా! అట్టి దానికి ఉత్పత్తి ఎట్లు సంభవము? ఆకాశము పుట్టునని ఎచ్చటను వినియుండలేదు. ఇది పూర్వపక్షము.

218 సూ — అస్తి తు (2) 2-3-2

అర్థ — అస్తి తు= ఆకాశోత్పత్తిని తెలుపు శ్రుతివాక్యముకలదు. కావున ఆకాశము పుట్టునని అంగీకరింపవలయును.

వివ — "ఆత్మన ఆకాశస్సంభూతః" (తై. ఉ. బ) "పర మాత్మనుండి ఆకాశము పుట్టినది" అను శ్రుతివచనమునుబట్టి ఆకాశో త్పత్తి నంగీకరింపవలయు నని సిద్ధాంతము.

219 సూ — గౌణ్యసంభవాచ్ఛబ్దాచ్చ (3) 2-3-3

అర్థ— అసంభవాత్ = "తత్తేజోఽసృజత" (ఛా-6-2-3) "అది తేజస్సును సృష్టించినది" అని సృష్టి తేజస్సుతో ప్రారంభమగు చున్నట్లు తెలియుచున్నందువలన ఆకాశమునకు సృష్టి అసంభవము. అందువలన, గౌణీ = "ఆకాశస్సంభూతః" అను శ్రుతి గౌణార్థకము.

శబ్దాత్ + చ = " వాయుశ్చాఽంతరిక్ష చైతదమృతం " (బృ-4-3-3) " వాయువు, ఆకాశము వినాశరహితములు " అను శ్రుతివలనను ఆకాశమునకు ఉత్పత్తి సంభవింపదు.

220 సూ — స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్ (4) 2-3-4

అర్థ — బ్రహ్మశబ్దవత్ = బ్రహ్మశబ్దమునకువలె, ఏకస్య = ఒక సంభూతశబ్దమునకు (గౌణార్థకత్వము) స్యాత్+చ = కలుగవచ్చును.

వివ — "తస్మా దేతద్బ్రహ్మ నామరూపమన్నం చ జాయతే" (ముం-1-1-9) " ఆ పరమాత్మ నుండి ఈ బ్రహ్మము, ప్రకృతి, నామ రూపములు, అన్నము ఏర్పడుచున్నవి " అను శ్రుతివాక్యమున గల "బ్రహ్మ" శబ్దము గౌణమున ప్రకృతిని బోధించుచున్నది. " తపసా చీయతే బ్రహ్మ " (ముం- 1-9) అను వాక్యమున "బ్రహ్మశబ్దము" పరమాత్మను ముఖ్యముగ బోధించుచున్నది గదా ! ఇట్లే " ఆత్మన ఆకాశస్సంభూతః " అను శ్రుతివాక్యమునందలి "సంభూతః" శబ్దము "గౌణార్థకముకాగా, ఆకాశాద్వాయుః" (సంభూతః) అనువాక్యమునగల సంభూతశబ్దము ముఖ్యార్థబోధకము కావచ్చునుగదా ! కావున ఆకాశమునకు ఉత్పత్తి లేదు అని పూర్వపక్షము.

221 సూ — ప్రతిజ్ఞాఽహాని రవ్యతిరేకాత్ (5) 2-3-5

అర్థ — ప్రతిజ్ఞా + అహానిః = బ్రహ్మను తెలిసినచో, తత్కార్యమైనదంతయు తెలియగలదు అను"ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానప్రతిజ్ఞ"కు భంగము కలుగదు, అవ్యతిరేకాత్ = ఆకాశముకూడ బ్రహ్మనుండి పుట్టుటచే, ఆ ప్రతిజ్ఞకు వ్యతిరేకభావము లేనందువలన.

వివ — "యేనాఽశ్రుతం శ్రుతం భవతి " (ఛా-6-3-1) "దీనిని విన్నచో అంతయు వినినట్లు అగునో" అను ఛాందోగ్యవాక్యమున

"బ్రహ్మమును తెలిసినచో బ్రహ్మమువలన ఏర్పడిన ఈ జగత్తంతయు తెలియబడగలదు" అను విషయము మృత్తికాద్యుదాహరణములతో వివరింపబడినది. ఆకాశము సైతము బ్రహ్మమునుండి జనించినప్పుడే ఈ ప్రతిజ్ఞ నెరవేరును ఆకాశము బ్రహ్మకార్యముకాక తద్భిన్నమై యున్నచో బ్రహ్మజ్ఞానముచే ఆకాశజ్ఞానము ఎట్లు కలుగును? కావున బ్రహ్మనుండి ఆకాశము పుట్టుచున్నది అనుట స్పష్టము.

222 సూ — శబ్దేభ్యః (6) 2-3-6

అర్థ — శబ్దేభ్యః = "ఆత్మని ఆకాశస్సంభూతః" (తై. ఉ. 2-1-2) "బ్రహ్మనుండి ఆకాశము పుట్టినది" ఈ మొదలైన ఉపనిషద్వాక్యములవలన తెలియుచున్న ఆకాశోత్పత్తి "తత్తేజోఽసృజత" (ఛా- 6-8-6) "ఆ బ్రహ్మము తేజస్సును సృజించినది" అని తేజస్సృష్టిని తొలుత చెప్పినంతమాత్రమున ఖండితము కాదు. సృష్టికి పూర్వము సచ్ఛబ్దవాచ్యమైన బ్రహ్మమొక్కటేగదా ఉండినది. (సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్) అపుడు లేని ఆకాశము సృష్టియందు చూపట్టుచున్నందువలన ఆకాశోత్పత్తిని అంగీకరింపవలయును అని భావము.

శ్రీ శంకరులు 6వ, 6వ సూత్రములను రెండింటిని కలిపి ఒకే సూత్రముగ గైకొనిరి.

223 సూ — యావద్వికారం తు విభాగో లోకవత్ (7) 2-3-7

అర్థ — లోకవత్ = లోకమునందువలె, యావత్+వికారంతు = బ్రహ్మవికారత్వము (బ్రహ్మకార్యత్వము)గల సమస్తమునకు, విభాగః = (బ్రహ్మనుండి) విభాగముల (ఉత్పత్తి) గలదు.

వివ — "ఐతదాత్మ్యమిదం సర్వం" (ఛా-6-8-6) "ఇదియంతయు బ్రహ్మాత్మకము అనగా- బ్రహ్మకార్యము" అనుటచేత ఆకాశము

సైతము బ్రహ్మకార్యమే అని స్పష్టమగుచున్నది. ఇట్లుండగా ఛాందోగ్యము సృష్టిక్రమమును తేజస్సృష్టితో ప్రారంభించి ఏల చెప్పినది ? అని గదా సందేహము. అట్లు చెప్పుట దోషము గాదు. లోకమున దేవదత్తునకు పదిమంది పుత్రులు అని చెప్పి, వారిలో కొందరినిమాత్రమే పరిచయము చేసినంతమాత్రమున తక్కినవారు అతని పుత్రులు కాకపోరు గదా ! ఇట్లే ఈ ప్రపంచమంతయు బ్రహ్మకార్యమని చెప్పి, వీనిలో కొన్నింటి సృష్టిని మాత్రమే వివరించినందున ఆకాశమునకు ఉత్పత్తి కలదు.

294 సూ — ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః (8) 2-3-8

అర్థ — ఏతేన = ఆకాశోత్పత్తిని చెప్పుటచే, మాతరిశ్వా = వాయువు, వ్యాఖ్యాతః = ఉత్పత్తి కలదిగ చెప్పబడినది.

వివ — ఛాందోగ్యోపనిషత్తునందు ఆకాశోత్పత్తివలె వాయూత్పత్తియు స్పష్టముగ చెప్పబడలేదు. అయినను వాయువుకూడ బ్రహ్మకార్యమే అగుటచేత పైన చెప్పిన రీతిగా బ్రహ్మమునుండి ఉత్పన్నమగుచున్నది అని తెలియవలయును.

225 సూ — అసంభవస్తు సతోఽనుపపత్తేః (9) 2-3-9

అర్థ— అసంభవః + తు = ఉత్పత్తిలేకుండుట, సతః = "సత్" అనబడు బ్రహ్మమునకు మాత్రమే. అనుపపత్తేః = బ్రహ్మమునకును ఉత్పత్తిని అంగీకరించుపక్షమున " సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ " (ఛా—6-2-1) "సృష్టికి పూర్వము బ్రహ్మము మాత్రమే ఉండినది" అని నిర్ధారణచేసి చెప్పుట అనుపపన్నము అగుటవలన.

వివ— బ్రహ్మము మాత్రమే ఉత్పత్తి లేనిది. తద్భిన్నములైన ఆకాశాదులన్నియు ఆ బ్రహ్మమునుండి ఉత్పన్నములైనవే అనిభావము

## 55 తేజోఽధికరణము 2 (8)

### తేజస్సు ఉదకములు పృథివి సృష్టింపబడుచున్నవి.

226 సూ — తేజోఽతస్తథా హ్యాహ (1) 2–3–10

అర్థ— అతః = ఈ వాయువునుండియే, తేజః=తేజస్సు పుట్టుచున్నది. తథా = అట్లు, ఆహ హి = శ్రుతి చెప్పుచున్నది కదా!

వివ — "వాయోరగ్నిః" (తై.ఉ.ఆ 2-1-2) అను వాక్యము వాయువునుండి తేజస్సు పుట్టుచున్నదని తెలియుచున్నది.

227 సూ — ఆపః (2) 2–3–11

అర్థ — ఆపః = ఉదకములు తేజస్సునుండి పుట్టుచున్నవి.

వివ — "అగ్నే రాపః" (తై.ఉ.ఆ. 2-1-2) అగ్నినుండి (తేజస్సునుండి) ఉదకములు జనించుచున్నవని తెలుపు శ్రుతి ఇందులకు ప్రమాణము.

228 సూ — పృథివీ (3) 2–3–12

అర్థ — పృథివీ = ఉదకముల నుండి భూమి జనించుచున్నది.

వివ — "అద్భ్యః పృథివీ" (తై.ఉ.ఆ. 2-1-2) అను శ్రుతి వలన ఉదకములనుండి భూమి జనించుచున్నదని తెలియుచున్నది.

శ్రీ శంకరభాష్యమున ఈ సూత్రము కన్పింపదు.

229 సూ — అధికారరూపశబ్దాఽన్తరేభ్యః (4) 2–3–13

అర్థ — అధికారరూప శబ్ద + అంతరేభ్యః = "తా అన్నమసృజన్త" (ఛా– 6-2-4) "ఆ ఉదకములు అన్నమును సృజించినవి. అను వాక్యమునగల శబ్దమునకు "భూమి" అని యర్థము. ఏలయనగా 1) అధికారాత్ = ప్రకరణమువలన 2) రూపాత్ = రూపమువలన 3) శబ్ద + అంతరాత్ = మఱియొక శ్రుతివాక్యమువలన (అధికార

శ్చ రూపం చ శబ్దాంతరంచ అధికారరూప శబ్దాంతరాణి తేభ్యః అధికార రూప శబ్దాంతరేభ్యః)

వివ — "తా అన్న మసృజంత" అను ఛాందోగ్యవాక్యమున గల "అన్న"శబ్దము భూమిని బోధించుచున్నది. ఏలయనగా 1)మహా భూతముల సృష్టిని తెలుపు ప్రకరణములో ఆ వాక్యము ఉన్నందువల నను- 2) "యత్కృష్ణం తదన్నస్య" (ఛా- 6-4-1) "నల్లని రూపము అన్నమునకు సంబంధించినది"అని భూమియొక్క కృష్ణవర్ణమునే(రూపమునే) అన్నమునకును చెప్పుటవలనను- 3) "అద్భ్యః పృథివీ" (తై. ఉ.బ్రవ. 2) అను మరియొక శ్రుతివాక్యమున ఉదకములనుండి భూమి జనించుచున్నది అని స్పష్టముగ చెప్పుటవలనను పై ఛాందోగ్యవాక్యమునగల "అన్న" శబ్దము భూమినే బోధించునని భావము

230 సూ — తదభిధ్యానాదేవ తు తల్లింగాత్సః (5) 2-3-14

అర్థ — తత్ + లింగాత్ = ఆ బ్రహ్మమునకు అసాధారణలక్షణమైన, తత్ + అభిధ్యానాత్ + ఏవ తు = ఆ బ్రహ్మముయొక్క సంకల్పమువలననే (ఆకాశాదులు జనించుచున్నందువలన) సః = ఆ పరమాత్మయే ఆకాశాది సృష్టికి కారణము.

వివ — "త దైక్షత బహుస్యాం ప్రజాయేయేతి. తత్తేజోఽసృజత" (ఛా-6-2-3) ఆ పరబ్రహ్మము తాను బహురూపములను పొందవలయునని సంకల్పించినది. అది తేజస్సును సృజించినది" అని చెప్పుటచేత పరమాత్మయే సంకల్పపూర్వకముగ తేజస్సు ఉదకములు పృథివి మున్నగువానిని సృజించినాడని స్పష్టమగుచున్నది. కావున "తత్తేజ ఐక్షత" తా ఆప ఐక్షంత, (ఛా-6-2-3) మొదలైన వాక్యములలో అచేతనములైన తేజస్సు ఉదకములు సంకల్పించినట్లు చెప్పుట అసంగతమగుటవలన, తేజస్సుసంకల్పించినది అనగా తేజస్సునందు

అంతర్యామిగా ఉన్న పరబ్రహ్మము సంకల్పించినది అనియర్థము. అట్లు సంకల్పించి సృజింపగల శక్తి పరబ్రహ్మమునకే గదా ఉన్నది.

231 సూ — విపర్యయేణ తు క్రమోఽత ఉపపద్యతే చ
(6) 2-3-15

అర్థ — విపర్యయేణ తు = "ఆకాశాద్వాయుః వాయో రగ్నిః అగ్నే రాపః అద్భ్యః పృథివీ" (తై ఉ.1-1-2)ఆకాశమునుండి వాయువు వాయువునుండి అగ్ని, అగ్నినుండి ఉదకములు, ఉదకములనుండి పృథివి జనించుచున్నవని చెప్పిన క్రమమునకు విరుద్ధముగ క్రమః = "ఏతస్మా జ్జాయతే ప్రాణః మనస్సర్వేంద్రియాణి చ ఖం వాయుర్జ్యోతి రాపః పృథివీ" (ముం- 2-1-3) "ఈ బ్రహ్మమునుండి ప్రాణము ఆ మనస్సు సర్వేంద్రియములు ఆకాశము వాయువు అగ్ని ఉదకములు పృథివి జనించుచున్నవి" అని చెప్పిన సృష్టిక్రమము. అతః = ఈ బ్రహ్మమునుండి [సాక్షాత్తుగ] ఉపపద్యతే చ = ఉపపన్నమగు చున్నది.

వివ— సాక్షాత్తు బ్రహ్మమునుండి ఆకాశాదులు జనించినవని కొన్ని ఉపనిషత్తులయందును ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి పృథివి జనించినవని మరికొన్ని ఉపనిషత్తుల యందును పరస్పరవిరుద్ధముగ సృష్టిక్రమము చెప్పబడియున్నది. వీనిలో ఏ పక్షమును పరిగ్రహింపవలయును ? అని సందేహము. వీనికి సమాధానము, ఈ సూత్రము. సాక్షాత్తు బ్రహ్మము నుండి ఆకాశాదిసృష్టి జరుగుచున్నదని చెప్పుటయే యుక్తము. ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని జనించుచున్నది అని చెప్పినను ఆకాశాంతర్యామియైన పరమాత్మనుండి వాయువు, వాయ్వంతర్యామియైన పరమాత్మనుండి అగ్ని జనించినదనియే గదా భావము. కావున పైన తెలిపిన సృష్టిక్రమములకు పరస్పరవిరోధము లేదు

232సూ—అంతరా విజ్ఞానమనసీ క్రమేణ తల్లింగా దితిచేన్నా౽విశేషాత్ [7] 2-3-16

అర్థ— అంతరా = "ఏతస్మాజ్జాయతే ప్రాణః" [కఠ- 2-1-3] అను వాక్యము, ప్రాణమునకును, ఆకాశాది మహాభూతములకును మధ్య, విజ్ఞానమనసీ = ఇంద్రియములు మనస్సు, క్రమేణ = క్రమముగా [ఉత్పన్నములగుచున్నవని తెలుపుచున్నది తత్ + లింగాత్ = "ఆకాశమింద్రియేషు. ఇంద్రియాణి తన్మాత్రేషు. తన్మాత్రాణి భూతాదౌ లీయన్తే. [సుబాల.ఉ. 6-2] "ఆకాశము ఇంద్రియములయందు, ఇంద్రియములుతన్మాత్రలయందు, తన్మాత్రలు భూతాదులయందును లీనమగుచున్నవి" అనుచు ప్రళయక్రమమును తెలుపు వాక్యము అందులకు ప్రత్యభిజ్ఞాపక మగుటవలన ఇతిచేత్ = అనుచో, న = అట్లు కాదు. అవిశేషాత్ = ఆ ప్రాణేంద్రియమనశ్శబ్దములును తమలో అంతర్యామియైయున్న పరమాత్మను బోధించుటలో ఆకాశాదిశబ్ద సమానములగుటవలన ప్రాణాదిశరీరకుడైన పరమాత్మనుండియే సర్వముజనించుచున్నది అనుట యుక్తము.

వివ — "ఏతస్మాజ్జాయతే ప్రాణః" అను కఠవల్లీ వాక్యము సర్వమునకు బ్రహ్మమే కారణము అని తెలుపజాలదు. ప్రాణమునకు ఆకాశాదిభూతములకు మధ్య ఇంద్రియములు మనస్సు సృజింపబడుచున్నవి. అని వాని సృష్టిక్రమమును మాత్రమే బోధించుచున్నది. "ఆకాశ మింద్రియేషు ఇంద్రియాణి తన్మాత్రేషు, తన్మాత్రాణి భూతాదౌ లీయన్తే" అనుచు ప్రళయక్రమమును తెలుపు సుబాలోపనిషయా ద్వాక్యము ఇందులకు ప్రమాణము అనిపూర్వపక్షము. కాని ఈవాదము యుక్తముకాదు. ఆకాశాదిశబ్దములవలె ప్రాణేంద్రియమనశ్శబ్దములును

తమయందు అంతర్యామియై యున్న పరమాత్మను బోధించుచున్నవి. ప్రాణము = ప్రాణమును శరీరముగ జేసికొని, అందు అంతర్యామిగా ఉన్న పరమాత్మ, ఇంద్రియము = ఇంద్రియమును శరీరముగజేసికొని, అందు అంతర్యామిగా ఉన్నపరమాత్మ అని యర్థము. కావున పై కల వాక్యము ప్రాణాదిసృష్టిక్రమమును తెలిపినను ఆ ప్రాణేంద్రియాదుల యందు అంతర్యామిగా ఉన్న పరమాత్మవలననే సృష్టి జరుగు చున్నదని చెప్పుటకు ఆక్షేపము లేదు. కావున ఆకారాదిసృష్టికి సాక్షాత్తు పరబ్రహ్మమే కారణము.

233 సూ — చరాఽచరవ్యపాశ్రయస్తు స్యా త్తద్వ్యపదేశోఽ భాక్తస్తద్భావభావిత్వాత్ (8) 2-3-17

అర్థ — చర + అచరవ్యపాశ్రయః = స్థావరజంగమవస్తువు లకు సంబంధించిన, తత్ + వ్యపదేశః = ఆయా పదార్థవాచకశబ్దము, అభాక్తః + స్యాత్ = (పరబ్రహ్మను బోధించుటలో) భాక్తము (గౌణము) కాదు, ముఖ్యమే. తత్ + భావభావిత్వాత్ = బ్రహ్మము తేజస్సు మొదలగువానియందు అంతరాత్మగా ఉండుటచేత వానికి ఆ నామ రూపములు ఏర్పడుటవలన.

వివ — చరాఽచరసకలపదార్థవాచకశబ్దములును పరమాత్మ వాచకములు. ఎట్లనగా— "సకలపదార్థములయందు పరమాత్మ అంతర్యామిగా ఉన్నాడు. కావున అవి అతనికి శరీరములు. అతడు వానికి ఆత్మ. గోవు, అశ్వము మున్నగు శరీరవాచకశబ్దములు ఆయా శరీరములకు ధారకములై, వాని లోపల నున్న ఆత్మలను కూడా బోధించుచున్నవి. ఇట్లే చరాఽచర పదార్థవాచక శబ్దములన్నియు తమయందు అంతర్యామియైయున్న పరమాత్మను పైతము బోధించు చున్నవి. పరమాత్మాఽనుప్రవేశము లేనిచో వానికి సత్తయే (ఉనికి)

లేదుగదా! ఈ రీతిని ప్రాణ, ఆకాశాదిశబ్దములు కేవలప్రాణాకాశాదు లను మాత్రమే కాక, వానియందు అంతర్యామిగా ఉన్న పరమాత్మను సైతము బోధించుటచేత— ఆకాశము = ఆకాశశరీరకుడైన పరమాత్మ, ప్రాణము=ప్రాణశరీరకుడైన పరమాత్మ అని పరమాత్మకును వాచకము లగుచున్నవి. కావున ప్రాణాకాశాద్యంతర్యామియై యున్న పర మాత్మయే సర్వజగత్కారణము అగుచున్నాడు.

## 56 ఆత్మాధికరణము 3

### జీవాత్మ నిత్యుడు. అతడు సృజింపబడడు.

234 సూ — నాత్మా, శ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః 2–3–18

అర్థ — ఆత్మా = జీవాత్మ, న = (ఆకాశాదులవలె) పుట్టుటలేదు. శ్రుతేః = "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" (కఠ–2–18)" జీవుడు పుట్టడు గిట్టడు " అను శ్రుతివలన, తాభ్యః = "అజో నిత్యః శాశ్వతోఽ యం పురాణః" (కఠ– 2–18) " నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానాం" (శ్వేత- 2–5–13) ఈ మొదలైన శ్రుతులవలన, నిత్యత్వాత్ + చ = నిత్యుడుగ తెలియబడుచున్నందువలనను.

వివ — " ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానప్రతిజ్ఞ " సిద్ధించుటకై ఆకాశాదులు పరబ్రహ్మమునుండి పుట్టుచున్నవి అని అంగీకరించితిమి. ఇట్లే జీవాత్మయు పరమాత్మనుండి పుట్టుచున్నాడని అంగీకరింపవల యును. లేనిచో జీవాత్మ పరమాత్మ కార్యము కాకపోవలసివచ్చును. అపుడు పై ప్రతిజ్ఞకు భంగము ఏర్పడును గదా! అని పూర్వపక్షము. " న జాయతే " ఇత్యాది శ్రుతులవలన జీవాత్మ నిత్యుడని స్పష్టమగు చున్నది. కావున అతనికి ఆకాశాదులకువలె ఉత్పత్తి లేదు. " ప్రజా పతిః ప్రజా అసృజత " [యజు– 2–6] "ప్రజాపతి ప్రజలను సృజిం

చెను" ఈ మొదలైన జీవోత్పత్తిబోధకశ్రుతులు జ్ఞానగుణకుడైన జీవాత్మయొక్క జ్ఞానసంకోచమును వినాశమని, విజ్ఞానవికాసమును ఉత్పత్తి యని మాత్రమే బోధించుచున్నవి. జీవోత్పత్తిని కాదు. శ్రుతులు స్పష్టముగ జీవోత్పత్తిని నిషేధించుచున్నవి గదా! జీవులు నిత్యులగు పక్షమున "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్ ఏక మేవాఽ ద్వితీయం" (ఛా-6) "సృష్టికి పూర్వము బ్రహ్మము ఒక్కటియే ఉండినది. రెండవది లేదు" అనుట ఎట్లు పొసగును? అని సందేహింప నవసరము లేదు. చేతనాఽచేతనముల నామరూపవిభాగాఽనర్హసూక్ష్మ దశను పురస్కరించుకొని అట్లు చెప్పబడినది. కావుననే "వైషమ్య నైర్ఘృణ్యే న, సాఽపేక్షత్వాత్" అను బ్రహ్మసూత్రము సృష్టికి పూర్వము జీవులు, వారి సంచితకర్మలు ఉన్నట్లు తెలుపుచున్నది ఇట్లు అంగీకరింపనిచో విషమసృష్టి గావించు పరమాత్మకు పక్షపాతమును, నిర్దయతను అంగీకరింపవలసివచ్చును. కావున జీవాత్మలు నిత్యులు.

## 57 జ్ఞాఽధికరణము 4 (14)

### జీవుడు జ్ఞాత.

235 సూ — జ్ఞోఽత ఏవ (1) 2-3-19

అర్థ — అతః + ఏవ = శ్రుతివాక్యములవలననే, జ్ఞః = జీవుడు "జ్ఞాత" అని తెలియబడుచున్నాడు.

వివ — "అథ యోవేదేదం జఘ్రాణీతి స ఆత్మా" (ఛా-8-12-4) "నేను దీనిని వాసన చూచుచున్నాను అని ఎవడు ఎఱుంగునో అతడు ఆత్మ" అని చెప్పుటవలన శబ్దస్పర్శరూపరస గంధాదులను తెలిసికొనువాడు జీవాత్మ అని స్పష్టమగుచున్నది. కావున

జీవుడు జ్ఞాత- అనగా తెలిసికొనువాడు అని యర్థము. ఇట్లనుటచే జ్ఞానమే జీవుడు అను వాదము నిరస్తము.

## జీవుడు అణుపరమాణుడు

236 సూ — ఉత్క్రాంతిగత్యాగతీనామ్ (2) 2-3-20

అర్థ — ఉత్క్రాంతిగతి + ఆగతీనాం = శరమునుండి బయలువెడలుట, పరలోకమునకు పోవుట, మరల ఈ లోకమునకు తిరిగి వచ్చుట, అను జీవుని పరలోకగమనాగమనాదులను తెలుపు శ్రుతివాక్యములవలన జీవుడు అణుపరిమాణుడని తెలియుచున్నది.

వివ — " తేన ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి " (బృ-6-4-2) "ఆవెలుగుతో ఈఆత్మ నిష్క్రమించుచున్నాడు(శరీరమునుండి)" "యే వై కేచాఽస్మాల్లోకాత్ప్రయన్తి చంద్రమ సమేవ తే సర్వే గచ్ఛన్తి" (కౌషీత) "ఈ లోకము నుండి వెడలిన వారందరు చంద్రునే చేరుచున్నారు" "తస్మాల్లోకాత్పున రేత్యస్మై లోకాయ కర్మణే" (బృ-6-4-6) "కర్మశేషానుభవమునకై ఆ లోకమునుండి తిరిగి ఈ లోకమునకు వచ్చును" ఈ మొదలైన శ్రుతులవలనను జీవుడు అణుపరిమాణుడు అని తెలియుచున్నది.

237 సూ — స్వాఽఽత్మనా చోత్తరయోః (3) 2-3-21

అర్థ — ఉత్తరయోః = (పరలోక) గమనాగమనక్రియలు, స్వ + ఆత్మనా = (జీవునిచే) స్వయముగ స్వస్వరూపముతో సంపాదింపబడవలసియున్నందువలన ఇతడు అణువు.

వివ — ఉత్క్రాన్తి- గతి- అగతులలో, ఉత్క్రాంతికి తర్వాతివైన గమనాగమనములకు జీవుడు కర్తయగుటచే అతడు అణుపరి

మాణుడు గమనాగమనముల గావించుం జీవుని మనము చూడ లేకున్నాము గదా!

238 సూ — నాఽణు రతచ్ఛ్రుతే రితిచేన్నేతరాఽధికారాత్ (4) 2-3-22

అర్థ — అతత్ + శ్రుతేః = జీవుడు అణువు కాక మహత్తు అని శ్రుతి చెప్పుటవలన, న + అణుః = జీవుడు అణుపరిమాణుడు కాడు. ఇతిచేత్ = అనుచో, న = అట్లుకాదు, ఇతర + అధికారాత్ = (అది) జీవేతరుడైన పరమాత్మను ప్రతిపాదించు ప్రకరణమగుటవలన.

వివ — "స వా ఏష మహానజ ఆత్మా" (బృ-6-4-24) "అతడు విభుపరిమాణుడు. పుట్టుకలేనివాడు" అను శ్రుతివాక్యము జీవుని మహత్పరిమాణమును బోధించునని పూర్వపక్షము. కాని ఇది సరి కాదు. "యస్యాఽనువిత్తః ప్రతిబుద్ధ ఆత్మా" (బృ- 6-4-25) "జీవునకు ఉపాస్యుడు, ప్రాజ్ఞుడునగు ఆత్మ" అను తరువాతి వాక్యము పరమాత్మను బోధించుచుండుటచే ఈ ప్రకరణము పరమాత్మబోధకమని తెలియుచున్నది. కావున ఈ ప్రకరణమున గల "స వా ఏష మహానజ ఆత్మా" అను వాక్యము సైతము పరమాత్మబోధకమే. కాని, జీవబోధకము కాదు. కావున జీవుడు అణుపరమాణుడే అని సిద్ధాంతము.

239 సూ — స్వశబ్దోన్మానాభ్యాం చ (5) 2-3-22

అర్థ — స్వశబ్ద + ఉన్మానాభ్యాం చ = (జీవుడు) అణుపరిపరమాణుడు అని స్పష్టముగ "అణు" శబ్దముచేతనే తెలుపు శ్రుతివచనమువలనను, జీవుని పరిమాణము వెండ్రుకకొనలోని వేయవ భాగము అని కొలిచి శ్రుతి చెప్పుటవలనను జీవుడు అణుపరిమాణుడు.

వివ — "ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యః" (ము- 3-1-9) "ఈ జీవాత్మ అణువు. ఇతనిని మనస్సుచేతనే తెలియవలయును"

అను శ్రుతిజీవాఽణుత్వమును స్పష్టముగ బోధించుచున్నది. "వాలాఽగ్ర శత భాగస్య శతధా కల్పితస్య చ, జీవో భగస్య విజ్ఞేయః" "వెంట్రుక కొనను వెయ్యిభాగములు చేసినచో అందు ఒక భాగముయొక్క పరిమాణము జీవపరిమాణమని తెలియవలయును" అను శ్రుతి జీవుని అణుత్వమును దృష్టాంతముద్వారా కొలిచి చూపుచున్నది. కావున జీవుడు అణుపరిమాణుడే.

240 సూ — అవిరోధశ్చందనవత్ (6) 2-3-24

అర్థ— చంధనవత్ = చంధనమువలె, అవిరోధః = ఆత్మ అణువైనను శరీరమంతట జ్ఞానమును కలిగించుటలో విరోధము లేదు.

వివ — జీవుడు అణుపరిమాణుడైనచో నఖశిఖపర్యంతము శరీరమున జ్ఞానము ఎట్లు కలుగుచున్నది? అను సందేహమున్నకు ఈ సూత్రము సమాధానము చందనమును హృదయమున అలదుకొనినను శరీరమంతయు ఎట్లు చల్లబడుచున్నదో, అట్లే జీవుడు అణుపరిమాణుడే అయినను శరీరమునందు అంతట జ్ఞానము కలుగవచ్చును. కావున జీవుడు అణుపరిమాణుడు.

241 సూ — అవస్థితివైశేష్యాదితిచేన్నాఽభ్యుపగమాద్ధృదిహి (7) 2-3-25

అర్థ — అవస్థితివైశేష్యాత్ = చందనపుముద్ద శరీరమునందు ఒకవిశిష్టస్థానమున (హృదయమున) ఉండుటచే శరీరమునందు అంతట సుఖమును కలిగించుచున్నది. ఇతిచేత్ = అనుచో, న = అట్లు కాదు, హృది = హృదయమునందు, అభ్యుపగమాత్ + హి = (జీవుడు ఉండుటను) అంగీకరించుటవలన కదా! (జీవుడు అణుపరిమాణుడైనను శరీరమున నఖశిఖ పర్యంతము జ్ఞానమును కలిగింపగలుగుచున్నాడు.)

వివ — "కతమ ఆత్మా" (బృ- 6-3-7) జీవుడు ఎట్టివాడు

అని ప్రశ్నించి, "యోఽయంవిజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః" "ప్రాణములయందు విజ్ఞానమయుడుగాను హృదయమునందు జ్యోతి స్స్వరూపుడుగాను జీవుడు ఉన్నాడు" అను శ్రుతివలన అణువైన జీవుడు హృదయాంతర్వర్తియై, శరీరమునందు అంతట విజ్ఞానవ్యాప్తిని కలిగించుచున్నాడు అని భావము. చందన దృష్టాంత ప్రదర్శనము ఇందులకే.

242 సూ — గుణాద్వాఽఽలోకవత్ (8) 2-3-26

అర్థ — ఆలోకవత్ = దీపాదుల కాంతివలె, గుణాత్ — వా = గుణభూతమైన జ్ఞానమువలన (ద్వారా) శరీరమునందు అంతట సుఖ దుఃఖజ్ఞానమును కలిగించును.

వివ — దీపముచిన్నది అయినను, తనకాంతిచే అంతటప్రసరించు చున్నది. దీపము గుణి కాంతి దానికి గుణము. ఇట్లే జీవుడు జ్ఞాన స్వరూపుడు, జ్ఞానగుణకుడునై ఉన్నాడు. కావున ఇతడు స్వరూపము చేత అణువైనను, తన గుణభూతజ్ఞానముచేత శరీరమునందు అంతట వ్యాపించి, సుఖదుఃఖాఽనుభూతిని కలిగించుచున్నాడు.

243 సూ — వ్యతిరేకో గంధవత్తథా చ దర్శయతి (8) 2-3-27

అర్థ — గంధవత్ = భూమియొక్క గుణమైన గంధము భూమి కంటె భిన్నముగ ఉండునట్లే, వ్యతిరేకః = జీవాత్మయొక్క గుణ భూతజ్ఞానము పైతము జీవాత్మకంటె భిన్నముగ ఉన్నది. తథా = అట్లు. దర్శయతి చ = శ్రుతి చెప్పుచున్నది.

వివ — "జానాత్యేవాఽయం పురుషః" (బృ- 6-3-3) "ఈ జీవాత్మ తెలిసికొనుచున్నాడు" అను శ్రుతివలనను "నేను తెలిసికొను

చున్నాను ” అను అనుభవమువలనను తెలిసికొను జీవునికంటె భిన్నముగ గుణభూతజ్ఞానము కలదని తెలియుచున్నది. గంధముకలది భూమి (గంధవతీ పృథివీ) (జ్ఞానవాన్ ఆత్మా) జ్ఞానముకలవాడు ఆత్మ అని గదా వ్యవహారము. కావున జీవుడు అణువైనను అతని (గుణభూత) జ్ఞానము వ్యాపకమగుటచే శరీరమున అంతట సుఖదుఃఖానుభవము కలుగుచున్నది.

244 సూ — పృథగుపదేశాత్ (10) 2–3–28

అర్థ — పృథక్ = (జీవునికంటె) వేరుగా, ఉపదేశాత్ = (అతని ధర్మభూత జ్ఞానమును) చెప్పుటవలనను అది సిద్ధించుచున్నది.

వివ — ధర్మియైన జీవునికంటె భిన్నముగ అతని ధర్మభూత జ్ఞానము కలదనుటకు మన అనుభవముతోపాటు “న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే” (బృ–6–3–30) “విజ్ఞాతయగు జీవుని విజ్ఞానమునకు ఎన్నడును లోపము (నాశము) లేదు” అను శ్రుతిప్రమాణము కూడ కలదు. కావున జీవుడు అణుపరిమాణుడు.

245 సూ — తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్ (11) 2–3–29

అర్థ — తత్+గుణసారత్వాత్=ఆ జ్ఞానమనెడి గుణమునుసారముగ గలిగియుండుటవలన, తత్+వ్యపదేశః = జీవాత్మను జ్ఞానశబ్దముచే వ్యవహరించుట సంభవించుచున్నది, ప్రాజ్ఞవత్ = పరమాత్మకువలె

వివ — “యస్సర్వజ్ఞస్సర్వవిత్” ఇత్యాది వాక్యములయందు సర్వజ్ఞుడుగ ప్రస్తుతింపబడిన పరమాత్మ “సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ” ఇత్యాది వాక్యములయందు జ్ఞాన శబ్దముచేత పేర్కొనబడినాడు” “స ఏకో బ్రహ్మణ ఆనన్దః” ఇత్యాది వాక్యములయందు ఆనందగుణకుడుగ

పేర్కొనబడిన పరమాత్మ "అనన్త బ్రహ్మేతి వ్యజానాత్" ఇత్యాది వాక్యములయందు అనన్తశబ్దముచే పేర్కొనబడినాడు. ఇట్లే "విజ్ఞాతార మరే కేన విజానీయాత్" ఇత్యాదివాక్యములయందు విజ్ఞాతగా (విజ్ఞానము కలవాడుగ) పేర్కొనబడిన జీవాత్మయు ధర్మభూతజ్ఞానమాత్ర సారుడగుటచేత "విజ్ఞానం యజ్ఞం తనుతే" (తై. బ్ర- 5-1) ఇత్యాది వాక్యములయందు విజ్ఞానశబ్దముచే పేర్కొనబడినాడు. ఇంతమాత్రము చేత "విజ్ఞానమే ఆత్మ" అని తలంపరాదు. విజ్ఞాతయే ఆత్మ అని సిద్ధాంతము.

246 సూ — యావదాత్మభావిత్వాచ్చ న దోషస్తద్దర్శనాత్.
(12) 2-3-30

అర్థ— యావత్ + ఆత్మభావిత్వాత్ — చ = జీవుని ధర్మభూత జ్ఞానము జీవుడు ఉన్నంతకాలము ఉండునది (నిత్యము) కావునను, న దోషః = "జ్ఞాన" శబ్దముచేత జీవుని పేర్కొనుటలో దోషము లేదు. తత్ + దర్శనాత్ = అట్లు లోకమునందు చూపట్టుటవలన.

వివ— "గోత్వము" అనుధర్మమును పురస్కరించుకొని "గోవు" అను వ్యవహారము ఏర్పడుచున్నది. గోవ్యక్తిలో ఎన్ని మార్పులు సంభవించినను గోత్వము మారదు. ఇట్లే జ్ఞాతయగు జీవునకుజ్ఞానము నిత్యమైన ధర్మము. జీవునివలె అతని ధర్మభూతజ్ఞానము సైతము నిత్యమైనదని భావము. కావున జ్ఞానశబ్దముచే జ్ఞాతయగు జీవుని పేర్కొనుటలో దోషములేదు.

247 సూ — పుంస్త్వాదివత్త్వస్య సతోఽభివ్యక్తియోగాత్
(13) 2-3-31

అర్థ — పుంస్త్వ + ఆదివత్ + తు = పురుషత్వము మొదలగు ధర్మములకు వలె, సతః = ఉన్నటువంటి (నిత్యముగ), అస్య = ఈ జ్ఞానము అనెడి గుణమునకు, అభివ్యక్తియోగాత్ = (ఒక దశయందు

మాత్రమే) అభివ్యక్తి సంభవమగుటవలన (జ్ఞాతయగు జీవునియందు జ్ఞానమనెడి గుణము నిత్యముగ ఉండుటలో బాధలేదు.)

వివ — జ్ఞానము జీవుని నిత్యధర్మమైనచో, అది గాఢనిద్ర యందును భాసింపవలయును కదా. అను సందేహమునకు ఈసూత్రము సమాధానము. పురుషునియందు పుంస్త్వము నిత్యమైన ధర్మము అయినను, అది అతని యౌవనదశలో మాత్రమే వ్యక్తమగుచున్నది. ఇట్లే జీవుని జ్ఞానముకూడ నిత్యమే అయినను అది జాగ్రద్దశయందు మాత్రమే భాసించును. నిద్రాదశయందు భాసింపదు. కావున ఇది దోషముకాదు.

248 సూ — నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగోఽన్యతరనియమో వాఽన్యథా (14) 2-3-32

అర్థ — నిత్య + ఉపలబ్ధి + అనుపలబ్ధిప్రసంగః = (జ్ఞానమే ఆత్మ అని కాని, ఆ జ్ఞానము సర్వత్రవ్యాప్తము అని కాని అంగీకరించు పక్షమున) ఎల్లపుడు జ్ఞానము కలుగుట, కలుగకుండుట అను పరస్పర విరుద్ధక్రియలు జరుగుచుండవలయును. అన్యథా = అట్లుకానిచో, అన్యతరనియమః + వా = జ్ఞానము కలుగుట లేక కలుగకుండుట అను వానిలో ఏదియో ఒక్కటి మాత్రమే సంభవింపవలయును.

వివ — కొందరు జ్ఞానమే ఆత్మ అని తలంచుచున్నారు. అట్లే ఆ జ్ఞానము సర్వవ్యాప్తమనియు తలంచుచున్నారు. ఆ పక్షమున జ్ఞానము సర్వదా భాసింపవలయును. అది నిత్యమైనది కదా. కావున జీవుడు జ్ఞాత, జ్ఞానగుణకుడు అని సిద్ధాంతము.

## 5-8 కర్త్రధికరణము 5 (7)

### జీవుడు కర్త.

249 సూ — కర్తా శాస్త్రార్థవత్త్వాత్ (1) 2-3-33

అర్థ — శాస్త్ర ఽ అర్థవత్త్వాత్ = విధినిషేధరూపమైన శాస్త్రము ప్రయోజనవంతము కావలసియున్నందువలన, కర్తా = (జీవుడు) కర్త

వివ — జ్ఞాఽధికరణమునందు జీవుడు జ్ఞాతయని నిరూపింప బడినది. ఈ యధికరణమున జీవుడు "కర్త" అను విషయము నిరూపింప బడుచున్నది. "అహంకారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే" (భ.గీ 3-27) "ప్రకృతి గుణములైన సత్త్వరజస్తమోగుణములచే చేయబడు కర్మలకు అహంకారముచే మూఢుడైన జీవుడు తాను కర్తను అని తలంచుచున్నాడు" ఇత్యాదిప్రమాణములు "జీవుడు కర్త కాడని, ప్రకృతి గుణములే కర్తలు" అని తెలుపుచున్నవి. సాంఖ్యులును ఇట్లే చెప్పుచున్నారు కావున కర్త జీవుడా? ప్రకృతిగుణములా? అను సందేహమును తొలగించుటకై ఈ అధికరణము ఆరంభమైనది. జీవుడే కర్త, ప్రకృతిగుణములు కావు. "సత్యం వద" "సత్యమును పలుకుము" "మా హింస్యాత్సర్వాభూతాని" "సమస్త ప్రాణులను (ఏప్రాణిని) హింసింపరాదు" ఈ మొదలైన విధినిషేధవాక్యములు జీవుని నిర్దేశించియేగదా ప్రవర్తించినవి? జీవుడు కర్త గానిచో, ఈ విధినిషేధములకు ప్రయోజనమేమి? "ఉపాసీత" "ఉపాసింపవలయును" "యజేత," "యజ్ఞమొనర్పవలయును" ఈ విధములైన విధివాక్యములనుబట్టి ఉపాసనాదులను గావించి, ఉత్తమలోకములను పొందువాడు జీవుడేకదా? కావున జీవుడే కర్త. కాని సాంసారిక విషయ ప్రవృత్తులయందు ప్రకృతిగుణప్రేరితుడై, ఇతడు కర్త యగుచున్నాడు. కేవల జీవుడు కాదు. ఈ విషయమునే—

శ్లో॥ తత్రైవం సతి కర్తారం ఆత్మానం కేవలం తు యః।
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః॥ (భ.గీ18-16)

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్ చేష్టా దైవం చైవాఽత్ర పంచమమ్॥
(భ.గీ. 18-14)

అనుచు భగవద్గీత వివరించినది.

250 సూ — ఉపాదానాద్విహారోపదేశాచ్చ (2) 2-3-34

అర్థ— ఉపాదానాత్ = ఇంద్రియములను గ్రహించుటవలనను, విహార + ఉపదేశాత్‌చ = శరీరమున విహరించుటను శ్రుతి చెప్పుటవలనను జీవుడు కర్తయే.

వివ — "స యథా మహారాజః స్వే జనపదే యథా కామం పరివర్తతే; ఏవమేవైష ఏతాన్ ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే యథా కామం పరివర్తతే" (బృ-4-1-18) "మహారాజు తన పరివారమును తీసికొని, తన దేశమునందు యథేచ్ఛగ ఎట్లు సంచరించునో, అట్లే ఈ జీవుడు తన ఈ ఇంద్రియములను తీసికొని, తన శరీరమునందు యథేచ్ఛగ సంచరించుచున్నాడు" అను వాక్యమునందు ఇంద్రియములను గ్రహించుటకు, విహరించుటకును కర్తగా జీవుడు పేర్కొనబడుటవలన జీవుడు కర్తయే అని భావము.

251సూ— వ్యపదేశాచ్చ క్రియాయాం నచే న్నిర్దేశవిపర్యయః (3) 2-3-35

అర్థ — క్రియాయాం = లౌకికవైదిక కార్యములయందు, వ్యపదేశాత్ + చ = జీవుని కర్తగా చెప్పియున్నందువలనను (జీవుడు కర్త) నచేత్ + అట్లు కానిచో, నిర్దేశవిపర్యయః = "విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపి చ" (తై ఆ 5-1) అను వాక్యమునందు "విజ్ఞానం" అనిగాక "విజ్ఞానేన" అని ప్రయోగము మారియుండవలయును

వివ — "విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపి చ" అను వాక్యమునందు విజ్ఞానము అనగా జీవుడు యజ్ఞమును (లౌకిక) కర్మలను చేయుచున్నాడు అనిచెప్పుటవలన, ఆ యజ్ఞాదులకు కర్త జీవుడు అని స్పష్టమగుచున్నది. కావున జీవుడు కర్తఅనిఅంగీకరింపవలయును ఇచటి విజ్ఞానశబ్దము జీవునిగాక అంతకరణరూపమైన బుద్ధిని బోధిం

చును అనినచో "విజ్ఞానేన యజ్ఞం తనుతే" "బుద్ధిచే యజ్ఞము చేయు చున్నాడు" అని విజ్ఞానశబ్దమున విభక్తి మారియుండవలయును. కావున విజ్ఞానశబ్దము ఇచట జీవునే బోధించుచు, అతడు "కర్త" అను విషయమును స్పష్టము గావించుచున్నది.

252 సూ — ఉపలబ్ధివదనియమః (4, 2–3–36

అర్థ— ఉపలబ్ధివత్ = ఆత్మోపలబ్ధివలె, అనియమః = భోక్తృత్వ నియమము లేకపోవలసివచ్చును.

వివ — "ప్రకృతి కర్త, జీవుడు భోక్త" అనుపక్షమున ప్రకృతి సంబంధము సర్వాత్మసాధారణమగుటచే "ఈ కర్మఫలమునకు ఈ ఆత్మయే భోక్త" అను నియమము సంభవింపదు. (సర్వవ్యాప్త మగు) విభువగు జ్ఞానము ఆత్మ అను పక్షమున ఆత్మోపలబ్ధి సర్వదా కలుగుచుండవలయును. లేదా ఎన్నడును కలుగకపోవలసివచ్చును అని "నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగోఽన్యతర నియమోవాఽన్యథా" అను పూర్వసూత్రమునందు దోషము చూపబడినది గదా: ఇట్లే కర్త ఒకడు, భోక్త మరియొకడు అగు పక్షమున ఎవడైనను భోక్త కావచ్చును అను వ్యవస్థ ఏర్పడును. కావున ఎవడు కర్తయో అతడే భోక్త అని గ్రహింపవలయును. అపుడు కర్త, భోక్త జీవుడే అగును.

253 సూ — శక్తివిపర్యయాత్ (5) 2–3–37

అర్థ — శక్తివిపర్యయాత్ = భోక్తృత్వశక్తిమారవలసివచ్చుట వలనను జీవుడే కర్త.

వివ — "ప్రకృతి కర్త; జీవుడు భోక్త" అనువాదము సరికాదు; "ఎవడు కర్తయో అతడే భోక్త" అనుట అనుభవసిద్ధము. కావున ప్రకృతి. లేక బుద్ధే కర్తయగుపక్షమున అదియేభోక్తయగును. జీవుని భోక్తృత్వ

శక్తి ప్రకృతికి సంక్రమింపవలయును. అపుడు జీవుని భోక్తృత్వ శక్తి నశించును అని భావము.

254 సూ — సమాధ్యభావాచ్చ (6) 2-3-38

అర్థ — సమాధి + అభావాత్ + చ = (ప్రకృతికంటెను తాను వేరు అనెడి) స్థిరనిశ్చయము (ప్రకృతికి) సంభవింపనందువలనను (జీవుడే కర్త; ప్రకృతి కాదు)

వివ — మోక్షసాధనమైన యోగసమాధియందు ప్రకృతి కర్త కాజాలనందువలనను, అది కర్తయగు పక్షమున "నేను ప్రకృతికంటె భిన్నుడను" అను సమాధి దానికి సంభవింపనందునను జీవుడే కర్త; ప్రకృతి కాదు.

255 సూ — యథా చ తక్షోభయథా (7) 2-3-39

అర్థ — తక్షా = వడ్రంగి, యథా = ఏ విధముగ, ఉభయథా చ = రెండువిధములుగ (కర్తగను, అకర్తగను) ఉండునో (అట్లే జీవుడు కర్తగను అకర్తగను ఉండును.)

వివ — వడ్రంగి అవసరమైనపుడు వడ్రంగము చేయును. అవసరము లేని సమయమున చేయడు. అనగా అతడు వడ్రంగము చేయువాడే అయినను సర్వదా వడ్రంగము చేయుచునే ఉండవలయునను నిర్బంధములేదు. అతని ఇచ్ఛానుసారము కొన్నిసమయము లందు మాత్రమే వడ్రంగము చేయును. ఇట్లే జీవుడు కర్తయైనను తన ఇచ్ఛానుసారము కొన్నిసమయములయందు మాత్రము కార్యములను గావించును. కొన్నిసమయములయందు గావింపడు. ప్రకృతి లేక బుద్ధి కర్తయగుపక్షమున అవి అచేతనములగుటచే వానికి ఇచ్ఛ

అనిచ్ఛ అనునవి సంభవించనందువలన సర్వదాకార్యము జరుగుచుండ వలయును. ఇది లోకవిరుద్ధము. కావున చేతనుడైన జీవుడే కర్త

## 59 పరాయత్తాఽధికరణము 6 (2)

జీవుని కర్తృత్వాదికరము పరమాత్మ సంకల్పాధీనము.

256 సూ — పరాత్తుతచ్ఛ్రుతేః (1) 2-3-40

అర్థ— తత్ + తు = (జీవునియొక్క) ఆ కర్తృత్వము, పరాత్ = పరమాత్మవలన (కలుగుచున్నది) శ్రుతేః = (అట్లుచెప్పు) శ్రుతివాక్యములవలన.

వివ — "అంతః ప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా" (తై. ఆ 3-2-10) "లోపల ప్రవేశించి జనులను శాసించువాడు పరమాత్మ", "య ఆత్మానమన్తరో యమయతి" (బృ. 5-7-3) "ఎవడు ఆత్మయందు ఉండి ఆత్మను, నియమించుచున్నాడో" ఈ మొదలైన శ్రుతి వాక్యములు,

శ్లో॥ "సర్వస్యచాఽహం హృది సన్నివిష్టః,
మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ॥" (భ.గీ. 15-15)

"నేను అందరి హృదయములయందును ఉన్నాను. నావలన వారికి స్మరణము, జ్ఞానము, అజ్ఞానము కలుగుచున్నవి" ఇత్యాది స్మృతివాక్యములవలనను జీవుని కర్తృత్వము పరమాత్మాధీనమని తెలియుచున్నది. జీవుడు కర్తయైనను స్వతంత్రుడు కాడు అని భావము.

257 సూ — కృతప్రయత్నాఽపేక్షస్తు విహితప్రతిషిద్ధాఽవైయర్థ్యాదిభ్యః (2) 2-3-41

అర్థ — కృతప్రయత్న + అపేక్షః + తు = పరమాత్మ జీవుని ప్రయత్నమును పేక్షించియుండువాడు. విహితప్రతిషిద్ధ + అవైయర్థ్య +

ఆదిభ్యః = విధినిషేధవాక్యములకు వైయర్థ్యము(నిష్ప్రయోజనత్వము) కలుగకుండవలసియున్నందువలన.

వివ—జీవుని కర్తృత్వముపరమాత్మాఽధీనమైనచో, జీవుడు తాను కావించు పుణ్యపాపములకు బాధ్యుడు కాకపోవలసివచ్చును గదా! అని శంకింపరాదు. పరమాత్మయొక్క అనుమతితో జీవుడు తొలుత స్వేచ్ఛాను సారముగ కర్మలలో ప్రవర్తించును. అతని పుణ్యపాపకర్మలనుబట్టి తరువాతి కర్మలలో పరమాత్మ అతనిని ప్రవర్తింపజేయును. కావున విధినిషేధవాక్యములు వ్యర్థములుగావు. తన పూర్వకర్మలనుబట్టియే జీవుడు పరమాత్మచే పుణ్యపాపరూపకార్యకార్యములయందు ప్రవర్తింప జేయబడుటవలనభగవన్నిగ్రహాఽనుగ్రహపాత్రుడగుటయుసంభవించు చున్నది. ఈ రీతిని జీవుడు పరమాత్మాధీనమైన కర్తృత్వముగలవాడని సిద్ధించుచున్నది.

## 60 అంశాఽధికరణము 7 (11)

పరమాత్మయొక్క అంశ జీవుడు.

**258 సూ — అంశో నానావ్యపదేశా దన్యథాచాఽపి దాశకిత-వాదిత్వ మధీయత ఏకే (1) 2-3-42**

అర్థ — నానావ్యపదేశాత్ = జీవాత్మ, పరమాత్మలకు భేదమును చెప్పుటవలనను, అన్యథా చ + అపి = వేరే విధముగ (అభేదమును) చెప్పుటవలనను, అంశః = జీవాత్మ పరమాత్మయొక్క అంశము. ఏకే = కొందరు (అథర్వణికులు) దాశకితవ + ఆదిత్వం = (పరమాత్మకు) దాశ (బెస్తలు) కితవాది (జూదరి మొదలగువారి) భావమును, అధీయతే = పఠించుచున్నారు.

విప— "పృథ గాత్మానం ప్రేరితారం చ మత్వా" [శ్వేత1-6]

"జీవాత్మను, అతనిని ప్రేరేపించు పరమాత్మను భిన్నులనుగా ధ్యానించి" ఈ మొదలైన ఉపనిషద్వాక్యములు. జీవాత్మ పరమాత్మలకు భేదమును బోధించుచున్నవి. "తత్త్వమసి" (ఛా–6–10–౯) "నీవు ఆ పరమాత్మవై యున్నావు." ఈ మొదలైన ఉపనిషద్వాక్యములు జీవాత్మపరమాత్మ లకు అభేదమును బోధించుచున్నవి. కొందరు జీవాత్మపరమాత్మల భేదమును అంగీకరించి, అభేదమును బోధించువాక్యములు ఔపచారికము అని యనుచున్నారు. మరికొందరు అభేదమే ముఖ్యమని తలంచి, భేదమును బోధించు వాక్యములు ఔపచారికములు అని తలంచుచున్నారు. అవిద్యావిశిష్టమైన పరమాత్మయే జీవుడు అని వీరి ఆశయము. కాని, జీవాత్మపరమాత్మల భేదాఽభేదములను శ్రుతియే ఉపదేశించుటచే అందు ఒక దానిని ముఖ్యమని, మరియొక దానిని గౌణమని తలంప రాదు. ఉపనిషత్తులయందు "సర్వజ్ఞము, సత్య సంకల్పము, నిర్దోషము" అని కీర్తింపబడిన పరబ్రహ్మము అవిద్యావిశిష్టమై, అజ్ఞాని ఎట్లగును? కావున జీవాత్మ పరమాత్మయొక్క అంశము" అని సిద్ధాంతము. "య ఆత్మని తిష్ఠన్ యస్యాత్మా శరీరం" (బృ–5–3–4) "ఏ పర మాత్మ జీవాత్మయందు ఉన్నాడో, ఏ పరమాత్మకు జీవాత్మ శరీరమై ఉన్నాడో (అతడు అంతర్యామి)" అను శ్రుతి జీవాత్మపరమాత్మలకు శరీరశరీరి భావమును బోధించుచున్నది. ఈ శరీర శరీరిభావమును పురస్కరించుకొని జీవాత్మ పరమాత్మలకు భేదమును, అభేదమును సమన్వయింపవచ్చును. జీవుడు అజ్ఞుడు; పరమాత్మ సర్వజ్ఞుడు. కావున వీరు పరస్పరము భిన్నులు. అయినను, వీరికిగల శరీరశరీరిభావ సంబంధముచే అభిన్నులుగను బోధింపబడవచ్చును. శరీరవాచక శబ్దములు శరీరి పర్యంతబోధకములుగదా? "దేవదత్తుడు" అను శబ్దము ఆ వ్యక్తియొక్క శరీరమును, అందున్న జీవాత్మను బోధించినట్లే ఆ జీవునియందు అంతరాత్మగా ఉన్న పరమాత్మను సైతము బోధించు

చున్నది. కావున జీవవాచకశబ్దములు జీవశరీరకపరమాత్మబోధక ములు. ఇట్లే సకలశబ్దములు సర్వాంతర్యామియైన పరమాత్మను (ఆయా పదార్థములను శరీరముగాఁజేసికొని, వానియందు అంతర్యామిగా ఉన్నవానిని) బోధించుచున్నవి. కావున "తత్త్వమసి", "అయమాత్మా బ్రహ్మ" మొదలైన ఉపనిషద్వాక్యములు శరీరశరీరిభావమూలక మైన జీవాత్మపరమాత్మల అభేదమును అభిధావృత్తి (ముఖ్యవృత్తి) చేతనే బోధించుచున్నవి "దేవదత్తుడు" అను పదము జీవునితో గూడిన శరీరమును ఆ జీవాంతర్యామియైన పరమాత్మను బోధించును.

259 సూ — మంత్రవర్ణాత్ (2) 2-3-43

అర్థ — "పాదోఽస్య విశ్వా భూతాని" (పు. సూక్తము) "సమస్త భూతములు బ్రహ్మముయొక్క పాదములు" (నాల్గవభాగము) అను మంత్రభాగమునుబట్టియు జీవుడు పరమాత్మయొక్క అంశమని తెలియుచున్నది. ఇచట పాదమనగా అంశము అని భావము.

260 సూ — అపి స్మర్యతే (3) 2-3-44

అర్థ — స్మర్యతే + అపి = స్మృతియందును ఈ విషయము చెప్పబడియున్నది.

వివ — "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" (భ.15-7) "నాయొక్క అంశమే జీవలోకమున సనాతనుడైన (నిత్యుడైన) జీవుడై వెలుగొందుచున్నది" అనుచు భగవద్గీతయు జీవుడు పరమాత్మయొక్క అంశమని స్పష్టము చేయుచున్నది.

శ్రీ శంకరభాష్యమున ఈ సూత్రము "అపిచ స్మర్యతే" అని గ్రైకొనబడినది.

261 సూ — ప్రకాశాదివత్తు నైవం పరః (4) 2-3-45

అర్థ — పరః + తు = పరమాత్మ మాత్రము, ఏవం = ఇట్లు (జీవునివలె కర్మఫలభోక్త) న = కాడు. ప్రకాశ + ఆదివత్ = వెలుతురు, జాతి గుణములు మొదలగు వానివలె జీవుడు పరమాత్మకు అంశము (విశేషము) అగుచున్నాడు.

వివ — జీవుడు పరమాత్మయొక్క అంశమగుచో జీవుని అజ్ఞత్వాది దోషములు పరమాత్మకు సంక్రమించును గదా! అనినచో, అట్లు కాదు. ఇచట అంశము అనగా ఒక వస్తువులోని ఒకభాగము అనికాక సూర్యునకు వెలుగువలె పరమాత్మకు గుణము లేక విశేషణము అని భావము. ప్రకాశవిశిష్టుడైన సూర్యునియందు అతనికి గుణభూతమైన (విశేషణమైన) ప్రకాశము అంశమగుచున్నది గదా! ఈ రీతిని పరమాత్మ విశేషము— జీవాత్మ విశేషణము. విశేష్యవిశేషణముల స్వరూప స్వభావములు పరస్పరము భిన్నములుగ నుండవచ్చును. కావున విశేష్యమైన పరమాత్మ సర్వజ్ఞుడు, సత్యసంకల్పుడు, దోషగంధరహితుడుగా, విశేషణమైన జీవుడు అజ్ఞుడు, పరతంత్రుడు, సుఖదుఃఖభోక్త నగుచు, అతనికి అంశమగుచున్నాడు అని భావము

262 సూ — స్మరంతి చ (5) 2-3-46

అర్థ — స్మరంతి చ = పరాశరాదిస్మృతికర్తలును ఈ విషయమును తెలుపుచున్నారు.

వివ — "ఏకదేశస్థితస్యాఽగ్నేః జ్యోత్స్నా విస్తారిణీ యథా పరస్య బ్రహ్మణోశ్శక్తిః తథేద మఖిలం జగత్" (విష్ణుపు- 1-22-56) "ఒకచోట నున్న అగ్నియొక్క కాంతి నలువైపుల ఎట్లు వ్యాపించు చున్నదో, అట్లే ఈజగత్తు అంతయుపరమాత్మయొక్క శక్తియై, అంతట

వ్యాపించియున్నది" అనుచు పరాశరమహర్షి అగ్నికి కాంతివలె ఈ చరాఽచర జగత్తు పరమాత్మకు అంశమని స్పష్టము చేసినాడు. ఇట్లే, "తత్సర్వం వై హరేస్తనుః" (విష్ణు. పు- 1-22-38) "జగత్సృష్టి కావలసినశక్తియంతయు పరమాత్మయైన శ్రీహరికి శరీరము అనుచు పరమాత్మకు చేతనాఽ చేతనములతో గల శరీరశరీరిభావమును సైతము విశదీకరించినాడు. కావున జీవుడు పరమాత్మయొక్క అంశము అయినను, జీవదోషములు పరమాత్మకు అంటవు.

263 సూ — అనుజ్ఞాపరిహారౌ దేహసంబంధాజ్జ్యోతిరాదివత్.
(6) 2-3-47

అర్థ — జ్యోతిః + ఆదివత్ = అగ్ని మొదలగు వానికివలె, దేహ సంబంధాత్ = బ్రాహ్మణాదిదేహసంబంధమునుబట్టి అనుజ్ఞాపరిహారౌ = వేదాధ్యయనాదులయందు కొందరిని అనుమతించుట, మరి కొందరిని నిషేధించుట సంభవించుచున్నది.

వివ — వివాహాదిశుభస్థలములయందున్న అగ్నిని పరిగ్రహించుచు, శ్మశానాది అశుభస్థలములయందు ఉన్న అగ్నిని ఎట్లు పరిహరించుచున్నామో, అట్లే జీవులందరు బ్రహ్మాఽంశభూతులై యున్నను ఆయా జీవులకు గల బ్రాహ్మణాదిదేహసంబంధమునుబట్టి కొందరికి మాత్రమే వేదాధ్యయనాదుల యందు అనుమతి లభించుట, మరి కొందరికి లభింపకపోవుట అనునది సంగతమగుచున్నది.

264 సూ — అసంతతేశ్చాఽవ్యతికరః (7) 2-3-48

అర్థ — అసంతతేః = జీవుడు (అణుపరిమాణుడై) ఇతర శరీరములయందంతు వ్యాపింపనందునవలన, అవ్యతికరః + చ = కర్మఫల

భోగ సాంకర్యము కలుగదు.

వివ — జీవుడు అణుపరిమాణుడు. ప్రతిదేహమునందు ఒక్కొక్క జీవుడుండును. వీరుపరస్పరము భిన్నులు. కావున ఒకనికర్మఫలమును మరియొకడు అనుభవింపవలసిన ప్రసక్తి ఏర్పడదు. జీవుడు బ్రహ్మ మగుచో ఈ దోషములు అతనికిని తప్పవు గదా!

265 సూ — ఆభాసా ఏవ చ (8) 2-3-49

అర్థ — ఆభాసాః + ఏవ చ = అవిద్యావశమున లేక మాయో పాధివశమున పరబ్రహ్మమే జీవుడుగ వ్యవహరింపబడుచున్నది అను విషయమున చూపబడిన హేతువులు ఆభాసమాత్రములే. సద్ధేతువులుకావు. "పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా", "జ్ఞాఽజ్ఞౌ ద్వావజావీశనీశౌ" "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్నన్నన్యో అభిచాకశీతి", "నిరవద్యం నిరంజనం" ఇత్యాద్యనేకశ్రుతులు జీవాత్మపరమాత్మల స్వరూపస్వభావములు పరస్పరభిన్నములు అని తెలుపుచున్నవి గదా!

266 సూ — అదృష్టాఽనియమాత్ (9) 2-3-50

అర్థ — అదృష్ట + అనియమాత్ = అదృష్టము నియమహేతువు కానందువలన భోగవ్యవస్థ సిద్ధింపదు.

వివ — సత్యము లేక మిథ్య అయిన ఉపాధికి అదృష్టము కారణమగుటచే దీనినిబట్టి భోగవ్యవస్థ ఏర్పడవచ్చునని తలంచినను, ఆదోషములు అన్నియు బ్రహ్మమునకే ఏర్పడకతప్పనియున్నందువలన ఈ వాదము సంగతముకాదు. బ్రహ్మము అన్నివస్తువులకు ఏకైకమగుగదా!

267 సూ — అభిసంధ్యాదిష్వపి చైవమ్ (10) 2-3-51

అర్థ — అభిసంధి + ఆదిషు + అపి చ = సంకల్పాదులయందుం గూడ, ఏవం = ఇట్లే నియమము సిద్ధింపదు.

వివ — అదృష్టమునకు హేతువులయిన సంకల్పోద్యోగాదులకు ఫలవ్యవస్థాహేతుత్వము సిద్ధింపదు. బ్రహ్మము అచ్ఛేద్యమగుటవలన తద్భిన్నముగ నేదియు ఉండదు గదా!

268 సూ — ప్రదేశభేదాదితి చేన్నాఽంతర్భావాత్ (II) 2-3-52

అర్థ— ప్రదేశభేదాత్ = ఉపాధితో గూడిన బ్రహ్మప్రదేశముల భేదముబట్టి (కర్మఫలభోగవ్యవస్థ సిద్ధించును) ఇతిచేత్ = అనినచో; న = అట్లుకాదు. అంతర్భావాత్ = అట్టిప్రదేశములును బ్రహ్మమునందే అంతర్భవించుటవలన.

వివ — బ్రహ్మము ఒక్కటియే అయినను, అందలి భాగములు నానావిధములైన ఉపాధులతో సంబంధించియుండును. ఇట్లు ఉపాధి సంబంద్ధములైన భిన్నభిన్నబ్రహ్మభాగములు కర్మఫలమును అనుభవించును. కావున ఫలాఽనుభవవిషయమున సాంకర్యమేర్పడదు అనియు తలంపరాదు. ఉపాధిసంబద్ధమైన భాగములు కూడ బ్రహ్మమే కదా! అపుడు కర్మఫలభోక్తృత్వరూపదోషము బ్రహ్మమునకే సంక్రమించును. ఉపాధిరహితమైన బ్రహ్మమే కదా ఉపాధివిశిష్ట మగుచున్నది! కావున జీవవిభుత్వవాదమువలె జీవబ్రహ్మైక్యవాదము పైతము అసంగతము అని భావము.

ద్వితీయాధ్యాయ తృతీయపాదార్థ సంగ్రహశ్లోకము

శ్లో॥ క్లప్తిర్వ్యోమాదికేఽపి క్రమభువి చ విభోఃప్రాచ్యతత్త్వైర్విశిష్టాత్,
జీవస్యౌపాధికౌ తు ప్రజననవిలయౌ చిద్ఘనజ్ఞాతృతాఽస్య।
కర్తృత్వం పారతంత్ర్యంగుణతమనయతో విశ్వరూపఽంశతాచేతి,
అమ్నాయాఽన్యోన్యబాధవ్యపనయన వియత్పాదసాధ్యానితత్త్వా॥

తా—ఈద్వితీయాధ్యాయ తృతీయపాదమునందలి వియత్పాద

మున ఆకాశమునకు, వాయువునకు, ఉత్పత్తి కలదని, తేజోఽధికరణ మున పూర్వపూర్వతత్త్వవిశిష్టుడైన పరమాత్మవలననే మహదాదిసృష్టి ఏర్పడుచున్నది, కాని కేవల (అచేతనములైన) మహదాదులవలన కాదని; ఆత్మాధికరణమున నిత్యుడైన జీవునకు "ఉత్పత్తి" అనగా దేహ సంబంధము, "వినాశము" అనగా దేహవియోగమగని; జ్ఞాధికరణమున జీవుడు జ్ఞానస్వరూపుడు, జ్ఞానగుణకుడు, జ్ఞాత అని, కర్త్రధికరణమున జీవుని కర్తృత్వము; పరాయత్తాధికరణమున జీవుని అకర్తృత్వాదులు పరమాత్మాఽధీనములని ; అంశాధికరణమున శుక్లాదిగుణములు ఘటాది ద్రవ్యములకు, దేవాదిదేహములు జీవులకు ఎట్లు అంశము అగుచున్నవో, అట్లే ఈ చిదచిదాత్మక ప్రపంచము ఆ పరమాత్మయొక్క అంశమని నిరూపింపబడినది. ఈ విధముగ ఈ వియత్పాదము ఆకాశాదులకు ఉత్పత్తి కలదని, లేదని పరస్పరవిరుద్ధముగ ప్రవచించు శ్రుతివాక్యము లను సమన్వయించినది. కావున బ్రహ్మము సర్వమునకు కారణమని సిద్ధించుచున్నది.

ద్వితీయాధ్యాయ తృతీయపాదము సమాప్తము.



శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# ద్వితీయాధ్యాయ చతుర్థపాదము

## ప్రాణపాదము

## 61 ప్రాణోత్పత్త్యధికరణము 1 (3)

ఆకాశాదులవలె ఇంద్రియములును సృజింపబడుచున్నవి.

269 సూ — తథా ప్రాణాః (1) 2-4-1

అర్థ — ప్రాణాః = (జీవునకు ఉపకరణములైన) ప్రాణములు, తథా = జీవునివలె నిత్యములు (పుట్టుక లేనివి)

వివ — "ఋషయోవావ తేఽగ్రే సదాసీత్ - ప్రాణావా ఋషయః"(శతపథ-6-1-6) "సృష్టికి పూర్వము ఋషులు ఉండిరి. ఋషులు అనగా ప్రాణములు"అనుటచేత సృష్టికి ముందేఉన్న ఇంద్రియములు (ప్రాణములు) నిత్యములు. సృజింపబడవు అని తెలియుచున్నది అని పూర్వపక్షము.

270 సూ — గౌణ్యసంభవాత్తత్ప్రాక్ఛ్రుతేశ్చ (2) 2-4-2

అర్థ — అసంభవాత్ = "ఋషయః" అను బహువచనము పరమాత్మ విషయమైన అసంభవమగుటవలన, తత్ + ప్రాక్ఛ్రుతేః + చ = ఆ పరమాత్మ యొక్కడే సృష్టికిపూర్వమునందు ఉన్నాడు అని తెలుపు శ్రుతివాక్యమువలనను, గౌణీ = "ఋషయః", "ప్రాణాః" అను పదములలో బహువచనము గౌణార్థకము. (అవివక్షితము)

వివ — పై "ఋషి", "ప్రాణము" అను పదములు పరమాత్మ వాచకములు. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్", "ఏకోహ వై నారాయణ ఆసీత్" (మహోపనిషత్- 1-6) ఈ మొదలైన శ్రుతివాక్యములు సృష్టికి పూర్వము పరమాత్మ యొక్కడేఉన్నట్లు తెలుపుచున్నవిగదా! "ఋషి"

అనగా సర్వజ్ఞుడు అని యర్థము. "ప్రాణము" అనగా సర్వమును జీవింపజేయువాడని అర్థము. కావున "ఋషయోవావతేఽగ్రే సదాసీత్" అనుశ్రుతివాక్యము సృష్టికి పూర్వమునందు పరమాత్మ యున్నాడనియే బోధించుచున్నది. అట్లైనచో "ఋషయః", "ప్రాణాః" అను బహు వచనప్రయోగములు ఎట్లు సంగతములగును? అని శంకింపనవసరము లేదు. అచట బహువచనము అవివక్షితము అని సిద్ధాంతము.

శ్రీశంకరులు "గౌణ్యసంభవాత్" అన నది ఒక సూత్రముగను, "తత్ప్రాక్ఛ్రుతేశ్చ" అనునది వేరొక సూత్రముగను గ్రహించిరి.

271 సూ — తత్పూర్వకత్వాద్వాచః (3) 2–4–3

అర్థ — వాచః = (పరమాత్మ వ్యతిరిక్తమైన) వాక్కు (నామ ధేయము), తత్ + పూర్వకత్వాత్ = (ఆ పరమాత్మ గావించిన) వియ దాదిసృష్టికి తర్వాత ఏర్పడిన దగుటవలనను ప్రాణశబ్దము పరమాత్మ వాచకమే అగుచున్నది.

వివ— "తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్ తన్నామరూపాభ్యాం వ్యాక్రియతే"(బృ–3–4–5) "ఈ ప్రపంచమంతయు సృష్టికి పూర్వము నామరూపవిభాగము లేకుండ ఉండినది. పిమ్మట సృష్టిసమయమున నామరూపవిభాగమును పొందినది" అను శ్రుతినిబట్టి సృష్టికి ముందు ప్రాణశబ్దవాచ్యములైన ఇంద్రియములు గాని, వానికి వాచకములైన ప్రాణాదిశబ్దములు గాని లేవని స్పష్టమగుచున్నది గదా! కావున పై "ఋషయోవావతేఽఽగ్రే సదాస ప్రాణావా ఋషయః" అనుశ్రుతివాక్య మునగల ప్రాణశబ్దము సృష్టికిపూర్వమునను న్న పరమాత్మను బోధించు చున్నదిగాని ఇంద్రియములను బోధింపజాలదని భావము.

## 62 సప్తగత్యధికరణము 2 (2)

ఇంద్రియములు పదునొకండు.

272 సూ — సప్తగతేర్విశేషితత్వాచ్చ (1) 2-4-4

అర్థ— సప్త = (ఇంద్రియములు) ఏడు, గతేః = ఏడు ఇంద్రియములకు జీవునితోడి గమనము చెప్పుటవలనను; విశేషితత్వాత్ + చ = ఏడింటికి మాత్రమే విశేష (ప్రత్యేక) నిర్దేశము ఉండుటవలనను.

వివ — ఇంద్రియములు అయిదు, ఆరు, ఏడు, పదునొకండు అని వేర్వేరు మతములు గలవు. ఇంద్రియములు ఏడు అను మతము ఈ సూత్రముచే వివరింపబడుచున్నది. "సప్త ఇమే లోకాః యేషు చరన్తి ప్రాణాః ; గుహాశయాః నిహితాస్సప్త సప్త" "ఇంద్రియములు సంచరించు లోకములు ఏడు, ఇంద్రియములు ప్రతిప్రాణియొక్క హృదయకోశమునందు ఏడేసి చొప్పున నున్నవి" (ము- 2-1-7) అను శ్రుతివలన జీవునితో కలిసి సంచరించు ప్రాణములు ఏడు అని తెలియుటవలనను, " యదా పంచాఽవతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ, బుద్ధిశ్చ న విచేష్టేత తామాహుః పరమాంగతిం" (కఠ-2-6-10) "చక్షురాదిజ్ఞానేంద్రియములు అయిదు, మనస్సు ఎపుడు ఆత్మతో కలిసి యుండునో, బుద్ధియు నిశ్చలముగ నుండునో అట్టి స్థితిని ఉత్తమ మోక్షముగ చెప్పెదరు" అనుచు పంచజ్ఞానేంద్రియములు, మనస్సు, బుద్ధి అను ఏడు ఇంద్రియములనే విశేషించి పేర్కొనుటవలనను, ఇంద్రియములు ఏడు అని స్పష్టమగుచున్నది. ఇది పూర్వపక్షము.

273 సూ — హస్తాదయస్తు స్థితేఽతో నైవమ్ (2) 2-4-6

అర్థ— హస్త + ఆదయః + తు = హస్తాదికర్మేంద్రియములును స్థితే = జీవుడు శరీరమున నుండగా ఉపకారములగుచున్నవి. అతః = ఇందువలన, ఏవం + న = ఇట్లు "ఇంద్రియములు ఏడు" అనుట తగదు.

వివ — ఇంద్రియములు ఏడుకాదు, పదునొకండు అని సిద్ధాంతము. జ్ఞానేంద్రియములు అయిదు, కర్మేంద్రియములు అయిదు,

మనస్సు- ఇవి ఏకాదశేంద్రియములు. "దశమే పురుషే ప్రాణాః ఆత్మైకాదశ" (బృ- 3-9-4) "అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, మనస్సు పురుషునియందు గలవు"అని శ్రుతిప్రమాణము. జ్ఞానేంద్రియములు జీవునితో కలిసి శరీరాంతరమును పొందుచున్నవి. కర్మేంద్రియములు ఆయా శరీరములతో ఉత్పత్తివినాశముల నందుచు, ఉపకారకములగుచుండును. బుద్ధి ప్రత్యేకించి ఇంద్రియము కాదు. మనోవృత్తిభేదము. "సప్త ప్రాణాః" అనుట ఆ ఏడింటి ప్రాధాన్యమునుబట్టి మాత్రమే.

## 63 ప్రాణాణుత్వాధికరణము 3 (2)

### ఇంద్రియములు అణువులు.

274 సూ — అణవశ్చ (1) 2-4-6

అర్థ—అణవః+చ=ప్రాణములు అణుపరిమాణములునై యున్నవి

వివ — "ప్రాణమనూత్క్రామన్తం సర్వే ప్రాణాః అనూత్క్రామంతి" (బృ- 4-4-2) "శరీరమునుండి ఉత్క్రమించుచున్న ముఖ్య ప్రాణమునుఅనుసరించి,తక్కినప్రాణములును ఉత్క్రమించుచున్నవి" అను శ్రుతివాక్యము ప్రాణములకును ఉత్క్రాంతిని తెలుపుచున్నది. అట్లు ఉత్క్రమించుచున్న ప్రాణములను (ఇంద్రియములను) సమీపమున ఉన్నవారును గుర్తింపలేకున్నారు. కావున ఇవి అణుపరిమాణములు (అతిసూక్ష్మములు) అని స్పష్టమగుచున్నది.

275 సూ — శ్రేష్ఠశ్చ (2) 2-4-7

అర్థ— శ్రేష్ఠః+చ=ముఖ్యప్రాణముకూడ సృజింపబడుచున్నది.

వివ — "ఏతస్మాజ్జాయతే ప్రాణః" (ముం- 2-1-3) "ఈ పరమాత్మనుండి ప్రాణము పుట్టుచున్నది" అనుశ్రుతినిబట్టి ముఖ్యప్రాణము

(ప్రాణాపానవ్యానోదానసమానభేదములతో నుండునది) సైతము పర
మాత్మనుండి జన్మించుచున్నదని భావము.

## 64 వాయుక్రియాధికరణము 4 (4)

### ముఖ్యప్రాణము వాయుమాత్రముకాదు.

276 సూ — న వాయుక్రియే పృథగుపదేశాత్ (1) 2-4-8

అర్థ — న వాయుక్రియే = (ప్రాణాపానాది రూపమున నుండు ప్రాణము) కేవలము వాయువుగాని, దానిచలనము (ఉచ్ఛ్వాస నిశ్వాసములు) గాని, న = కాదు, పృథక్ = వాయువుకంటే వేరుగా, ఉపదేశాత్ = ఉపదేశించియుండుటవలన.

వివ — "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణి చ, ఖం వాయుః"(ముం-2-3-1) "ఈపరమాత్మనుండి ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములు, ఆకాశము, వాయువు, జనించుచున్నవి" అనుశ్రుతి యందు వాయువుకంటె భిన్నముగ ప్రాణమును పేర్కొనుటచే కేవల వాయువు మాత్రము ప్రాణముకాదు. దేహధారణసమర్థమైనవాయువే ప్రాణమని భావము. వాయుక్రియ ప్రాణమనుట అసంగతము. "ప్రాణము స్పందించుచున్నది" అని వ్యవహరించుచున్నాము గదా!

277 సూ — చక్షురాదివత్తు తత్సహశిష్ట్యాదిభ్యః (2) 2-4-9

అర్థ — చక్షుః + ఆదివత్ + తు = (ప్రాణము అగ్న్యాదులవలె మరియొక భూతము కాదు) చక్షురాదులవలె జీవునకు ఉపకరణము. (జీవనసాధనము) తత్ = ఆ విషయము, సహశిష్ట + ఆదిభ్యః = ఇంద్రియములతో కలిపి ఉపదేశించుటవలనను; వానిలో ఈప్రాణము ముఖ్యమైన దగుటవలనను.

వివ — "సర్వే ప్రాణాః అహం శ్రేయసే వివదమానాః"

(ఛా- 1-5-3) అను శ్రుతి చక్షురాదీంద్రియములతో ప్రాణములనుకూడ పేర్కొనుటచే ఇంద్రియములవలె ప్రాణములను జీవోపకరణములని స్పష్టమగుచున్నది. "అథయోఽయం ముఖ్యప్రాణః" (ఛా-1-5-3) అనుటచే ఈ ప్రాణము ముఖ్యమనియు తెలియుచున్నది. కావున శరీరధారకమైన ప్రాణము జీవోపకరణము అని భావము.

278 సూ — అకరణత్వాచ్చ న దోషస్తథాహి దర్శయతి (3) 2-4-10

అర్థ — అకరణత్వాత్ + చ = చక్షురాదులవలె ముఖ్యప్రాణము జీవునకు ఉపకరణముకాదు తథా = ఆ విధముగ, దర్శయతి హి = శ్రుతి చెప్పుచున్నది గదా!

వివ — ముఖ్యప్రాణము చక్షురాదులవలె ఉపకారకము కాకున్నను, శరీరధారణముద్వారా ఉపకరణమగుచున్నది, "యస్మిన్నుత్క్రాంతే ఇదం శరీరం పాపిష్ఠతరమివ దృశ్యతే స వశ్శ్రేష్ఠః" (బృ-6-1-7) "ఏవడు శరీరమును విడిచి వెళ్ళినచో ఈ శరీరము పాపిష్ఠముగ తలంపబడునో అతడు మీలో శ్రేష్ఠుడు" అను శ్రుతిగాదులు ఉత్క్రమించినను శరీరమునకు హాని కలుగదు; కాని ముఖ్యప్రాణము ఉత్క్రమించినచో అది నిష్ప్రయోజనమగునని తెలుపుటచే ప్రాణము శరీరధారణోపకరణ మనుట స్పష్టము.

279 సూ — పంచవృత్తిర్మనోవద్వ్యపదిశ్యతే (4) 2-4-11

అర — మనోవత్ = మనస్సువలె, పంచవృత్తిః = అయిదు విధములైన ప్రవృత్తులు కలదిగ, వ్యపదిశ్యతే = (ముఖ్యప్రాణము) ఉపదేశింపబడుచున్నది.

వివ — "కామస్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతిరధృతి ర్హ్రీర్ధీర్భీరిత్యేతత్సర్వం మన ఏవ" (బృ-3-5-3) "కోరిక, సంకల్పము సందేహము, శ్రద్ధ, అశ్రద్ధ, ధారణ, అధారణ, లజ్జ, ప్రజ్ఞ భయము"

ఇవి యన్నియు మనస్సే" అనుచు శ్రుతి కామసంకల్పాదులు మనో వృత్తిభేదములు అని తెలిపినట్లే— "ప్రాణోఽపానో వ్యాన ఉదాన స్సమానఇత్యేతత్సర్వం ప్రాణఏవ" (బృ-3-5-3)"ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము ఇవియన్నియు ప్రాణమే"అనుచు ముఖ్యప్రాణమే ప్రాణాప్రానాదిభేదమున అయిదువిధములుగ నున్నట్లు తెలుపుటచే ప్రాణాపానాదులును ప్రాణమే అని భావము.

## 65 శ్రేష్ఠత్వాఽణుత్వాఽధికరణము 5

280 సూ — అణుశ్చ 2-4-12

అర్థ — అణుః + చ = ముఖ్యప్రాణము అణుపరిమాణము గలదియు నగుచున్నది.

విష — "త ముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి" (బృ-6-4-2) "శరీరమునుండి ఉత్క్రమించు జీవుని అనుసరించి ముఖ్య ప్రాణము ఉత్క్రమించుచున్నది" అను శ్రుతి ముఖ్యప్రాణముయొక్క అణుత్వమును బోధించుచున్నది. శరీరధారణాదికము సర్వము ముఖ్య ప్రాణాఽధీన మగుటచే దాని శ్రేష్ఠతయు స్పష్టమే గదా!

## 66 జ్యోతిరాద్యధిష్ఠానాఽధికరణము 6 (2)

281 సూ — జ్యోతిరాద్యధిష్ఠానం తు తదామననాత్ప్రాణవతా శబ్దాత్ (1) 2-4-13

అర్థ — ప్రాణవతా = జీవునితోబాటు, జ్యోతిః + ఆది + అధి ష్ఠానం తు = వాక్కు మొదలగు ఇంద్రియములకు అగ్ని మొదలగు వారు అధిష్ఠానదేవతలుగా ఉండుట, తత్ + ఆమననాత్ = ఆ పరమాత్మ యొక్క సంకల్పమువలన సంభవించుచున్నది. శబ్దాత్ = శ్రుతివలన ఈ విషయము స్పష్టము చేయబడినది.

వివ — వాగాదీంద్రియములకు జీవునితోబాటు అగ్న్యాదులును అధిష్ఠాతలు అని శ్రుతి చెప్పుచున్నది. ఇదియు పరమాత్మసంకల్పము వలననే అని తెలియవలయునని భావము. (ఆమననం = అభిముఖ్యేన మననం = సంకల్పః).

282 సూ — తస్య చ నిత్యత్వాత్ (2) 2-4-14

అర్థ — తస్య — ఆ పరమాత్మ సంకల్పము, నిత్యత్వాత్ + చ = నిత్యమైనదగుటవలన. (ఇది సంభవము)

వివ — పరమాత్మ సంకల్పము నిత్యమైనది. ఆ సంకల్పము లేనిది ఏదియు జరుగదు. కావున వాగాదీంద్రియములకు అగ్న్యాదులును అధిష్ఠానతలగుట పరమాత్మ సంకల్పాధీనమని భావము.

## 67 ఇంద్రియాధికరణము 7 (2)

ఇంద్రియములు, ముఖ్యప్రాణము భిన్నములు.

283 సూ — త ఇంద్రియాణి తద్వ్యపదేశాదన్యత్ర శ్రేష్ఠాత్ (1) 2-4-15

అర్థ — శ్రేష్ఠాత్ = ముఖ్యప్రాణముకంటె, అన్యత్ర = ఇతరత్ర, తే = ఆ ప్రాణశబ్దముచే పేర్కొనబడు ప్రాణములు, ఇంద్రియాణి = ఇంద్రియములు, తత్ + వ్యపదేశాత్ = ముఖ్యప్రాణ వ్యతిరిక్తములైన ప్రాణములను మాత్రమే ఇంద్రియశబ్దముచే పేర్కొనియుండుటవలన.

వివ — "ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః" (భ.గీ. 13-5) "ఇంద్రియములు పదునొకండు. ఇంద్రియములకు గోచరించునవి అయిదు" అనుటచే ముఖ్యప్రాణ వ్యతిరిక్తప్రాణములను మాత్రమే ఇంద్రియములని వ్యవహరింతురు అని భావము.

284 సూ — భేదశ్రుతేర్వైలక్షణ్యాచ్చ (2) 2-4-16

అర్థ— భేదశ్రుతేః = ప్రాణమునకు, ఇంద్రియములకు భేదమును తెలుపు శ్రుతివలనను, వైలక్షణ్యాత్ + చ = ఇంద్రియములు విశ్రమించినను ప్రాణము పనిచేయుచుండును అను వైలక్షణ్యమువలనను ప్రాణము, ఇంద్రియములు భిన్నములు.

వివ — "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణి చ" (ముం-2-1-3) "ఈ పరమాత్మనుండి ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములు జనించుచున్నవి" అను శ్రుతి ఉత్పత్తి సమయమున ప్రాణమును, ఇంద్రియములను వేర్వేరుగపేర్కొనుచున్నది. ఇంద్రియములు విశ్రమించినను ప్రాణము విశ్రమించుటలేదు గదా! కావున ముఖ్యప్రాణము, ఇంద్రియములు భిన్నములని స్పష్టమగుచున్నది.

శ్రీశంకరభాష్యము ననుసరించి "భేదశ్రుతేః" అనునది ఒక సూత్రముగను "వైలక్షణ్యాచ్చ" అనునది వేరొకసూత్రముగను కన్పట్టుచున్నది.

## 68 సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణము 8(3)

### సమష్టిసృష్టివలె వ్యష్టిసృష్టియు బ్రహ్మకార్యమే.

285 సూ — సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్ (1) 2-4-17

అర్థ — సంజ్ఞామూర్తిక్లృప్తిః + తు = నామరూపకల్పనాత్మకమైన వ్యష్టిసృష్టి, త్రివృత్కుర్వతః = త్రివృత్కరణము గావించినవానికే ఉపపన్నము. ఉపదేశాత్ = ఆ విధముగ శ్రుతి చెప్పుటవలన.

వివ — "అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి." (ఛా-6-3-2) "ఈజీవునిద్వారా పృథివ్యాదులయందు ప్రవేశించి, నామరూపాత్మక (వ్యష్టిసృష్టి) సృష్టిని గావింతును" అనుటచే చతుర్ము

భాంతర్యామియైన పరమాత్మయే చేతనాఽచేతన పదార్థసృష్టికర్త యని తెలియుచున్నది. ఈ పరమాత్మయే గదా "తాసాం త్రివృతం త్రివృతమేకైకాం కరవాణి" (ఛా- 6-3-2) "ఆ తేజోజలపృథివీతత్త్వము లను ఒక్కొక్కదానిని తక్కినవానితో మిశ్రితము గావింతును" అనుచు త్రివృత్కరణము గావించినది. ఇది సమష్టిసృష్టి. ఇట్లు త్రివృత్కృతములైన తేజోజలపృథివీతత్త్వములచే బ్రహ్మాండము సృష్టింపబడుచున్నది. అందు పరమాత్మనాభీకమలమున చతుర్ముఖ బ్రహ్మ జనించును. (తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభం తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మ" (మను.స్మృ-1-9) ఈ రీతిని చతుర్ముఖబ్రహ్మోత్పత్తికి ముందే త్రివృత్కరణము జరిగినందువలన త్రివృత్కరణము గావించిన పరమాత్మయే చతుర్ముఖబ్రహ్మాంతర్యామియై వ్యష్టిసృష్టి గావించుచున్నాడని భావము. త్రివృత్కరణమనగా - తేజస్సు, జలము, పృథివి అను మూడు భూతములను పరమాత్మ సృజించి, ఒక్కొక్క దానిని రెండేసి భాగములుగ తొలుత విభజించును. పిమ్మట వాని మొదటి అర్ధభాగములను మరల రెండేసిగవిభజించి, వీనిలో ఒక్కొక్క భాగమును దానికంటె భిన్నమైన తక్కిన రెండుభూతములతో కలిపివేయును. దీనినే త్రివృత్కరణము అని యందురు. ఇపుడు ఆ తత్త్వముల మిశ్రణము ఈ పాళ్ళలో ఉండును.

1. తేజస్సు 1/2; జలము 1/4; పృథివి 1/4
2. జలము 1/2; తేజస్సు 1/4; పృథివి 1/4
3. పృథివి 1/2; తేజస్సు 1/4; జలము 1/4

ఇట్లే పంచీకరణమును కూడ గ్రహించునది.

286సూ—మాంసాదిభౌమం యథాశబ్దమితరయోశ్చ(2)2-4-18

అర్థ — యథాశబ్దం = శ్రుతినిజట్టి, మాంస + ఆది = మాంసము మొదలైనవి. భౌమం = భూతత్త్వమునకు చెందినవి, ఇతరయోః + చ =

ఇతరములైన తేజోజలవికారములును ఆయా తత్త్వములకు చెందినవి యగుచున్నవి.

వివ — "అన్నమశితం త్రేధా విధీయతే........తస్య యః స్థవిష్ఠో ధాతుః తత్పురీషం, యో మధ్యమః తన్మాంసం, యోఽణిష్ఠః తన్మనః" (ఛా–6–5–1) "మనము భుజించిన అన్నము మూడువిధములుగ పరిణమించుచున్నది. అందు ఘనిష్ఠమైన భాగము మలముగను, మధ్యమమైనది మాంసముగను, సూక్ష్మమైనది మనస్సుగను పరిణమించుచున్నది" ఇట్లే మనము త్రాగిననీరు మూత్రము, రక్తము, ప్రాణముగ పరిణమించుచున్నది. మనము భుజించిన తేజస్సు ఎముకలు, మజ్జ, వాక్కుగ పరిణమించుచున్నది. అన్నమున ఏర్పడిన పురీషమాంసమనస్సులు భౌమములు. జలమువలన ఏర్పడిన మూత్ర రక్త ప్రాణములు జలసంబంధమైనవి. తేజస్సువలన ఏర్పడిన అస్థి మజ్జావాక్కులు తైజసములు. దీనిని త్రివృత్కరణముగ భ్రమింపరాదు. పురుషుడు భుజించిన అన్నాదులు ఇట్లు పరిణమించుచున్నవి. ఆ అన్నాదులు అంతకు ముందే త్రివృత్కృతములై యున్నవి గదా, కావున చతుర్ముఖ బ్రహ్మసృష్టియందును అన్నాదులలో త్రివృత్కరణము చూపట్టుటచే ఆ చతుర్ముఖబ్రహ్మయే వ్యష్టిసృష్టికర్త అని తలంపరాదు. అతనిలో అంతర్యామిగ ఉన్న పరమాత్మయే సృష్టికర్త అని భావము.

287 సూ — వైశేష్యాత్తు తద్వాదస్తద్వాదః (3) 2–4–19

అర్థ — వైశేష్యాత్ + తు = తన భాగవిశేషమునుబట్టి, తత్ + వ్యపదేశః = తేజస్సు, జలము, పృథివి అను వ్యవహారము ఏర్పడుచున్నది.

వివ — తేజస్సు, జలము, పృథివి త్రివృత్కృతములైన పిదవ తేజస్సు, జలము, పృథి అనిఎట్లువ్యవహరింపబడుచున్నవిఃఅని

శంకింపనవసరము లేదు. అయా భూతముల అధికాంశమునుబట్టి అట్టి వ్యవహారము ఏర్పడవచ్చును. "తద్వ్యాదస్తు తద్వాదః" అను సూత్రాభ్యాసము అధ్యాయపరిసమాప్తికి సూచకము.

ద్వితీయాధ్యాయ చతుర్థపాదార్థసంగ్రహశ్లోకము—

శ్లో॥ అక్షాణాం జన్మ సంఖ్యాపరిమితయ ఇహ ప్రాణవాయోః స్వరూపం,
తత్సౌక్ష్మ్యం దేవతాదేస్తదుభయవిషయాధిష్ఠితౌ పారతంత్ర్యమ్।
ప్రాణస్యాఽనింద్రియత్వం బహువిధచిదచిద్వ్యష్టినామాది చాద్యా
త్వంచీకర్తుః స్వశాభిప్రశవకవచితాదూచరే ప్రాణపాదే ॥

భా — ఈ ప్రాణపాదమునందు ప్రాణోత్పత్త్యధికరణమున ఇంద్రియములును జనించునవని, సప్తగత్యధికరణమున ఆ ఇంద్రియములు పదునొకండు అని, ప్రాణాఽణుత్వాధికరణమున ఇంద్రియములు అణువులు అని, వాయుక్రియాధికరణమున ప్రాణముసాధారణవాయువు కాదని, శ్రేష్ఠాణ్వాఽణుత్వాధికరణమున ప్రాణముల సూక్ష్మత్వమును, జ్యోతిరాద్యధిష్ఠానాఽధికరణమున అగ్న్యాదిదేవతలు భగవత్సంకల్పానుసారముగ వాగాదీంద్రియములకు అధిష్ఠాత అగుచున్నారని, ఇంద్రియాధికరణమున ప్రాణములు ఇంద్రియములు కావని, సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణమున తన నాభీకమలమున జనించిన చతుర్ముఖబ్రహ్మకు అంతరాత్మగా ఉన్న పరమాత్మ శ్రీమన్నారాయణుడే వ్యష్టిసృష్టికి కర్తయని విశదముగ నిరూపింపబడినది.

ద్వితీయాధ్యాయ చతుర్థపాదము సమాప్తము,
ద్వితీయాధ్యాయము సమాప్తము.
శ్రీభాష్యసార ప్రథమభాగము సమాప్తము.

—౦—